నవయుగవాఙ్మయతరంగములు ౨.

# ప్రాచీనవిద్యాపీఠములు.

గ్రంథకర్త

చిలుకూరి నారాయణరావు

పంతులుగారు, ఎమ్. ఏ., ఎల్. టి.




ప్రకాశకులు:

జాతీయ సారస్వత నిలయము

రాజమహేంద్రవరము.

[వెల ౧ రూపాయి.

Rs 2/-
SHELF LISTED
Te
378.54
N511

డి. వి. రమణా రావుగారిచే

శ్రీ విద్యానిలయ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది,
రాజమహేంద్రవరము : ౧౯౨౧.



B

# ఉపోద్ఘాతము

ఆంధ్రవిశ్వవిద్యాలయముం గూర్చి చాలకాలమునుండి యాలోచించుచు నట్టిదొకటి స్థాపితమైనచోఁ దెలుఁగువారు విద్యావిషయమున శీఘ్రముగ ముందంజ వేయఁగలర్పని యనేకులు తలంచుచుండిరి. ఆయూహ లిప్పుడిప్పుడు క్రియారూపమునఁ బరిణమించునేమో యను సూచనలు కానవచ్చుచున్నవి. చెన్నపురి విశ్వవిద్యాలయమువారును, నిండియాప్రభుత్వమువారును నట్టి సర్వకళాస్థాపనమునకుఁ దమ సమ్మతిని దెలియఁజేసియున్నారు. కాని, డబ్బులోపమే తక్కినయభివృద్ధికరములగు ప్రతిష్ఠాపనలకువలె దీనికిని నడ్డువచ్చుచున్నది. ఈలోపున హిందూ విశ్వవిద్యాలయము స్థాపితమైనది. ఉస్మానియా విశ్వవిద్యాలయము తలయెత్తినది. పాట్నావిశ్వవిద్యాలయము పొడసూపినది. మైసూరున విశ్వవిద్యాలయము నెలకొల్పబడినది. తిరువాన్కూరునం దొకదానిని నెలకొల్ప ప్రయత్నములు జరుగుచున్నవి. కలకత్తావిశ్వవిద్యాలయములో "స్లాడర్ కమిషను" వారి యుపదేశముపైని గొప్పమార్పులు జరిగినవి. ఈరీతిగా నాయాభాషల మాటలాడువారికి విశ్వవిద్యాలయములు లభించినవిగాని, మొదటినుండియుఁ బోరుచున్నయాంధ్రుల యాందోళన మింకను గంతశోషగనే మిగిలియున్నది.

కాని, యీయాలస్యమే యొకతీరున లాభకరముగా నున్నట్లు తోఁచుచున్నది. తక్కినవారికి విశ్వవిద్యాలయములు లభించినవన్న గొప్పతప్పు వారు జుఱ్ఱుకొన్న దేమి? మనము జుఱ్ఱుకొనని దేమి? వారియం దట్టి స్థాపనలవలన జ్ఞానప్రవాహము పొంగిపొరలిపోలేదు. మునుపటివలెనే పుస్తకస్థవిద్యయు, టెస్టుట్యూబుల రసాయనశాస్త్రమును, ఐరోపాఖండవాసులచరిత్రయు, ప్రభుత్వమువారి కచేరీలలో లెక్కలుకూడుట కుపయోగించు గణితమును, నానాఁటికడుగంటిపోవుచుండు దేశభాషలును, అన్నిటిని నింగ్లీషుభాషలోనే నేర్చికొనవలయునను నియమములునేగదా యెచ్చటచూచినను కానఁబడుచున్నవి. పరీక్షలవలనఁ గలుగు నన్యాయము తగ్గినదా? దేశభక్తిప్రబోధములగు విద్యలు వచ్చినవా? దేశీయుల బుద్ధివికాసమునకుఁ దోడ్పడు పరిస్థితు లేర్పడినవా? ఇండియాదేశస్థుల ప్రతిభను బైటికిఁ దెచ్చు ప్రయత్నములు జరుగుచున్నవా? విద్యార్థులసంఖ్య హెచ్చుగుటచే నింతమందికిని నొక్క విశ్వవిద్యాలయము పరీక్షలు సలుపలేకపోవుటచే నిన్ని సర్వకళాశాలలు బయలుదేరినవిగాని, యుత్కృష్టవిద్యావిధానములనారసి భారతజాతీయతనుండియు భారతనాగరకతనుండియు నితరదేశములు పూర్వమువలె నేర్చికొనఁజేయుటకు గాదు. పై విశ్వవిద్యాలయములవంటిదే యాంధ్రులకు లభించినచో నేకార్యమును నుండదు. ధనవ్యయముచేసి యిప్పటికే హె-

చ్చుగానున్న పన్నులను వృద్ధిపఱ ... ప్యముకాదు. ఆర్యు లజాతీయతకు స్వరూపమునొసంగి వారినిఁగూడ ప్రపంచము నందలి ప్రజలతో సమానులగాఁ జేయఁగల విద్య లభింప నప్పుడు మన తమిళసోదరులతోడనే గలసియుండుట శ్రేయ స్కరమైనట్లు తోఁచుచున్నది.

"విశ్వవిద్యాలయ మనునదొక యాత్రాస్థలము. ఇచ టికి నానాదేశములనుండియును నానావిధములగు జ్ఞానమును సంపాదించుటకు విద్యార్థులు జ్ఞానతృష్ణచేఁ జేరుచుందురు. అన్నివిధములగు జ్ఞానమునందును నుత్కృష్టమైనది ప్రతిష్ఠల మునందును నుండదు. కావున నట్టియుత్కృష్టవిజ్ఞానమంతయు నొకచోఁ జేరియున్న కేంద్రస్థానమునకుఁ బోవలయును. ఇచట ప్రకృతియందును, గళలయందును నతిమనోహరములగు వస్తువులు చేర్పఁబడి తమ కుచితములగు స్థానములయందు కూర్పఁబడియుండును. ఆ దేశమునందలిదేగాక ప్రపంచమందలి ధనమంతయు నచట చేరియుండును. గొప్ప సంతలన్నియు నచటనే జరుగును. మంచిపనివాం డ్రందరును నచటికి చేరు దురు. అది వర్తకమునకు మూలస్థానము, నాగరకతకు పర మనిధానము, వివిధనైపుణ్యములకు మధ్యవర్తి, అమూల్యము లగుపదార్థముల నిర్ణయింపఁగల గీటురాయి. అతిమనోహర ములగు చిత్రపటముల వరుసల జూచుటకును, నత్యద్భుతజ్ఞాన భరితములగు వాక్కులవినుటకును నది నెలవు. గొప్పమత

ప్రచారకులకును, మహావక్తలకును, ధనసంపన్నులకును, రాజనీతివేత్తలకును నది యాటపట్టు. గొప్పతనమును నైకమత్యమును స్వాభావికముగాఁ గలసియే కాన్పించుచుండును; శైత్య్ర్యమనునంతనే యొకకేంద్రస్థానము కావలసియుండును. ఇట్టిదియే "విశ్వవిద్యాలయ" మని మూడవసారి, నాల్గవసారికూడఁ జెప్పినను శ్రోతలకు విసుగు జనింపదని తలంచెదను. ఈకేంద్రస్థానమునకు వేనవేలు పాఠశాలలయందలి విజ్ఞానము చేరుచుండును. ఇచట బుద్ధి కెట్టిశృంఖలములును నుండవు; అది యథేచ్ఛముగా సంచరించుచు తనకు విరోధియగు దానితో వాదములు సల్పుచు సత్యమనుపరిషత్తు నాజ్ఞలకుమాత్రమే లొంగియుండును. ఇచట మనస్సునకు మనస్సుతోడను, జ్ఞానమునకు జ్ఞానముతోడను సంఘర్షణము సమకూరుచుండ తత్త్వార్థవిచారము వడిగ జరుగుచుండును. క్రొత్తవిషయములు బయలువెడలుచుండును; వాని సత్యాసత్యములు నిర్ణయింపఁబడుచుండును; తొందరపాటుతనమువలన నేయపాయమును సంభవింపకుండును; అసత్యము బయలుపెట్టబడుచుండును. ఇచట నధ్యాపకుఁడు తనకు తెలిసినదానిని గంటమ్రోగించునట్లు పలుకుచు, ధర్మబోధకుఁడు, ప్రచారకుఁడున్నై మనోహరవాగ్గుంభనలతో వినువారియందును దానుప్రేమించుసత్యమే పాదుకొనునట్లు చేయుచుండును. ఇచటి ప్రాశ్నికుఁడు దినదినమును క్రొత్తతత్త్వములను నేర్చికొనుచు,

వికసించుచుండు బుద్ధియందు వానిని లీనముచేయుచుండును. దాని ప్రసిద్ధివలన చిన్నవారును, మనోహరత్వమువలన యువకులును, దానితోడి సాంగత్యమును దలంచికొనుచు వృద్ధులును సంతోషమునొందుచు దానిని మఱువకుందురు. ఇది జ్ఞానమునకు నెలవు. ప్రపంచమున లోకజ్యోతి. విశ్వాసమునకు తావు. మున్ముందు పౌరత్వమును వహింపఁబోవువారికి మాతృగృహము. ఇంతియేగాక యిది యింతకంటె నెక్కువ. దానిని వర్ణించుటకు నాకంటెఁ బ్రజ్ఞావంతుఁడు కావలెను."

"న్యూమను" విశ్వవిద్యాలయము ఎట్టిదై యుండవలెనో పై వాక్యములందు చెప్పియున్నాడు. ఈతఁడు పూర్వమధ్యయుగములయం దైరోపాయందలి ఏథెన్సు, ప్యారిసు, డబ్లిను, ఆక్సుఫోర్డు మొదలగు విద్యాపీఠములందు నెలకొని యుండిన విద్యావిధానములఁ బరిశీలించి వానికిని నేఁడు విశ్వవిద్యాలయములను పేరఁ బరఁగువానికిని నెంతయో వ్యత్యాసమున్నదనియు, నిప్పటివి కేవల వణిక్సంఘములుగాఁ బరిణమించినవనియుఁ, బూర్వపుటాదర్శములఁ దిరిగి యిప్పటివానియందు నెలకొల్పవలయుననియుఁ జెప్పియున్నాఁడు.

మన విశ్వవిద్యాలయములన్నియు న్యూమను వ్రాసిన ట్లింగ్లీషువిద్యాపీఠములు హీనస్థితియం దున్నప్పుడు నాసిమాదిరిగనే స్థాపింపఁబడినవి. వీనిని నెలకొల్పువారు మనదేశమునందలి విద్యాసంప్రదాయములను దలంచియుండలేదు. మ

నదేశపు ప్రతిభను లక్ష్యపెట్టియుండలేదు. ఇండియాదేశస్థుల విజ్ఞానమంతయు వేఱుయుంచబడినది. అంతకంతకు చిన్నచిన్న మార్పులు కలుగుచువచ్చెను. ఈపద్ధతి బాగులేదని యాపద్ధతిని, అది బాగులేదని దీనిని తెచ్చిపెట్టుకొని క్రిందుమీదులు పడుటతోడనే కాలము గడచిపోవుచున్నది. ఈలోపున విద్యార్థుల బుద్ధులు మందగిల్లుచున్నవి. వేషభాషలు మాఱిపోవుచున్నవి. అవగుణము మిగిలి గుణము లంతరించి పోవుచున్నవి.

పూర్వకాలమున విద్యావిధాన మెట్లుండెను? అచటివిద్యావిషయము లెవ్వి? ఎచ్చటెచ్చట నెట్టి విద్యాపీఠము లుండెను? వానియందలి గుణము లేవి? ఆగుణములు మన ప్రస్తుతవిద్యయం దున్నవా? లేకుండిన నేల లేవు? వానిని తిరిగి తెచ్చిపెట్టుటకు వలయుమార్గము లేవి? అను విషయములఁగూర్చి యితరదేశస్థు లాలోచించుకొనుచు నభివృద్ధిమార్గముల నవలంబించుచున్నట్లే, మనమును మనకు వలయు విద్యఁగూర్చి యాలోచించుకొనకయే ధనవ్యయముచేసి విశ్వవిద్యాలయ నామధారిణులై యితరదేశానుకారిణులగు పాఠశాలలను స్థాపించుట యనర్థదాయకము.

ఇట్టి యాలోచనలు మనస్సున నిండికొనియుండ, నీవిషయమై కొంత తెలిసికొనవలయునని బుద్ధిపుట్టి పూర్వకాలమున నుండిన విద్యనుగూర్చియు, నప్పటి విద్యాపీఠములఁగూర్చియుఁ

జదువుచు వచ్చితిని. నాదృష్టిపథమునఁబడిన కొలఁది విషయముల నీ చిన్నిపుస్తకమునఁ బొందుపఱచియున్నాను. ఆయావిద్యాపీఠములఁగూర్చి సంపూర్ణముగా వ్రాయుటకుఁగాని, యందు సాగుచుండినవిద్యఁగూర్చి సంపూర్ణముగా వ్రాయుటకుగాని నాయందుబడిలోనున్న పరికరములు తక్కువ. అయినను నాకు తెలిసిన యీకొలఁదివిషయములనైన నితరులు వినఁగోరుదురను నుద్దేశముతో నీపుస్తకమును ప్రచురింపనీయకొంటిని. ఇంక నెన్నియో విద్యాపీఠములఁగూర్చి వ్రాయవలసియే యున్నది. ఈగ్రంథము నాంధ్రలోక మెట్లాదరించునో చూచికొని పునర్ముద్రణమున మఱికొన్ని విద్యాపీఠములఁ గూర్చి వ్రాయఁదలంచియున్నాను.

రాజమహేంద్రవరము
18—9—21

గ్రంథకర్త.

# విషయసూచిక

# అనుబంధములు

# దిఙ్నాగాచార్యులవారు.

ఆంధ్రులు: వేంగీవిశ్వవిద్యాలయమునకు అధ్యక్షులు. (క్రీ. శ. ౫౦౦.)



“౧౫౧౦వ పుటలో జినబోధిసత్త్వుఁడని ఈతని పేరు వ్రాయఁబడియున్నది. చీనాభాషలోని ఈతని నామమును ‘జిన’యని పాశ్చాత్యులు అనువదించి రనియు, దానికి సరియైనయనువాదము దిఙ్నాగుఁ డనియు సతీశచంద్రవిద్యా భూషణులవారు చెప్పుచున్నారు. పైపటమునందు జూపఁబడిన టోపీయును, శాలువయున్ను ప్రాచీనవిద్యాపీఠములలో మహాపండితులు గౌరవచిహ్నముగ ధరించుచుండువారు. తలచుట్టునున్న పరివేషము దిఙ్నాగుఁడు బోధిసత్త్వుఁ

శ్రీరస్తు.

# ప్రాచీనవిద్యాపీఠములు.

## బ్రాహ్మణవిద్య.

---

ఓమ్ సహనావవతు, సహనౌ భునక్తు, సహవీర్యంకరవావహై, తేజస్వినావధీతమస్తు, మావిద్విషావహై, ఓమ్ శాంతిః శాంతిః॥

"(ఆపరమాత్మ గురుశిష్యుల మగు) మమ్మిద్దఱను రక్షించుగాక! మమ్మిరువురను ముక్తివలనఁ గలుగు నానందమును) అనుభవింపఁజేయుగాక! మే మిద్దఱమును గలిసి (వేదముల యర్థమును గనుఁగొనుటకు) యత్నము సల్పెదముగాక! నేర్చికొనినది మాకుఁ బ్రయోజనకారి యగుగాక! మా యిరువురకు నెప్పుడును కలహము పుట్టకుండునుగాక!"

శిష్యునిం గురుఁడింటికిఁ దెచ్చి యాతని కధ్యయనారంభము చేయునప్పుడు వచించునీవాక్యములయం దార్యవిద్య కొనసాగుటకు వలయుముఖ్యపరిస్థితులున్న, ఆవిద్యవలని ప్రయోజనమును, అట్టివిద్య నభ్యసించుటకుఁ గావలసినయధికారమును, ప్రయోజనమును సంపాదించుటకు వలయుకృషి

యు, అట్లభ్యసించుకాలమున గురుశిష్యుల కుండవలసిన సంబంధమును క్లుప్తముగాఁ దెలుపఁబడియున్నవి.

ఎంతటిదీక్ష యుండినను, ఎంతటియుత్సాహ మున్నను, పరమేశ్వరానుగ్రహము లేనిదే, యేకార్యమును గొనసాగదు. ఆపరమాత్మ మనుష్యప్రయత్నమును గ్రహించి, దానియందలి నిర్మలస్వభావమువలనఁ బ్రీతిఁ బొంది, ప్రారంభింపఁబడినకార్యము కొనసాగఁజేయుచుండు ననువిశ్వాసముతో నేపనినైనను మొదలిడవలయును. కావుననే యాయాకర్మముల నాచరించుటకుఁ బూర్వము మనవారు కొన్నికర్మములను నియమించుచువచ్చిరి. ఆకర్మములయందు పరమాత్మను ధ్యానించి యాయాకార్యములకు వలయుశ్రద్ధ, యుత్సాహము, బుద్ధికుశలత మొదలగువానిని బ్రసాదింపుమని యాతనిఁ బ్రార్థించుట విధియై యున్నది. సర్వకర్మములును శ్రీపరమేశ్వర ప్రీత్యర్థమే చేయఁబడవలయును. కావున విద్యాస్వీకరణము నకు ముందుగా గురుశిష్యు లిరువురును పరమేశ్వరునిరక్షణను వేడికొనుట విధియై యున్నది.

విద్యవలనిప్రయోజనము ముక్తియే యని మనవారు తలంచిరి. ఆత్మకు దేహముతో సంబంధ మున్నంతకాలమును సంసారబంధములు పెరుగుచుండును. అందుచే దుఃఖమును హెచ్చగుచుండును. ఈదుఃఖము నశింపఁజేయుమార్గమును దెలిసికొని యామార్గము ననుసరించి మఱి సంసారమునఁ జి

క్కి కొనకుండ సర్వదుఃఖముల నంతము నొందించి శాశ్వతా
నందమును బొందుటయే విద్యవలని ప్రయోజనము. ఆముష్మి
కవిద్య యేవిద్య. ఐహికవిద్య లోకయాత్రయందాయాయాశ్ర
మములందు కావలసియున్నను, అంత్యమునఁ బనికివచ్చునది
పరమాత్మను దెలియఁజేయు విద్యయే. పొట్టకూటికొఱకు క్షు
ద్రవిద్య లెన్ని నేర్చినను ప్రయోజనము లేదు.

ఈమే మిద్దఱమును గలిసి వేదములయర్థమును గనుఁ
గొనఁ బ్రయత్నములు సల్పెదముగాక యనుటయందధ్య
యనపద్ధతి సూచింపఁబడినది. అనాదిగ వచ్చుచున్న వేదము
తనతో విచ్ఛిన్నము కాకుండ లోకమునఁ గొనసాగఁజేయుట
యే గురువు జేయఁదగిన కార్యము. శిష్యులు గురువునొద్దఁ జే
రి, వేదములను వల్లించి, మఱచిపోకుండునట్లు స్వరయుక్తము
గ పద, క్రమ, జటా, ఘనములతో నేర్చికొని, యింక మఱ
పురాదను ధైర్యము కలుగువఱకును అధ్యయనము చేసినంత
నే గురువు చేయవలసినపని యగును. అప్పటికి గురువునకు
తాను గతించినను దనశిష్యునిమూలమున వేదము భూమిపై
నిలిచియుండు ననుధైర్యము పుట్టును. ఇఁక నావేదములయర్థ
మును గనుఁగొనుటకు ప్రయత్నములు జరుగును. ఈయర్థము
ను గనుఁగొనుటయందు గురువు తన చెప్పినయర్థమే సరియైన
దని సాహసింపఁడు. ఈయర్థము గురుశిష్యుల యన్యోన్యస
హాయముచే దెలియవలసినదేకాని, తాను చెప్పినదే నిశ్చ

యు మఱి గురువు తలంపఁగూడదు. గురువు తనగురువువలనఁ దెలిసికొనినయర్థమును ఇతరులు చెప్పినయర్థమును శిష్యుని కెఱిఁగించి, తనయభిప్రాయములఁగూడ వెలిఁబుచ్చును. శిష్యుఁడు వేదము నొప్పఁజెప్పఁగలుగునరికి మంచిబుద్ధిమంతుఁడై యుండును. అతఁడు తనబుద్ధినిగూడనుపయోగించి గురువుగారికంటెఁగొప్పయర్థమును జెప్పఁజాలియుండఁగూడదా? ఎట్లయినను చర్చజరిగినపిదపఁగాని సత్యము తేఁటపడదు. సత్యాన్వేషణమేకదా విద్యవలనిప్రయోజనము. అట్టితఱి నేను గురువను, ఇతఁడు శిష్యుఁడు, నేను పెద్దవాఁడను, ఇతఁడు చిన్నవాఁడు, ఇతఁడు నన్ను మించినయెడల నాగౌరవము తగ్గిపోవును అనుమాటలు పుట్టనేరవు. శిష్యుఁడైనను కొన్నివిషయములందు గురువుకంటె గుణవంతుఁడు కావచ్చును. చిన్నవాఁడైనను పెద్దవానికంటె జురుకైనబుద్ధి కలవాఁడై యుండును. కావుననే గురువుఁదారి చూపి శిష్యునివాదమునందు దోషములు చూపించి సరిచేయుచు, శిష్యుఁడు చెప్పినదానియందు గుణమున్నయెడల దాను సంతోషముతో దానిని స్వీకరింపుచుండును. ఇట్లు చేయుచుఁ బోయినయెడల తేజోవంత మగు పరబ్రహ్మముఁగూర్చిన తత్త్వము గురుశిష్యులకు స్పష్టముగఁ దేటపడును. ఆపరబ్రహ్మతత్త్వమును సంపూర్ణముగఁ దెలిసికొనఁగలవారెవ్వరు? నశ్వరమును, మితప్రవృత్తి కలదియునైన మనుష్యునియాత్మ శాశ్వతమును, అనంతము నగుస్వ

రూపమును దెలిసికొనఁజాలఁడు. కావుననే ప్రయత్నములు చేయుచు, నీయాత్మను క్రమశిక్షయందుంచి బుద్ధికుశలతచే వృద్ధిచేయుచు, రాను రాను పరమాత్మస్వరూపమును దెలిసికొను నధికారమును దానికిఁ గల్పించి తుదకా పరంజ్యోతిని గనుఁగొను స్థితికిఁ దెచ్చుటయే గురుశిష్యులు చేయవలసిన పని. జీవాత్మయుఁ బరమాత్మవంటి స్వభావమును సంపాదించినచోఁ నదియు నాపరంజ్యోతియందు లీనమైపోవును. ఇదియే ముక్తి. ఇందుకొఱకే గురుశిష్యులు పాటుపడుట.

ఇట్లు వీ రిరువురును గలసి యన్యోన్యసహాయముచేఁ దమయాప్తిని తమల నెఱవేర్చుకొనుటకు వీరియందెట్టి ద్వేషమును బుట్టకుండవలయును. గురువు సమర్థుఁడు కాకపోయినను, అవగుణములు కలవాఁడైనను, శిష్యుఁ డాక్షేపింపఁజాలఁడు. కావుననే "వేదాధ్యయనము బాగుగఁ జేసియుండని గురువుం జేపట్టి శిష్యుఁడు అంధకారమునుండి బయలువెడలి యంధకారములోనికే ప్రవేశించును. ఇట్లే వేదాధ్యయనసంపన్నుఁడుగాక గురుత్వమును వహించినవాఁడును, ఆచార్యుఁడుగ నుండఁదగినవానివంశమునందు వేదవిద్య చిరకాలము నుండియు నభ్యసింపఁబడుచు రావలయును. అతఁడును వేదమును సంపూర్ణముగ నధ్యయనముఁ జేసియుండి ధర్మపథముఁ దప్పక యుండవలయును. అట్టిధర్మమార్గమును దప్పినఁ దప్పు మొదటఁ జేకొనినయాచార్యునొద్దనే వేదమును తుద

ముట్ట నేర్చికొనవలయును." అనునియమ మేర్పడినది. *
ఇట్టియున్నతగుణసంపన్నుండగు నాచార్యుండు శిష్యునియెడ నతి వాత్సల్యముకలవాఁడై తనపుత్రునివలెనే యాదరించుచు నాతని కేలోపము లేకుండఁ జూడవలయును. అప్పుడు శిష్యునికి గురువునెడ సంపూర్ణమగుభక్తి కుదురుకొనును. గురుశుశ్రూషయందె యతనికి మనసు తగులుకొనును. శిష్యునికి విహితములైనకర్మముల నాతఁడతిభక్తిశ్రద్ధలతో నాచరించుచుండును. అగ్నీంధన భైక్షచరణములఁ జేయుచు, సత్యవచనమును బాలించుచు, నహరహంబును స్నానముచేయుటఁ దప్పక, గ్రామమునకు బైటనే సంధ్యోపాసనముఁ జేయుచు నుదయము నిలుచుండియు, సాయంత్రము కూర్చుండియు వాగ్యతుఁడై యుదయము సూర్యోదయమునకుఁ బూర్వమునను సాయంత్రము సూర్యాస్తమయమునుండి చుక్కలు కనబడులోపునను ఆసంధ్యావాసనను ముగించి, ఉదయించుచున్నను అస్తమించుచున్నను సూర్యునివంకఁ జూడక, మధు, మాంస, గంధ, మాల్య, దివాస్వప్న, అభ్యంజన, యాన, ఉపానత్, ఛత్ర, కామ, క్రోధ, లోభ, మోహ, వాద, వీణావాదన, ఉష్ణోయావికంఠాసధఃప్రక్షాలన, దంతధావన, హర్ష, నృత్య, గీత, పరివాద, భయము లను వానిని వర్జించి, గురుసమీపమున కంఠమును వస్త్రముతోఁ

* ఆపస్తంబ.

గప్పికొనక, గురువుగారికి పాదములు తగులనీయక, కూర్చున్న
పుడు స్తంభములకును, గోడలకును చేరఁబడక, కాళ్లు చాచి
కొనియుంచక, కాండ్రించి యుమ్మిట, నవ్వుట గర్వపడుట,
మెటికలు విఱుచుట, ఇట్టిపనులను జేయక యాదృచ్ఛికముగ
కంటఁ బడినప్పుడుగాక స్త్రీలవైపు తేరిపారి చూచుట, కామే
చ్ఛచే వారిని స్పృశించుట మొదలగుపనులను జేయక,
ద్యూతము, హీనులసేవ, ఈయఁబడనిదానము, హింస యను
వానిని వర్జించి, ఆచార్యుని, అతనిభార్యను, పుత్రులను
పేళ్లతోఁ బిలువక, బూతుమాటలను, మద్యమును, నిత్యము
నిషేధించి, తనశయ్యయు, ఆసనమును గురువుగారిదానికంటె
క్రిందుగ నుండునట్లు చూచికొని యాతనికంటె ముందుగ
లేచి, యతనిపిదప నిద్రించుచు, వాక్కు, బాహువులు, ఉద
రము ఈమూఁడింటిని దనవశమునం దుంచుకొని, గురువు,
ఆతనిభార్య, పుత్రులు వీరినామముల నుచ్చరింపక తీరనప్పు
డాపేరుతో సమానమగునర్థము గలమఱియొకపేరు చెప్పుచు,
పూజ్యులగువారియెడలను, తనకంటె నధికులయెడలను ఇట్లే
యాచరించుచు గురువుగారిప్రశ్నలకు నిలుచుండి ప్రత్యుత్తర
మిచ్చుచు, గురువు తన్నుఁ జూడలేదుకదా యని పలుక
కుండక, తనకంటెఁ క్రిందిభాగమున నాచార్యుఁడు నిలుచుండి
నను, కూర్చుండినను తనస్థానము క్రిందుగ నుండునట్లు చేసి
కొని యాతనికి దగులుగాలికడ్డము రాకుండనుండి యాతఁ

డుచటికేని పోవుచున్నప్పు డాతని వెనుకనేపోయి తా నేమైన జేయవలసిన దున్న దేమో కనుఁగొనుచు, గురువు పాఠము చెప్పినప్పుడే నేర్చికొనుచు, అతనికిఁ బ్రియమును, హితమును అగుదానిని చేయుటయందు దృష్టినిలిపి అట్లే యాతనిభార్యాపుత్రులయెడలను సంచరించియు, వారియెంగిలి తినుట, వారికి జల యంటుట, అలంకరించుట, కాళ్లు కడుగుట, కాళ్లుగ్రుద్దుట మొదలగువానిని జేయక, వారివారిగౌరవమునకుఁ దగి ట్లితరులతో మాట్లాడుచు, గురువుగారితోఁ జెప్పనిదే భోజనము చేయక, గురువుగారు లేనప్పు డతనిభార్యాపుత్రులతోఁ జెప్పినపిదపనే భుజించుచు, ఆభోజనసమయమున దగ్గఱ నీళ్లుంచుకొని, మాట్లాడకుండను, మంచిభోజనము దొరకినది కదా యని యుప్పొంగకుండను ఉండుచు ఇట్లు నియమము తప్పక శిష్యుఁడు గురుకులమున నివసించియుండవలెను.†

ఈనియమములయందు కష్టమైన దేదియు లేదు. పైవాని సారాంశ మంతయు గురువునెడ వినయము, భక్తి, శ్రద్ధ, కలిగి వర్తింపవలయు ననుటకంటె నేమియు లేరు. గురువునింట నీచపుఁబనులయందాతఁ డెన్నడును నియోగింపఁబడఁడు. ప్రత్యుపకారము నభిలషింపక తన కన్నవస్త్రముల నిచ్చి చదువు చెప్పుగురువునెడ నిట్టి నియమములను శిష్యుఁడు స్వాభావికముగనే యనుసరించుచుండును. అట్లు సంచరింపనివానికంటె

---

† గౌతమధర్మసూత్రములు. II. 12-47.

కృతఘ్నుఁ డుండఁడు. ఇదిగాక గురువు శిష్యుని దండింపఁ గూడదు. శిష్యునివలనఁ దప్పున్నయెడల నది తప్పని చూపవలెను. వినని యెడల మందలింపవలెను. లేదా భయపెట్టవలెను. శిష్యుఁ డింకను తప్పుతోవనే యున్నయెడల సన్నని త్రాటితోనో, సన్నని బెత్తముతోనో నొప్పికలుగకుండఁ గొట్టవలెను. ఇంతకు మించి గురువు శిక్షించినయెడల రాజదండనకుఁ బాత్రుఁ డగును.†

ఈరీతిగా నొక వేదమునే యధ్యయనము చేయఁగోరినచో పండ్రెండేండ్లును, రెండు వేదములను జదువుట కిరువది నాలుగేండ్లును, మూఁడు చదువుటకు ముప్పదియాఱేండ్లును, నాలుగును జదువుటకు నలుబదియెనిమిదేండ్లును గురుకులవాసము చేసి బ్రహ్మచర్యము నవలంబింపవలయును. వేదములను నేర్చుటవలన బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు, వేదాంగములు, షడ్దర్శనములుఁ గూడ నభ్యసింపవలయు నని కొందఱు అందురు.

ఈ యధ్యయనము కొన్ని నియమితకాలములయందే చేయవలసియుండెను. సాధారణముగ వేదాధ్యయనము నుదయమునను, శాస్త్రములు మొదలగునవి మధ్యాహ్నమునను జరుగుచుండెను. అందును, అనధ్యయనపుదినములు చాలవఱకు నుండెను. అందుచేతఁ బాఠములు క్షేమముగ నొంటఁ బట్టించుకొనుట కవకాశ ముండెను. ఇంతకాలములో నిన్ని

† గౌతమధర్మసూత్రములు. II. 48-50.

పుస్తకము లింతవఱకుఁ జదివితీరవలయు నని కాని, ఇంతలోఁ బరీక్ష యగునను తొందర కాని, యట్టిపరీక్షలోఁ గృతార్థుఁడను కానేమో, ప్రాణాంత కలుగునేమో, జీవనోపాధి కీపరీక్ష యడ్డువచ్చునేమో యనిగాని, విద్యార్థి కించుకంతయు భయము లేకుండెను. సావకాశముగఁ జదువుకొనుటకే యీయనధ్యయనదినము లేర్పడినవి.

వేదాధ్యయనారంభము శ్రావణపూర్ణిమనాఁడు చేయవలయును. లేదా యుపాకర్మము చేసి, భాద్రపదపూర్ణిమనాఁడైనను, ఆరంభము చేయవచ్చును. ఇది వర్షకాలమగుటచేత నంత యెండగా నుండక చదువుకొనుట కనుకూలముగ నుండును. సంవత్సర మంతయు నధ్యయనము చేయనక్కఱలేదు. ఆరంభమునుండి నాలుగునెలల పదునేను దినములలో యైదు నెలలలో అనఁగా సూర్యుఁడు దక్షిణాయనములో నున్నంతకాలమే వేదవిద్య కనువగు కాలము. ఆ కాలమున విద్యార్థి బ్రహ్మచర్యము నవలంబించి క్షౌరము చేసికొనక, మాంసభోజనము విసర్జింపవలయును. ఈనియమమును రెండు మాసము లయినను అవలంబింపవలయును. పగలు ధూళితో గాలి రేఁగుచుండినను, రాత్రిపూట నది వీఁచుచుండుట వినఁబడినను వేదపఠనము కూడదు. అట్లే వీణ, భేరి, మృదంగము రథము—వీనిధ్వనియు, ఆర్తనాదమును, వినఁబడునంతకాలము నధ్యయనము నిలుపుచేయవలయును. కుక్కలు, నక్కలు,

గాడిదలునుగూడి యొక్కసారిగ నార్చినప్పుడు పాఠమును మానవలెను. ఆకాశమున రక్తప్రభయు, ఇంద్రధనుస్సు, మంచు, ఇవి కనఁబడినప్పుడు, అకాలమున వర్షమేఘములు కంటబడినను అధ్యయనము నిలుపవలయును. మూత్రపురీషశంకయైనప్పుడును పఠింపఁజనదు. మధ్యరాత్రియందును, సంధ్యలయందును, జలమున నిలిచియుండియు, వేదపఠనము చేయఁగూడదు. వర్షము పడుచున్నప్పుడును నిలుపవలెను. చూరునుండి వర్షము కారుచున్నంతకాలమే మానవలెనని కొంద అందురు. శుక్ర, బృహస్పతులచుట్టును గుడికట్టినను, సూర్యచంద్రులచుట్టును పరివేషము కనఁబడినను చదువఁగూడదు. మనస్సున భయముతోడను బండ్లలోఁ గూర్చుండియు, కాళ్ళక్రింద నెత్తుపెట్టుకొనియు వేదము పఠింప జనదు. స్మశానము, గ్రామాంతము, రాజమార్గములలోను, ఆశౌచముకలిగినప్పుడును అధ్యయననిషేధము కార్యము. దుర్గంధము ముక్కునకు సోకినను, గ్రామములో శవముగాని, చండాలుఁడుగాని యున్నప్పుడును, శూద్రసన్నిధిని వేదము పఠింపఁగూడదు. పులితేన్పులు వచ్చుచున్నప్పుడును అధ్యయనము మానవలయును. సామవేదము వినఁబడుచున్నంతకాలమును ఋగ్యజుస్సులఁ బఠింపఁగూడదు. పిడుగుపడినను, భూకంపము కలిగినను, గ్రహణము పట్టినను, ఉల్కాపాతమైనను, మఱునాటియుదయమువఱకును అధ్యయననిషేధము చేయవలయును. ఆకాల

ముందు మేఘనాదము, వర్షము, మెఱుపులు నున్నచో నధ్య
యనమును నిలుపవలయును. వర్షర్తువున నట్టివి ప్రాతఃకాల
మునఁ గలిగినచోఁ బగలంతయును, సాయంసమయమునఁ గలి
గినచో రాత్రియంతయును మాత్రమనధ్యయనము లని యె
ఱుంగవలయును. రాత్రిపూట మెఱసినట్లయిన మూఁడవజాము
వఱకు మాత్రమే యనధ్యాయము. ప్రాతఃకాలమున మెఱుపు
గలిగినచో ప్రాతఃకాలము మాత్రమే యనధ్యాయమని జా
బాలి చెప్పియున్నాఁడు. పగలు మూఁడవజామున మెఱసిన
యెడల అప్పటినుండి మఱునాటియుదయము వఱకు అనధ్యా
యము. కొందఱిమతమున నుల్కాదర్శనము విద్యుద్దర్శనము
తో సమము. అనఁగా నధ్యయననిషేధము దానియందువలె
దీనియందు నని యెఱుంగునది. పగలు నాలవజామునను, సం
ధ్యలయందును ఉఱుము వినఁబడినచో మెఱుపునందువలె
ననధ్యాయము. అనగా రాత్రి మూఁడవజామువఱకును అధ్య
యననిషేధము. అర్ధరాత్రమునకుఁ బూర్వము ఉఱుము వినఁబడి
నచో రాత్రియంతయు నిషేధము. పగలు మొదటిజామున
నుఱుము వినఁబడినచో సూర్యుఁడు కనఁబడుచున్నంతకాలము
ను వేదపాఠము నిలుపవలెను. దేశపురాజు మరణించినప్పు
డును అధ్యయనము నిలుపఁగూడదు. తోడివిద్యార్థులు పర
గ్రామమున కేగియున్నప్పుడు వారు వచ్చువఱకును అధ్యయన
మును నిలుపవలయును. గ్రామముపై దొంగలుగాని, శత్రువులు

గాని పడినప్పుడును, ఇండ్లు తగులఁబడుచున్నప్పుడును, ఒకవేదమును ముగించినతరువాత, వాంతియైనపిదపను, శ్రాద్ధభోజనమునంగాని, సంతర్పణభోజనమునుగాని యారగించినను, ఒకపగలును, ఒకరాత్రియును అధ్యయనము నిలుపవలయును. అమావాస్యనాఁ డనధ్యాయము. రెండుదినము లనధ్యాయము లని కొందఱిమతము. కార్తిక, ఫాల్గుణ. ఆషాఢమాసములలో పున్నమనాఁ డనధ్యాయము. కార్తిక, మార్గశిర, పౌష, మాఘమాసములలో కృష్ణపక్షాష్టములనుండి మూఁడు పగళ్ళును, మూఁడు రాత్రులును అనధ్యాయములు. ఈనిషేధము తుదియష్టమికే యని కొందఱిమతము. వార్షికోపాకర్మోత్సర్జనకర్మములయం దాకస్మికములు జరుగుదినమే గాక, అంతకుఁ బూర్వపుదినమును, తరువాతిదినమును, అనధ్యాయములు. ఉఱుములు, మెఱుపులు, వర్షము—మూఁడును ఒక్కసారి కనఁబడినప్పు డధ్యయనము నిలుపవలె నని యాచార్యులందఱును జెప్పియున్నారు. వర్షపాతము హెచ్చుగా నున్నయెడల అట్లున్నంతవఱకు నధ్యయనము నిలుపవలెను. పండుగదినమున నుదయభోజనమైనపిదప నధ్యయనము నాపవలయును. ఉపాకర్మంబాది యధ్యయనారంభముఁ జేసినవాఁడు రాత్రి నాలుగుముహూర్తములు చదువఁగూడదు. పట్టణములందు వేదపఠనము సర్వదా వర్జ్యమని కొందఱిమతము. అశుచిగ నున్నప్పుడు మనస్సులోఁగూడ వేదమును స్మరింపఁగూడదు. శ్రాద్ధకర్మము నాచరించినవారు మఱునాఁడు అదే

కాలము వఱకు నధ్యయనము నిలుపవలయును. శ్రాద్ధమునందు వంట చేయకుండ స్వయంపాకము నిచ్చినను ఇదే నిషేధము. ఈయా వేదశాఖలవారు నిషేధవిషయమై విధించిననియమము లన్ని, అందఱు ననుసరింపవలయును. †

ఈరీతిగా నాటపాటలుగ వేదాధ్యయనము సంపూర్ణము చేసికొని గుర్వనుజ్ఞ బడసి శిష్యుడు స్నాతకకర్మమునారంభింపవలయును. ఈకర్మ ప్రస్తుతవిద్యాలయములలోని 'కాన్వొకేషను' వంటిది. 'కాన్వొకేష'నప్పు డుపదేశపూర్వకోపన్యాసములు కావింపబడునట్లే ఈస్నాతకకర్మము నాచరించునప్పుడు గురువు శిష్యునకుం గొన్ని యుపదేశములు చేయును.

"సత్యం వద. ధర్మం చర. స్వాధ్యాయాన్మా ప్రమదః. ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః. సత్యాన్న ప్రమదితవ్యమ్. ధర్మాన్న ప్రమదితవ్యమ్. కుశలాన్న ప్రమదితవ్యమ్. భూత్యై న ప్రమదితవ్యమ్. స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్. దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యమ్. మాతృదేవో భవ. పితృదేవో భవ. ఆచార్యదేవో భవ. అతిథిదేవో భవ. యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని. నో ఇతరాణి. యాన్యస్మాకగ్ం సుచరితాని తాని త్వయోపాస్యాని. నో ఇతరాణి. యే కే

† గౌతమధర్మసూత్రములు. ప్రశ్న 2 అధ్యా 7.

చాస్మచ్ఛ్రేయాగ్ం సోబ్రాహ్మణాః తేషాం త్వయాఽఽసనేన ప్రశ్వసితవ్యమ్. శ్రద్ధయా దేయమ్. అశ్రద్ధయాఽదేయమ్. శ్రియా దేయమ్. హ్రియా దేయమ్. భియా దేయమ్ సంవిదా దేయమ్. అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్ యే తత్ర బ్రాహ్మణాస్సమ్మర్శినః యుక్తా ఆయుక్తాః అలూకాథా ధర్మకామాస్స్యుః యథా తే తత్ర వర్తేరన్, తథా తత్ర వర్తేథాః ఏష ఆదేశః ఏష ఉపదేశః ఏషా వేదోపనిషత్ ఏతదనుశాసనమ్. ఏవముపాసితవ్యమ్. ఏవ ముచైతదుపాస్యమ్"॥ ౧

సత్యమును బల్కుము. ధర్మము ననుష్ఠింపుము. స్వాధ్యాయమునుండి యెన్నఁడును దప్పియుండకుము. నీవు కొంచెము సంపాదించుకొనిన పిదప) నీయాచార్యునకుఁ బ్రియ మగునట్లుగఁ గొంతధనమును దీసికొనివచ్చి ప్రజాతంతువు తెగిపోకుండునటుల మంచి సంతానమును బడయుము. సత్యమునుండి యెన్నడును ప్రమాదము పొందఁజనదు. ధర్మమునుండి ప్రమాదము పొందఁజనదు. క్షేమంకర మగుమార్గమునుండి ప్రమాదము పొందఁగూడదు. మంగళకరము లగుకర్మములనుండి ప్రమాదము నొందవలదు. స్వాధ్యాయప్రవచనములనుండి యెన్నడును ప్రమాదము నొందవలదు. దేవపితృకార్యములయందు నిత్యము నాసక్తిఁ గలిగి వానినుండి తప్పిపోఁగూడదు. త

౧ తైత్తిరీయోపనిషత్: 11 అనువాకము.

ల్లియే దైవ మని నమ్మినవాఁడవు కమ్ము. తండ్రియే దైవ మని నమ్మినవాఁడవు కమ్ము. ఆచార్యుఁడే దైవమని నమ్ముము. అతిథియు దైవమే యని విశ్వాసము కలిగి యుండుము. అనిందితము లగుకర్మము లేవి కలవో వానినే చేయవలయును. ఇతరములను జేయఁగూడదు. మాయందు (ఆచార్యునియందు) మంచిగుణము లేవి కలవో వానిని నీవుఁ చేకొనవలయును. ఇతరములను జేకొనఁగూడదు. మనకంటె శ్రేష్ఠు లగుబ్రాహ్మణుల కాసనాదికము చేత శ్రమఁ దీర్పవలయును. వారిబోధలోని సారమును గ్రహింపవలయును. అట్టి వారి కేదైన నీయవలసినయెడల శ్రద్ధతో నీయవలయును. అశ్రద్ధతో నీయఁగూడదు. సంపదకుఁ దగిన ట్లీయవలయును. భయభక్తులు కలిగి జ్ఞానముతో నీయవలయును. ఇటుపిమ్మట నీకుఁ గర్మవిషయమైనను, ఆచారవిషయమైనను ఏదేని సందేహము కలిగినయెడల ధర్మవిచారముఁ జేయ సమర్థులును, ఆచార్యులును, కర్మాచారములందు స్వతంత్రులును, క్రౌర్యము లేనివారును, ధర్మకాములు నగుబ్రాహ్మణు లట్టిసందర్భసమయములం దెట్లు సంచరింతురో యట్లే నీవును సంచరింపుము. ఇది నీ కాదేశము. ఇది నీకుపదేశము. ఇది వేదరహస్యము, ఇది నీ కాజ్ఞ (ఈశ్వరవచనము.) ఇది యిట్టె యుపాసింపఁదగినది. ఇట్లే యుపాసింపఁదగినది. ”

ఇంతకంటె శాశ్వత మగునుపదేశ మే ముండును? ఈ యుపదేశమునందు మనుష్యుడు జీవితమునందు సంచరింపవ

లసినవిధ మతిసంగ్రహముగ మనస్సునకు జొచ్చి పోవునట్లు చెప్పఁబడినది. ఎట్టిసమయమందును, ప్రాణోపద్రవము కలిగినను యథార్థమును వచించుట, తనకు విధ్యుక్త మగుధర్మముల నాచరించుట, పెద్దలను సన్మానించుట, వానినడవడి ననుసరించుట, యాచార్యుని విడిచినంతనే యధ్యయనాదులు విడిచివేయక, పరతత్త్వమును గనుఁగొనుటకు జీవితకాల మంతయుఁ బ్రయత్నములు సలుపుచునే యుండుట, సందేహములు కలిగినప్పుడు పెద్దల నడిగి తెలిసికొనుట, ఇదియే గృహస్థుల ననుసరింపఁదగినవిధానము. ఇట్టియుద్దేశములతో స్వీకరింపఁబడినవిద్యవలన నీతిపరులు, సుశీలురు, నాగరకులు, దేశభక్తులు జ్ఞానపరులు, దైవభీతిగలవారునై జనులు మనదేశము నత్యున్నతముగఁ జేయుదు రనుట కుందేమి సందియ ముండును? ఆర్యులనాగరికత యవిచ్ఛిన్నముగ వేలకొలఁది సంవత్సరములనుండి నిలిచియుండుటకును, ఇతరదేశముల నాగరికత యంత నిలకడగ నుండపోవుటకును విద్యావిధానమునఁగల భేదమే కారణమని చెప్పక తప్పదు.

ఆర్యవిద్యయందు మఱియొకరహస్య మున్నది. కేవలము గురువునొద్దఁ జదువుకొనుకాలమే విద్యాకాలము కాదనియు, శిష్యుని శిక్షించి క్రమ మగుమార్గమునఁ బెట్టి యాతని శ్రేయస్సునకుఁ బాటుపడువా రాచార్యుఁడుగాక ఇంక ననేకు లున్నా రనియు నార్యులు గ్రహించిరి. శిశువు లోకమున జనింపకపూర్వమునుండియు నతనికొఱకు గురువుల

ప్రయత్నములు చేయుచునే యున్నారు. భూమిమీఁదికి రాఁబోవుశిష్యునికొఱకు యమనియమాదులచేఁదగినశరీరమునుబలమును బుద్ధిని సంపాదించికొనిన తలిదండ్రులు మొదటిగురువులు. తండ్రి బ్రహ్మచర్యము నవలంబించి యుక్తవయస్సునకు వచ్చినపిదప యుక్తవయస్కయు ఆరోగిణియు, ఆరోగ్యవతియు నగుభార్యయందు గర్భాధానమును జేయవలెను. ఈకర్మ కేవలము కామేచ్ఛతోఁగాక ప్రజాభివృద్ధికొఱకును, శ్రేయోభివృద్ధికొఱకును, జ్ఞాన మంతరించిపోకుండుటకును, ధర్మము శాశ్వతముగ లోకమున నిలిచియుండుటకును జేయఁబడును. తనవంశమునందలి జ్ఞానము కొనసాగియుండుటకు భర్త భార్యయందుఁ బ్రవేశించి పుత్రుఁడై పుట్టుననియు, అట్టిపుత్రోత్పత్తి పున్నామనరకమునుండి తన్ను తప్పించుటకే యనియు, సుగుణవంతుఁడు తేజస్వియునగుపుత్రుఁడే యట్లు రక్షింపఁగలవాఁడనియు చెప్పఁబడియుండుటచె భర్త చేయు నీగర్భాదానకర్మ మెంత ముఖ్యమైనదో తేటపడఁగలదు. గర్భమును పరిగ్రహించుభార్యయు గుణవతియు ధర్మతత్పరయునై యుండవలెను. అప్పుడే వారిసంయోగమువలన సుపుత్రుఁడు పుట్టుటకు వీలుండును. కావున భార్యాభర్తలు తమసంతానము నెడల బూనియుండవలసిన బాధ్యతలు బాగుగ నెఱింగియుండవలెను. అట్టిగర్భాదానమునకుఁ గొన్నికాలములు నియమితములై యున్నవి. నిషిద్ధసమయములను వర్జించి భర్తగర్భాదానకర్మ నాచరింపవలయును.

గర్భము నిల్చె నని మూడవనెలలోఁగాని తెలియదు. అందుచేత భార్య గర్భిణి యైన దని తేఁటపడిననాఁటినుండియు గర్భస్థపిండమును బోషింపుచు రావలెను. పిల్ల పుట్టిననాటినుండియునే దానిపోషణ మారంభ మగునను నభిప్రాయమును పాశ్చాత్యు లిప్పుడు వదలుకొనుచున్నారు. కాని తొల్లిటినుండియు మనవారీవిషయమై శ్రద్ధతీసికొనుచునే యున్నారు. ఈమూడవనెలలోఁ బుంసవన మనుసంస్కారము విధింపఁబడినది. గర్భస్థపిండమునకు బలము కలిగించుపదార్థముల నప్పటినుండియు స్త్రీ సేవింపుచుండవలయు నని తెలుపుట కాసంస్కారము జరుగును. ఇప్పటినుండియు, భార్యాభర్తలు స్వచ్ఛమగుజీవనముఁ జేయుచు గర్భవిచ్ఛిత్తి కలుగఁజేయునట్టిపనులను జేయకుందుముగాక యని దీక్షఁ బూనియుండవలయును.

ఆఱవనెల వచ్చుసరికి పిండమున కవయవము లేర్పడు కాలము వచ్చును. ఇప్పుడు సీమంత మనుసంస్కారము జరుగును. ఈసంస్కారమునందు స్త్రీ మనస్సును నిలకడ చేసికొని తన కెట్టిపుత్త్రుఁడు పుట్టవలయునో యట్టిసుగుణములు గలరూపమును దలంచుటచేత నామనఃప్రవృత్తి శిశువున కారూపము నిచ్చు నని నమ్మి, తేజోవంతుఁడు, జ్ఞానవంతుఁడు నగుపుత్త్రుఁడు నాకుఁ బుట్టునుగాక యని కోరికొనవలయును. అప్పటినుండియుఁ బూవులను ముడిచికొనుచు, వాసనఁ జూచుచు, సంగీతము, వీణాదివాద్యములు మొదలగు మనోహర

నాదములను వినుచు, మనోహరారామసీమల సంచరించుచు నిత్యసంతోషముతో నుండవలయును. బరువుపనులను జేయఁ గూడదు. "అలసట పుట్టించుపనులను జేసినచో గర్భవిచ్ఛేదమగును. హఠాత్తుగ దుఃఖవార్తలను వినుట, భయంకరములగువానిని జూచుటవలనఁగూడ పిండమునకు హాని కలుగును. ఏపనియుఁగూడ లేకుండ నుండుటయుఁ గూడదు. అందువలన శిశువు దుర్బలుఁ డగును. ఎక్కువగ నిద్రపోవునెడల మందుఁ డగును. మద్యము నుపయోగించినచో చంచలమనస్కుఁ డగును. రోగములను కలిగించు పదార్థములను దినుచుండినయెడల శిశువునకును ఆరోగములు సంభవించును. గర్భిణీ స్త్రీ రాజులను జూడవలె నని యెల్లప్పుడు తలంచుచుండుటవలన భాగ్యలక్షణములు గలపుత్త్రులను, యోగులను, యతులను జూడఁదలంచుచుండినచో మహాభక్తియుతులను, దేశోద్ధారకుల గూర్చి తలంచుచుండినయెడల నట్టివారిని కనును. †

ఈరీతిగా శిశువు గర్భములో నవమాసములును క్రమశిక్షను బొంది యిఁక లోకములోనికి బయలువెడలునప్పు డాతని నిచటి కాహ్వానము చేయుటకు సర్వమును సిద్ధము చేయవలెను. వేదమంత్రములను బఠించుచుఁ బురుటింటి నతిపవిత్రవంతముగఁ జేసి సాంబ్రాణిధూపములను వేసి యెట్టిమాలిన్యమును లేకుండ శుభ్రముగ నుంచవలెను. శిశువునకు నీళ్లు

National Library.

† చరక శారీరస్థానము: అధ్యా 8 శుశ్రుత: అధ్యా 3.

పోయుగనే బంగరుగంటముతో ఆతనినాలుకపై 'ఓం' అను మంత్రమును వ్రాయుదురు. ఆశిశువుచెవిలో 'వేదోఽసి' యని చెప్పుచుందురు. "ఓయి జీవుఁడా! నీవు వేదమవు. ఈలోకమునకు వచ్చియున్నావు. ఇఁక ముందు పరమాత్మను సందర్శించుటకు వలయుప్రయత్నములు సలుపుచుండుము." అని పురోహితు డుపదేశము చేయును. ఇది యేక జాతకర్మయను సంస్కారము.

ఈరీతిగా పుట్టినంవఱకునుత శిశువు తగినశిక్షలోనే యుండి యిఁక ముందుకూడ ననేకసంస్కారములకు లోనగును. గ్రంథవిస్తరభీతిచే నాయాసంస్కారముల పేళ్లుమాత్రమే యిచట పొందుపఱుపఁబడినవి.

పుట్టుటకు పూర్వము గర్భాదానము:—పుంసవనము సీమంతము, విష్ణుబలి.

పుట్టిననాటినుండి యైదు సంవత్సరములవఱకు:— జాతకర్మ, నామకరణము, ఉపనిష్క్రమణము, అన్నప్రాశనము, కర్ణవేధ, చౌలము, అక్షరస్వీకరణము.

అయిదేండ్లనుండి యెనిమిదేండ్లవఱకు:—ఉపనయనకర్మమునకు యోగ్యుఁడగుచుండును.

ఎనిమిదేండ్లనుండి పెండ్లి చేసికొనువఱకు:—ఉపనయనము, బ్రహ్మచర్యవ్రతము, సమావర్తనము.

పెండ్లికాలమునుండి వానప్రస్థ దగువఱకు:—వివాహము, ఉపాకర్మము, ఉత్సర్జనము, సప్తపాకయజ్ఞములు, సప్తహావిర్యజ్ఞములు, సప్తసోమయజ్ఞములు.

తరువాత, వానప్రస్థము, పిదప సన్యాసము అను సంస్కారములే గాక దయా, అనసూయా, శౌచము, అనాయాసము, మాంగళ్యము, అకార్పణ్యము, అస్పృహా, అంత్యేష్టి అను సప్తాత్మగుణములను కలిసి నలువదియెనిమిది సంస్కారములని యాగ్నేయాదిపురాణములలోఁ దెలుపఁబడియున్నది.

ఈరీతిగ విద్యయనునది యాజన్మాంతముఁ గొనసాగవలసినదే. జీవనమునుతగినశిక్షలో నుంచవలసినదే. నాలుగాశ్రమములను క్రమముగ స్వీకరించి పవిత్రజీవనము చేసి విద్యాఫలమగు బ్రహ్మజ్ఞానమును సంపూర్ణముగఁ గనుఁగొనువఱకును పురుషుఁడు శిష్యుఁడై యగుచున్నాఁడు. గురుకులవాస మీవిద్యయం దొకయవస్థమాత్రమే. లోకమంతయు నాతనికి గురువే.

అట్టిగురువులలో తల్లియే పరమగురువని మనవారందఱు నంగీకరించిరి. "ఆచార్యః శ్రేష్ఠో గురూణామ్ మాతేత్యేకే, మాతేత్యేకే" గురువులలో నాచార్యుఁడు శ్రేష్ఠుఁడు. కొందఱు తల్లియే తల్లియే యని చెప్పుచున్నారని గౌతముఁడును,

"ఉపాధ్యాయాద్దశాచార్య ఆచార్యాణాంశతంపితా,
పితుర్దశగుణంమాతా గౌరవేణాతిరిచ్యతే"॥

లౌకికవిద్య నభ్యసింపఁజేయు నుపాధ్యాయునికంటె బ్రహ్మవిద్య చెప్పునాచార్యుఁడు పదింతలు శ్రేష్ఠుఁడు. ఆచార్యునికంటెఁ దండ్రి నూఱింతలు శ్రేష్ఠుఁడు. తండ్రికంటె తల్లి పదింతలుగ గౌరవింపదగిన దని వశిష్ఠుఁడును,

"మాతా పుత్త్రత్వస్య భూయాంసికర్మాణ్యారభతే।
తస్యాం శుశ్రూషా నిత్యా పతితాయా మపి॥"

తల్లి పుత్త్రత్వమున కనేకకర్మలు పూనికతోఁ జేయును. ఆమెపతితురాలైనను ఆమెకు నిత్యమును శుశ్రూష చేయవలయును, అని యాపస్తంబుఁడును వచియించియున్నాఁడు.

తల్లి పరమగురు వగుట కేమి సంశయము? "The hand that rocks the cradle, rules the world" ఉయ్యెల నూఁచునాకరమె యుర్వి సమస్తము నేలుగాదొకో!" అను వాక్యము ప్రపంచములోని యనుభవసారమును దెలుపుచున్నది. బిడ్డకు జెడఁగొట్టినను బాగుచేసినను తల్లియే చేయును. ఆమె యాదిగురువు. గర్భములో శిశు వున్నకాలముండియు నామె గురువుగ నేర్పడియున్నది. ఈతొమ్మిదినెలలును తల్లి చేయుశిక్ష నే గురుకులము, నే మఠము, నే విశ్వవిద్యాలయముకాని ఆశిశువు లోకములోనికి వచ్చినతరువాత చేయఁజాలదు. ఉయ్యెల నూఁచునప్పు డామె పాడుపాటలయందును నేర్పుచేష్టలయందును, చూపెడి ప్రేమయందును, కలిపెడి బుద్ధులందును, పోషించెడిరీతియందును, ఆమె యెంత గొప్ప

గురువో తేటపడుచునే యుండును. అందుచేతనే స్నాతకకర్మయందలి యుపన్యాసములో నాచార్యుఁడు తొలుత 'మాతృదేవో భవ' యని యుపన్యసించును. తల్లితరువాత తండ్రియుఁ, బిదప నాచార్యుఁడును, ఆ వెనుక నతిథులును, తరువాత వేదవిజ్ఞానసంపన్ను లగు నితరులును, అనంతరము తక్కిన లోకమును గురువులుగ నున్నారు.

కాని విద్య యన్న నాచార్యునివలన స్వీకరించినదే యని సంకేతము చేయఁబడియున్నది. ఆచార్యునింట శిష్యుఁ డేయిబ్బందియు లేక తండ్రియింటియందువలెనే సుఖముగ నుండెను. చదువు నేర్చికొనుటకు సొగసైన మందిరము లక్కఱ లేకుండెను; ఏతోఁటయందే చెట్టునీడనో యేయరుగుమీఁదనో కూర్చుండి యధ్యయనము చేసికొనుచుండెను. కుర్చీలు బెంచీలు, డస్కులు, గాలరీలు, ఇట్టియాసనము లెవ్వియును లేవు. ఉండినఁ జాపమీఁదఁ గూర్చుండెను. లేనిచో దాని యవసరమే లేకుండెను. దుస్తువిషయమై యేనియమములును లేకుండెను. ఉపాధ్యాయులుగాని శిష్యులుగాని సొగసుగఁ గనఁబడుటకై ప్రయత్నములను చేసియుండరైరి. గురువునకు జీత మీయనక్కఱ లేదు. ఉన్నయింటికి అద్దె లేదు. తిండికై ఖర్చు లేదు. పుస్తకములకై ధనవ్యయము లేదు. మనస్సే పెద్ద పుస్తకము. గురువుగారిమనస్సునుండి శిష్యునిమనస్సులోనికి వాగూ్రికముగ జ్ఞానము ప్రవహించుచు నతిశీఘ్రముగా

సరియగుమార్గము నేర్పుచుకొనుచుండెను. శిష్యుఁడు బ్రహ్మచారియై పరిషత్తులలోఁ బాల్గొనుచుండెను. ఆతనికిని బౌరత్వాధికార మేర్పడియుండెను. చదువుకొనుచదువు పొట్టపోసించుకొనుటకుఁగాదు. పరమాత్మను దెలిసికొనుటకు. అట్లు తెలిసికొనుటకు గురుశుశ్రూషయు, అధ్యయనమును సాధనములు. గురుశిష్యు లిరువురును గలిసి వేదార్థవిచారము చేయుచుండిరి. శిష్యుఁడు గురుకులమును వదలి గృహస్థాశ్రమమును స్వీకరించి లోకోపకారార్థముగఁ దనజ్ఞానమును లోకమునఁ బ్రసరింపఁజేయుచు, ధర్మమార్గమును దప్పక సంచరించుచుండెను; జగచ్ఛాంతికొఱకుఁ బాటుపడుచుండెను. పిదప వానప్రస్థుఁడై ఆవెనుక సన్న్యాసియై, సర్వసంగపరిత్యాగము చేసి బ్రహ్మమును దెలిసికొని ముక్తిని బొందుచుండెను.





శ్రీరస్తు.

# ప్రాచీన విద్యాపీఠములు.

## పరిషత్తులు

వేదములు, సంహితలుగా నొకచోట చేరకయుండిన కాలమున ప్రతికుటుంబమునకును యజమానుఁడగు వాఁడు స్వయముగా ఋషియై ఋక్కులను రచించుచు వానినితన పుత్రులకు నేర్పుచుండెను. ఆ కాలమున నింకను నాచార్యుఁ డనువాఁ డేర్పడియుండలేదు! తండ్రియే యాచార్యుఁడు. ఈ ఋషులు ప్రత్యేకముగా కొన్ని శాఖలుగా విడియుండి స్వవంశమునకు తెలిసినజ్ఞాన మావంశములోనే చాలకాల ముంచుచువచ్చిరి. కాని యేకారణమువలననో యీశాఖలన్నియు సంక్రమింపగా నాయాఋషులు రచించిన దాని నంతను ఋగ్యజుస్సామాథర్వణవేదము లనునాల్గుసంహితలుగా నార్యులేర్పఱచికొనిరి. ఇందథర్వణవేదమునందలి విషయములు, తక్కినవానిలో కొన్నిటికంటె పూర్వము తెలిసినవేయైనను నది తక్కినవి సంహితలుగా నేర్పడిన పిదపనే యేర్పాటు చేయఁబడినట్లు కొందఱూహింతురు. అందుచేతనే గాఁబోలు వేదములకు త్రియీ యనునామము కుదురుకొని యుండుట.

తొలుత కర్మకాండ యంత విపులముగా లేక యుండెను. గృహయజమానుఁడు తనపనులను చూచికొనియుఁ బుత్త్రులకు విద్య నేర్పుటకు కాలము చిక్కుచుండెను. కాని యంతకంతకును గృహస్థాచరింపవలసినకర్మ పెరిగిపోఁగా, తండ్రి పుత్త్రుని మఱియొకరియొద్దకు, విద్యకొఱకు పంపవలవచ్చెను. ఇదిగాక వేదముల యర్థ మంతకంతకు దుర్గ్రాహ్యమయ్యెను. కావున నాయర్థనిర్ణయముకొఱకు నాయా వేదములకు, బ్రాహ్మణములు పుట్టెను. ఇట్లే యారణ్యకములును వానిలో నుపనిషత్తులును నేర్పడెను. అంతకంతకు నాఱువేదాంగములును నాఱుదర్శనములును నేర్పడెను. ఈ రీతిగా బాహుళ్యము పొందిన బ్రాహ్మణవిద్య నంతను పుత్త్రునకు నేర్పుచుండుట తండ్రికి దుర్ఘటమయ్యెను. అందుచేత ప్రత్యేకముగా నావిద్యను బోధించు నాచార్యులు కొందఱేర్పడిరి. ప్రత్యేకముగా వేదపాఠశాలలును స్థాపితము లయ్యెను.

ఆచార్యులలోఁ జాలమంది మూఁడు వేదములను సాంగముగా తెలిసికొనియుండిరి. కాని కొందఱు తమతమ వేదములను మాత్రమే పఠించుచుండిరి. ఇట్లు వేదాధ్యయన పారగులగు బ్రాహ్మణులు కొందఱు చేరి యొకచోటనే నివసించుచుండిరి. ఇట్టి బ్రాహ్మణాగ్రహారములయందే ధర్మశాస్త్రములను నిర్ణయించుటకు కొన్ని పరిషత్తు లేర్పడుచుండెను. పాంచాలుర పరిషత్తునకు శ్వేతకేతువు వెళ్లియున్నట్లు బృహదారణ్యకోపనిషత్తునందు చెప్పఁబడియున్నది.

న వీనుల వ్రాతలప్రకార మీపరిషత్తులయందు వేదాంతమును, కర్మకాండమును ధర్మశాస్త్రమును బాగుగఁ దెలిసిన యిఱువదియిద్దఱు సభ్యు లుండవలె నని యున్నది. కాని పూర్వకాలమున నింతకంటె తక్కువ మందియే చాలియుండిరి. గౌతముఁడు-1.

" చత్వారశ్చతుర్ణాం పారగా వేదానాం ప్రాగుత్తమాత్త్రియ ఆశ్రమిణఃపృథగ్ధర్మవిదస్త్రయఏతాన్దశావరాన్ పరిషదిత్యాచక్షతే " గౌ॥ ధ॥ సూ॥ III. X 47.

"అసంభవే త్వేషా శ్రోత్రియో వేదవిచ్ఛిష్టో విప్రతిపత్తౌయదాహ " గౌ॥ ధ॥ సూ॥ III. X 48.

అని నాలుగు వేదములను సాంగముగా చదివిన నలుగురు బ్రాహ్మణులను బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థాశ్రములలో నొక్కొక్క యాశ్రమమున నొక్కొక్కఁడు చొప్పున ముగ్గురును, ధర్మశాస్త్రవేత్తలు ముగ్గురును, ఇట్లు పదిమంది కలిసి యొకపరిషత్తుగా నేర్పడు ననియు వీరిలో నందఱును దొరకనియెడల వేదముల యర్థమును దెలిసికొనిన యొక్కఁడైనను తానే ధర్మనిర్ణయమును జేయవచ్చుననియు తెలిపియున్నాఁడు. వసిష్ఠ, బౌధాయన ధర్మసూత్రములలో పరిషత్తునందు ఒక్కొక్క వేదమును చదివినవారు నాలుగు వేదములకును నలుగురును మీమాంసశాస్త్రమును చదివినవాఁడొక్కఁడును షడ్వేదాంగముల నభ్యసించినవాఁ డొకఁడును,

ధర్మశాస్త్ర పఠనము చేసిన వాఁడొకఁడును మొదటి మూఁడాశ్రమములనుండి యొక్కొక్కఁడు చొప్పున ముగ్గురును అందఱును గలిసి పదిమంది యుండవలెనని యున్నది. మనువీ విషయమై యిట్లు చెప్పియున్నాఁడు.

"ప్రత్యేకముగా చెప్పబడకయుండిన ధర్మసంశయముల నెట్లు తెలిసికొనవలె ననినచో శిష్టు లగు బ్రాహ్మణులు నిర్ణయించినదే ధర్మముగాఁ బరిగ్రహింపవలయును. శిష్టులనగా వేదవేదాంగములనభ్యసించి వేదములనుండి ప్రత్యక్షప్రమాణములను జూపఁగలవారు. పదిమందిగాని ముగ్గురుగాని తమధర్మములను తప్పక యాచరించువారు నిర్ణయించినదానికి తిరుగులేదు. ప్రత్యేకముగా నొక్కొక్క వేదము చొప్పున జదివిన ముగ్గురును ఒక నైయాయికుఁడు, ఒక మీమాంస శాస్త్రవేత్త, నైరుక్తికుఁడొకఁడు, ధర్మశాస్త్రవేత్తయొకఁడు, మొదటిమూఁడాశ్రములనుండి క్రమముగా ముగ్గురును మొత్తము పదిమందికి తక్కువకానిది పరిషన్నామమునఁబరఁగుధర్మనిర్ణాయకసభ. ఋగ్వేదముఁ జదివిన నొకఁడును, యజుర్వేదము జదివిన వాఁ డొకఁడును, సామవేదాధ్యయనముఁ జేసిన వాఁడొకఁడును, ఈ ముగ్గురుగాని, యీ ముగ్గురుఁగాక యింకను సభ్యులఁగలిగిన పరిషత్తుగాని ధర్మసంశయములఁ దీర్ప సమర్థమైయుండును. వేదార్థమును తెలిసిన యొక్క బ్రాహ్మణునిధర్మనిర్ణయమైనను నంగీక

రిఁపవఁసిన దేగాని, కోట్లకొలది యజ్ఞానులు చెప్పిన వాక్యము ను పరిగ్రహింపఁగూడదు " అని.

పైదానినిఁబట్టి పరిషత్తునందు పదిమందికి తక్కువ కాని సభ్యులుండవలె ననియు, అట్లువారు చిక్కనప్పు డంతకం టెతక్కువమందియు నుండవచ్చుననియు తేలుచున్నది. పరాశ రుఁడు నిట్లు చెప్పుచున్నాఁడు. "గ్రామమున నున్నవారిలో వే దాధ్యయనము చేసి నిత్యాగ్నిహోత్రులగు నలుగురు గాని ముగ్గురుగాని పరిషత్తుగా నేర్పడుదురు. నిత్యాగ్నిహోత్రులు కాకున్నయెడల వేదవేదాంగములఁ జదివినవారైనను, మగ్గురైనను ధర్మమును తెలిసినవారైనచో నొకపరిషత్తుగా నేర్పడవచ్చును. పరమాత్మను గూర్చి బాగుగ తెలిసికొని ద్వి జులై క్రతువులఁ జేసి వేదమార్గమునఁ బ్రవర్తించి, పవిత్రు లగువృద్ధ ఋషులలో నొక్కఁడైనను పరిషత్తుగా నేర్పడవచ్చు ను. " అని

ఈరీతిగా గౌతమునినుండి వసిష్ఠబౌద్ధాయనులవఱకును వారినుండి మనువవఱకును నీపరిషత్తుయందలి సభ్యులయం దెట్టి మార్పులు వచ్చినవో మనకు తెలియుచున్నది.

విద్యార్థులను కేవలము లేవఁయు, నన్నియు వి ధులేయనియు, వారు పెద్దలసభయందెచ్చటను సభ్యులుగానుండఁ గూడదనియు వాదింతు నవీనులీపూర్వకాలపు పరిషత్తుల యందు ధర్మనిర్ణయముఁ జేయునధికారము బ్రహ్మచారులకు

‡ మనుస్మృతి XII. 108-118 ౨ పరాశరస్మృతి.

విద్యార్థులకును నుండె నని తెలిసికొనినచోఁ దమయభిప్రాయములను మార్చుకొందురేమో. పెద్దలతో పిన్నలను గలియనీయక వారిఁ బ్రత్యేకముగా నుంచివేయుటవలన వారు పెద్దవారైన పిదప క్రమముగా నడుచుకొనుటకు మొదటి నుండియుఁ బ్రయత్నములు సలుపవలసియుండును. ఇందువలన సంఘమునకు నష్టమేగాని లాభములేదు. పూర్వులు విద్యార్థులకిట్టినిర్బంధముల నెన్నడును గల్పించియుండలేదు.

ఈసభలు ధర్మనిర్ణయములకును, మతవిషయికసంశయములఁ బోఁగొట్టుటకును, తొలుత నేర్పడిన వని చెప్పియుంటిమి. కాని యీసభ్యులాయాశాస్త్రములయందు గట్టివారగుటచే వీరియొద్దనాయాశాస్త్రములను నేర్చికొనుట కనేకవిద్యార్థులుఁ జేరుచుండిరి. కావున నీపరిషత్తులుండు గ్రామములు రానురాను వైదికకాలములో విద్యాపీఠములుగా నేర్పడియుండెను.



శ్రీరస్తు.

# ప్రాచీనవిద్యాపీఠములు.

---

## బదరిక

బదరికాశ్రమమునకు బదరీనాథ్, అని మఱియొక పేరు. ఇది సంయుక్తరాష్ట్రములలో గఢ్వాలుజిల్లాయం దున్నది. ఇదిహిమాలయపర్వతములలోని యొకశిఖరము. హరిద్వారమునుండి యొక నెలప్రయాణములోను, శ్రీనగరమునకు ౫౫ మైళ్లదూరమునను యున్నది. ఇది నరనారాయణులు కలసి తపస్సు చేసిన స్థలము. నరనారాయణులే కృష్ణార్జునులుగాఁబుట్టిరని భారతరచనాకాలమువారు నమ్ముచుండిరి. నరనారాయణుల యాలయము, నర, నారాయణ యను రెండుపర్వతములకు సరిసమానముగా మధ్యస్థలమున తప్తకుండమను వేడియూట యుండు స్థలమునకే బిషన్‌గంగ యనఁబడు అలకానంద యను నది పుట్టినచోటున పడమటియొడ్డున నిర్మింపఁబడి యున్నది. ఈయాలయము గంధమాదనపర్వతముపై నున్నది. పాండవు లరణ్యవాసముచేయుచున్నప్పు డొకసారి యీ గంధమాదనము నొద్దకు వచ్చుటయు భీముఁడు ద్రౌపదిని సంతోషపెట్టుటకై సౌగంధికపుష్పములను హరించుటయు నను

భారత కథ సుప్రసిద్ధము. ఇచ్చటి నాలయమును శంకరాచార్యులవారెనిమిదవ శతాబ్దములో కట్టించిరని వాడుక కలదు. ఈబదరికాశ్రమమునకు బదరీ, విశాలబదరీ యను నామము లున్నట్లు మహాభారతమువలనఁ దెలియుచున్నది.

ఇది యాదికాలమునుండియు మహాత్ములు వాసము చేయుచుండిన స్థలము. ఆర్యవిజ్ఞానమాతయు నిచ్చటినుండియే బయలు వెడలిన దని చెప్పవచ్చును. ఋషిసంఘము లొక్కచో గూడి పరమేశ్వరధ్యానమున మునింగి తాము తెలిసికొనిన పరమతత్త్వముల నిట్టి యాశ్రమములనుండియే లోకములో వ్యాపింపఁజేయుచుండిరి.

ఇది వ్యాసమహర్షికి ముఖ్యముగా ప్రియమైన వాసము. ఇక్కడనుండియే యాతఁడు పురాణములనుఁ ఉపపురాణములను రచించె నని పెద్దలు చెప్పుదురు. ఇట్టి ౧౮ పురాణములును ౧౮ ఉపపురాణములును నిప్పుడు కనఁబడుచున్నవి. ౧౮ పురాణములు యిట్లు విభజింపఁబడుచున్నవి:—

౧. రాజసపురాణములు--బ్రహ్మనుగూర్చినవి. బ్రహ్మ బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, మార్కండేయ, భవిష్య, వామనములని యారు.

౨. సాత్త్వికపురాణములు—విష్ణువును గూర్చినవి. విష్ణు, భాగవత, నారదీయ, గరుడ, పద్మ, వరాహములని యారు.

3. తామసపురాణములు— శివునిగూర్చినవి. శివ, లింగ, స్కాంద, అగ్ని,‡ మత్స్య, కూర్మములని యారు.

---

‡. అగ్నిపురాణమునకు మాఱుగా కొందఱు వాయుపురాణమును చేర్చెదరు.

### ఉపపురాణములు. ౧౮

౧. సనత్కుమార, ౨ నృసింహ, లేక నారసింహ, 3. నారదీయ లేక బృహన్నారదీయ. ౪. శివ, ౫ దుర్వాసస ౬. కపిల, ౭. మానవ, ౮. ఔశనస, ౯. వారుణ, ౧౦. కాళికా,. ౧౧, సాంబ, ౧౨. నంది, ౧౩. సౌర, ౧౪. పారాశర౧౫. ఆదిత్య, ౧౬. మహేశ్వర, ౧౭. భార్గవ (లేక, భాగవత) ౧౮. వాసిష్ఠములు.†

పురాణమునకు పంచలక్షణ యని మఱియొక పేరు. ౧. సృష్టి, ౨. లయము, 3. దేవతలయు, పితరులయు, చరిత్రము, ౪. మన్వంతరములు, ౫. సూర్యచంద్రవంశ్యులగు రాజుల చరిత్రము నను నైదు విషయములగూర్చి తెలుపుంది గాన దీనికీ పేరువచ్చెనని యందురు.

పురాణములను రచించినవాఁడు, వ్యాసుఁడే' మనవారు నమ్ముచున్నారు. కాని వాని' రచించినవాఁడతఁడు కాడనియు వ్యాసనామము కల్పిత మనియు వీనిని రచించినవారిపేళ్లు తెలియకపోవుటచే గ్రంథకారుఁడను నర్థముతో వ్యాసపదము ప్రయోగింపఁబడిన దనియుఁ గొందఱుతలంచుచున్నారు. పురాణములను రచించుటకు పూర్వము కొన్ని పరిషత్తు లుండెడి వనియు నాయాపరిషత్తులయందలివారికిఁ దెలిసినవిషయము లన్నియు నాయాపురాణములలోని కెక్కినవనియు, వేఱ్వేరు

---

†. ఉపపురాణములలో కొన్నిటికి బదులుగా నందా, శివధర్మ, బ్రహ్మాండ [illegible]ములను కొందరు చెప్పుదురు.

కవిమత్తులచే రచింపఁబడిన గ్రంథములు వేఱ్వేరు పురాణములుగా నేర్పడినవనియు మఱికొందఱనుచున్నారు. రెండవయూహయే సరియైనదని తోఁచుచున్నది. వేఱువేఱుపరిమత్తులయందుఁ రచియింపఁబడుటచేతనే యాయాపురాణములయందలి విషయములలో భేదములు కానవచ్చుచున్నవని యూహింపవచ్చును. ఈపురాణములలో విష్ణుపురాణము చరిత్రాంశముల నెక్కువ సరిగా ప్రదర్శించుచున్నదని పాశ్చాత్యపండితుల యభిప్రాయము.

ఎట్లయినను బదరికాశ్రమము వంటి యాశ్రమముల యందే పురాణములు రచింపఁబడుచు వచ్చుచుండెనని మనము చెప్పవచ్చును. చరిత్రములఁ దెలుపు నాచారము మనవారియందు లేదని చెప్పుమాట యబద్ధమని యీపురాణరచనము వలన మనము తెలిసికొనవచ్చును. పురాణము లన్నియు నేకకాలమునఁగాని యేకస్థలమునఁగాని పుట్టినవని చెప్పుటకు వీలులేదు గాని యాయాకాలములందలి విజ్ఞానసంపన్నులొకచోఁ జేరి తమకుఁ దెలిసిన విషయముల నొకచోఁ జేర్చుచు వచ్చుచుండిరని మన మనుకొనవచ్చును.

మహాత్ములగు మతప్రవర్తకులు తాము వ్యాపింపఁజేయనెంచిన సిద్ధాంతముల నీబదరికాశ్రమవాసుల కెఱింగించినగాని యవి సత్యములు గావని తలంచుచుండిరి. అద్వైతమతమును గల్పించిన శంకరాచార్యులవారు నెనిమిదవ శతాబ్దమున నిచటికి వచ్చి నరనారాయణాలయమును గట్టించియుండి

రని పైని తెలుపఁబడినది. పదనొకండవ శతాబ్దమున రామానుజాచార్యులవారును నిచ్చటికి వచ్చి తమవిశిష్టాద్వైతమతమునకుఁదగిన గౌరవమును సంపాదించుకొనిరి. మధ్వాచార్యులవారు పదమూడవ శతాబ్దారంభమున నిచటికివచ్చి తమ గీతాభాష్యమును వ్యాసునికి స్వయముగా వినిపించినట్లును అప్పటినుండియు నద్వైతమతమును ఖండించుచు వచ్చినట్లును మధ్వవిజయమున వ్రాయఁబడియున్నది. ఈయాచార్యుఁడు రెండుసార్లు బదరికాశ్రమమునకు యాత్రసలిపెను. పరమాత్మను గూర్చిన జ్ఞానమును తెలిసికొనుట కిప్పటికిని సన్యాసులీ యాశ్రమమునకుఁబోయి యచ్చటనే వాసము లేర్పఱచుకొనుచున్నట్లు తెలియుచున్నది. కాశీ, హరిద్వారములకేగినవారిలోఁ గొందఱు యాత్రికులు కష్టముల కోర్చి బదరికాశ్రమమునుఁగూడ సందర్శించి తిరిగి వచ్చుచుందురు.



శ్రీరస్తు.

# ప్రాచీనవిద్యాపీఠములు.

## నైమిశ

“సీ॥ నైమిశారణ్యపుణ్యక్షేత్రమునఁ గుల
పతి శౌనకుం డను పరమమౌళి
బ్రహ్మర్షిగణసముపాసితుండై సర్వ
లోకహితార్థంబు లోకనుతుఁడు
ద్వాదశవార్షికోత్తమసత్రయాగంబు
మొగిఁ జేయుచున్న నమ్మునులకడకు
వచ్చి, తా నుగ్రశ్రవసుఁ డను సూతుఁడు
రోమహర్షణి సుపౌరాణికుండు
పరమభక్తిందోడఁ బ్రణమిల్లి యున్నన
క్కథకువలన మునీశ్వరు లెల్ల
వివిధపుణ్యకథలు విన వేడ్క నతనిబూ
జించి రపరిమితవిశేషవిధుల॥

వ॥ అక్కథకుండు వెండియు నమ్మునిసంఘంబునకు నమస్కారంబు చేసి యనేకపురాణపుణ్యకథాకథనదక్షుండ

వ్యాసపుత్త్రుండైన రోమహర్షణునకుఁ బుత్త్రుండ నావలన నెక్కథ వినవలతు రనిన— "భార. ఆది. 1. 27-28"

వ్యాసుఁడు పురాణమున కెట్లో సూతుఁడా పురాణవ్యాపనమున కట్లు ప్రసిద్ధినొందియున్నాఁడు. ఆన్నిపురాణములను సూతుఁడే లోకమున వ్యాపింపఁజేసె నని యాగ్రంథములవలనఁ దెలియుచున్నది. ఆకాలముల నాయాయాశ్రయములందలి వారు తాము తిరిగినదేశములందు సేకరించినకథల నన్నిటి నీ ఋష్యాశ్రమములయందు దెలుపుచుండిరి. వీ రాయాతీర్థములందు వినియున్నకథలను జరిత్రములను తీర్థమాహాత్మ్యములను దాము నచటి కాయాత్రికులమట్టుకు నాశ్రమవాసులకుఁ జెప్పుచుండిరి.

పురాణకథనమునకు నైమిశారణ్యము ప్రఖ్యాతిఁ బడసియున్నది. ఇది హిమాలయప్రాంతమునందుండెను, ఇందనేక మహర్షులు నివసించియుండిరి. ఈ ఋషిసంఘములకు వృద్ధుఁడును బ్రహ్మతత్త్వవేత్తయు నగువాఁడు కులపతిగా నుండెను. అచటివా రాతనియాదేశములను మన్నించి యాతని నుపాసించుచుండిరి. ఇందు తమ శ్రేయస్సుకొఱకేగాక సర్వలోకక్షేమార్థముగా కులపతి యాధిపత్యముక్రింద వీరు ఆంగిరసక్రితువు, సాకమేధము, పంచశారదీయము, విశ్వజిత్తు, పౌండరీకము, భర్తృద్వాదశాహము ననువానినేగాక సంవత్సరసత్త్రము, మహావ్రతము, రాత్రిసత్త్రము, శతరాత్రము, స్తోమము, ద్వా

దశసంవత్సరక్రతువు, సహస్రసంవత్సరక్రతువు ననుదీర్ఘక్రతువులఁగూడ నాచరించుచుండిరి. ఈక్రతుసమయములందు చుట్టుపట్లనుండు నాశ్రమములనుండియు ఋషులొకచోఁజేరి యజ్ఞకర్మ నిలుపైనసమయములందు పురాణశ్రవణముచేఁ గాలక్షేపము చేయుచుండిరి. పౌరాణికులాకాలమున గొప్ప గౌరవముఁ బడయుచుండిరి. ఆశ్రమవాసులు వారి ననేకవిధముల సత్కరించి పూజ్యభావముతోఁ జూచుచుండిరి.

మొదటినుండియు మనదేశమున నార్యులవిజ్ఞాన మీపురాణపఠనమూలముననే జనసామాన్యమునకు పట్టుపడుచుండెడిది. మంచిపౌరాణికు లీకాలమునఁ జాల యరుదుగఁ గానవచ్చుచున్నారు. నవనాగరకత యీదేశమునకుఁ దెచ్చిపెట్టిన యనర్థములలో బురాణపఠనము లోపించుట యొకటి.



శ్రీరస్తు.

# ప్రాచీనవిద్యాపీఠములు.

## తక్షశిలా.

బదరికాశ్రమముం గూర్చిన చరిత్రము మనకు బాగుగఁ దెలియకపోయినను నార్యవిద్యకు క్రీస్తుపూర్వ మెన్నియో శతాబ్దములనుండియుఁ బ్రఖ్యాతినొందియున్న తక్షశిలావిద్యాపీఠముం గూర్చి కొంతవఱకుఁ దెలియవచ్చుచున్నది. ఇది ప్రస్తుతము పశ్చిమోత్తర పరగణాలయం దున్న రావల్పిండికి సమీపములో నున్నది. రామాయణ భారతకాలముల నుండియు నిది ప్రసిద్ధికెక్కియుండె ననుటకు నిదర్శనములు కలవు. దీనిని శ్రీరామసోదరుఁ డగు భరతునిపుత్రుఁడు కట్టించె ననియు నిది సింధు వితస్తా నదుల మధ్య నుండె ననియు మహాభారతమునఁ దెలుపఁ బడియున్నది. మగధరాజ్యమును బుద్ధునికాలమున నేలుచుండిన బింబిసారునకును బుద్ధునకుఁ గూడ వైద్యము చేసిన జీవకుఁ డీవిద్యాపీఠముననే యాత్రేయఋషి యొద్ద విద్య నేర్చికొనెను. ఇతఁడిచ్చటి కళాశాలయం దేడు సంవత్సరములు చదివినపిదప పరీక్షయయ్యెనఁట. అందు తక్షశిలకు చట్టును పదునేనుమైళ్లలో నున్న ప్రదేశమునందు గల

మొక్కలు, లతలు, గడ్డి, వేళ్లు, చెట్లును వైద్యమున కను కూలములగు నేయేగుణములఁ గలిగి యుండెనో చెప్పవలసి యుండెనఁట. జీవకుఁడును నాలుగుదినములు లాప్రదేశముల సంచరించి వాని నన్నిటిని బరీక్షించి వానివాని గుణములను వర్ణించెనఁట. ఆప్రదేశమందలి మూలికలన్నియు వైద్యమున కనుకూలించునవియే యాతఁడు చెప్పి యున్నాఁడు. దీనినిబట్టి యాకాలమునఁ బరీక్షలెట్లు జరుపఁబడుచుండెనో తెలియఁగలదు. బుద్ధుఁడును నీవిద్యాపీఠముననే విద్యాస్వీకారముఁ జేసెనని వాడుకకలదు. క్రీ॥ పూ॥ మూఁడవశతాబ్దమున నశోకుని కాలమున నీవిద్యాలయము మిక్కిలియుచ్ఛదశలో నుండెను. ఆత్రేయమతానుయాయి యగు చరకుఁడిచ్చట నాండియే కాయచికిత్సాప్రధానమైన యష్టాంగ వైద్యక విషయములను బోధించెను. అశోకుని కాలమున ననేక దేశములనుండి విద్యార్థులనుఁ గళలను నందు ముఖ్యముగా వైద్యము నభ్యసించుటకు రాజపుత్త్రులు, సామంతులు, బ్రాహ్మణులు, వైశ్యులు, నన్నిజాతులవారును జేరుచుండిరని విన్సెంటుస్మిత్తుగారు వ్రాయుచున్నారు. చంద్రగుప్తుని మంత్రియగు చాణక్యుఁడీవిశ్వవిద్యాలయమునఁ జదువుకొనినవాఁడే. ఈతనియర్థశాస్త్రము మిక్కిలి ప్రసిద్ధికెక్కియున్నది. దీనిని బట్టియే యాకాలపు రాజ్యాంగతంత్రముంగూర్చి యనేకులు వ్రాయుచున్నారు. మగధరాజ్యము చిరకాలము నిలిచియుండుట కీతని

గలియు మని వేఁడికొనఁగా నాతఁడు కన్నుల నీరు నించికొని పినతల్లియైనను తల్లితో సమానమనియు నామె కట్టి గుణములు తెగవనియుఁ దానట్టిపాతకమున కొడిగట్టుకొననియు మందలించి పంపివైచెను. ఆమెయు నిరాకృత నైతింగదా యని క్రోధ ద్వేషములు మనస్సున ముప్పిరిగొన నాతనిపైఁ బగసాధింపనెంచి కుటిలస్వభావయయి యొకనాఁడు రాజుతో "నీపుత్రుఁడు మంచియోగ్యుఁడు, సుశీలుఁడు. మన రాజ్యాంతములందల్లరులు జరుగుచుండునేమో, అతని నచటికిఁ బంపి శాంతి నెలకొల్పించుట యుక్తముగదా" యన నాతఁడును నది మంచియాలోచనయేయని తలంచి కుమారుం జేరఁబిలిచి యాతనికి రాజధర్మముల బోధించి యాదేశములఁ బరిపాలింప నియోగించెను. రాజపుత్రుఁడును వల్లెయని తన భార్యతో నాప్రదేశమున కేగి యేక్షోభమును పుట్టకుండ ధర్మముఁదప్పక ప్రజాపరిపాలనముఁ జేయుచుండెను. అటవికజాతులవారి చేతులలో పడి యాతఁడు మృతినొందునని తలంచిన యాతని పినతల్లి యాతఁడచట సుఖముగ నున్నాఁడని యెఱింగి యాతని నెట్లు చంపవలయు నని యాలోచించుచు నృపునాజ్ఞ లేనిదే యెవ్వరును నాతని జోలి పోరని రాజు నిద్రించు సమయమున నొకయుత్తరము వ్రాసి రాజుపంటితో ముద్రవైచి యొక సేవకునిద్వారా దానిని రాజపుత్రుని మంత్రులయొద్ద కంపెను. రాజు ముద్ర నెప్పుడును దనపంటితోనే వైచుచుండుట యెఱింగిన యామంత్రులాయుత్తరమునుఁ జదువ నరి కందు "రా

జకుమారుని కన్నులనూడఁబెఱికి భార్యాసహితముగ నాతని నడవులలో విడిచిపెట్టి యేయాహారము నీయక యచటనే మడియ జేయ వలెననియు, ఆతఁడొక్క ఘోరమగు కృత్యము నాచరించుటచే నీదండన యాతనికి విధింపఁబడెననియు వ్రాయఁబడియున్న యాజ్ఞం జదివి కొన్ని యేమియుఁదోచక విచారములో మునిఁగి యుండుటం జూచి రాజకుమారుఁడు వారి విచారమునకు కారణ మడుగ నుత్తరములోనున్న యాజ్ఞ నాతని కెఱింగించి "ఇది యసంభవము. రాజిట్టి యాజ్ఞ నిచ్చి యుండఁడు. ఇందేదో ద్రోహమున్నది. తిరిగి రాజు నడిగి గాని యాతని యాజ్ఞ ననుసరింపమని చెప్పిరి. రాజకుమారుఁడు "రాజాజ్ఞ యెట్టిదైనను ననుసరింపవలసినదే. ఆతనిపంటి ముద్ర యున్నదిగదా సందేహింపనేల?" యనిపలికి యొకచండాలుని బిలిపించి కన్నులూడ బెఱికించుకొని భార్యతోఁగూడ నడవుల సంచరించుచు నాకలి కోర్వలేక యొకనాడు తండ్రిరాజధానిం జేరి తనవలన నేరము లేదని రాజునకు దెలుపుటకై యొకచితారు చేతఁబట్టి దీనముగ గానము చేయుచుఁ దనవృత్తాంతమును వెలిబుచ్చుచుండెను. ఆమనోహర గానము రాజు చెవింబడగానే యాపాడుచున్న యాతఁడు తనపుత్త్రుఁడే యగునని గ్రహించి వెంటనే తనముందునకు బిలిపించి యంధుఁడై యున్న తన కుమారుఁ గౌఁగిలించుకొని, "నాయనా నీకిట్టి యపకారము నెవరు చేసిరో యయ్యో! నాకుమారుఁడు తన ప్రజలను జూడఁజాలని యవస్థ నున్నాఁడే, అయ్యో" యని విలపించుచు నిట్టి యాపద దెచ్చి పెట్టినది తనభార్యయే

యని తెలియఁగా నామెకు శిరచ్ఛేదము చేయించెను.

ఆకాలమున సంఘారామమున త్రివిద్యలను నేర్చి ప్రఖ్యాతి కెక్కి యుండిన ఘోషుఁడను నొకసిద్ధుఁ డుండెను. రాజు తనపుత్త్రు నాతనియొద్దకుఁ దీసికొనిపోయి నాకుమారునకు నేత్రదానముఁ జేయుమని వేఁడికొనఁగా నాతఁడు నను గ్రహించి, "రాజా నీదేశము నందలి ప్రజలనందఱి నిటకు రాఁ బంపుము. వారిలో నొక్కొక్కరును నొకపాత్రను తీసికొని రావలయును." అని చెప్పగా నట్లే ప్రజలందఱును నాసంఘారామమునఁ జేరిరి. అప్పుడు సిద్ధుఁడు బౌద్ధధర్మములం బోధింపఁ దొడంగెను. ఆయుపన్యాసమును వినినవారందఱును కన్నీరు విడువసాగిరి. ఆకన్నీటిని తమతమ పాత్రిలలో సేకరింపుడని చెప్పి సిద్ధుఁడు పెద్దపాత్రిలో పోసి, "బుద్ధుని ధర్మములు మంచివి కాకపోయినచో నీతని నేత్రములట్లే గ్రుడ్డివియై యుండును. అవియే సత్యములైనచో నీకన్నీటి స్పర్శవలన నీతనికి దృష్టి తిరిగి వచ్చునుగాక!" యనుచు నాతనికండ్లను దుడువగా నాతనికి దృష్టి యథాప్రకారముగా వచ్చెను."

సారంగధరునికథకు మూలమెచ్చటిదో యిప్పటికిని తేలలేదు. ఇప్పటికిని పంజాబు దేశములో నిట్టికథను చెప్పికొనుచున్నారు. చేమకూర వేంకటకవి సారంగధరునితండ్రి మాళవదేశాధిపతి యని చెప్పియున్నాఁడు. మనమీకథను రాజమహేంద్రవరమున కంటఁగట్టుచున్నాము. ఇట్టికథలు సాధారణముగ నొకప్రదేశమున బుట్టి నానాటికి వైలక్షణ్యము బొందుచు నన్నిదేశములందును వ్యాపించుచుండును.

---

శ్రీరస్తు

# ప్రాచీనవిద్యాపీఠములు.

## కాశ్మీరము

కాశ్మీరమునందలి శారదాపీఠ మేనాటినుండి ప్రసిద్ధి చెందియున్నదో యెవ్వరును చెప్పలేరు. చరిత్రకారులు సాధారణముగా కాలనిర్ణయమునుగూర్చి పరదేశవాసులవ్రాతలచే స్థిరపడకపోయిన సందర్భములందు మనదేశమువారివ్రాతలను విశ్వసింపరు. ఏయలగ్జాండరుదండయాత్రయో, యేస్ట్రాబో, కర్టియాస్, మొదలగువారియసంపూర్ణములగు గ్రంథములో మన చరిత్రకారులకు మూలాధారము లగుచున్నవి. గాని, మన దేశమున వ్రాయఁబడినగ్రంథములుగాని యితరనిదర్శనములుగాని మిక్కిలి సంశయదృష్టితో విమర్శింపఁబడుచువచ్చుచుండుట మనకు హాస్యాస్పద మని తోఁచకపోదు. భారతవర్షీయులు సత్యవాదులు కారనియుఁ దమ యభిప్రాయముల వెల్లడింపనెంచి యవియే సత్యము లని నొక్కి చెప్పుదు రనియు, వారికి విమర్శనాపద్ధతులు తెలియవనియు, లోకప్రతీతిని చరిత్రవిషయముగా నెంచుచు నెంతటియసందర్భమునైనను వారు విశ్వాసపాత్రముగాఁ జూతు రనియు, [illegible]

యములను మనసునం దుంచికొని తొలుత నిండియానుగూర్చి వ్రాసిన పాశ్చాత్త్యు లెల్లరు నారంభించిరి. ఇతరవిషయములం దువలె మనవారి యభిప్రాయమునందును వారితో నేకీభవించిరి. ఇండియాదేశమున నసలుచరిత్రము మనకే లేదనియు, పరలోకచింతనాపరు లగుభారతవర్షీయుల కైహికసంబంధ మగువిషయములపై దృష్టియే నిలువలేదనియు కొందఱనిరి. ఈ రీతిగా నిండియానుగూర్చి సగము తెలిసిన పాశ్చాత్త్యులుగాని, పాశ్చాత్త్యప్రేరితు లగుమనవారుగాని యేమనుకొనినను, హిందూవిజ్ఞానసంపన్ను లగువారుమాత్రము వారిని జూచి లోలోన నవ్వుకొనుచునేయుండిరి. పైవారియభిప్రాయము లన్నియు నజ్ఞానజన్యము లని తెలుపుటకు పురాణములు, చరిత్రగ్రంథములు, కావ్యపీఠికలలోని వంశవర్ణనములు, ప్రశస్తులు, దానపత్రములు, నాణెములు, శిల్పములు, చిత్రలేఖనములు, మొదలగునవిచాలియున్నవి. వానిని చదువుకొనినకొలందియు తొలుత తప్పుత్రోవం బడినవారు తిరిగి సరియగుమార్గమునకు రాం బ్రయత్నములు సలుపుచున్నారు.

హిందూదేశమునం దెల్లెడల చారిత్రికనిదర్శనములు కనంబడుచునేయున్నవి. కాని. కాశ్మీరమునం దెక్కువ విమర్శనాదృష్టితో చరిత్రములు వ్రాయంబడిన ట్లచ్చట పుట్టిన గ్రంథములవలనం దెలియుచున్నది. అట్టిచరిత్రములలో కల్హణుం డనునాతండు రచించిన 'రాజతరంగిణి' యనుగ్రంథ మ

గ్రగణ్యతను వహించియున్నది. రాజతరంగిణి యనఁగా (కాశ్మీరము నేలిన) రాజుల ప్రవాహము. వారినిగూర్చి తెలుపునదనుట. ఈతఁ డాగ్రంథమును క్రీ॥ శ॥ ౧౧౪౮—౧౧౪౯ వ సం॥ రములలో రచించెను. ఈతనితండ్రి హర్షనిరాజ్యమున గొప్ప యుద్యోగమునందుండిన చంపకుని పుత్త్రుఁడు. తనకాలమునుంగూర్చి తెలుపువిషయముల నీతఁ డతివిపులముగ వర్ణించియున్నాఁడు. ఈతఁడు బ్రాహ్మణుఁడును విశేషించి శైవుఁడు నైనను నాదేశమున వ్యాపించియుండిన బౌద్ధమతమునెడ నెట్టిద్వేషమును లేక, యామతస్థులనుగూడ శ్లాఘించియున్నాఁడు. బ్రాహ్మణ బౌద్ధమతస్థులు నిరంతర మొండొరులతోఁ బోరాడుచుండిరనియు నొండొరుల కపకారములఁ జేసికొనుచుండిన వారలనియుఁ జెప్పువ్రాఁతలు చాలమట్టుకు నిరాధారములనియే చెప్పనగును. బౌద్ధమతము బ్రాహ్మణమతమునుండి విడఁబడిన యొకశాఖగా మనము గ్రహింపవలయునుగాని దానిని నడుగంటింపవలెనని ప్రయత్నించిన దానినిగా నెంచగూడదు. బౌద్ధరాజులు బ్రాహ్మణసంస్థలకును, బ్రాహ్మణమతావలంబకులగువారు బౌద్ధసంస్థలకును సమానముగానే సహాయము చేసికొనుచుండిరి. ఇట్టియన్యోన్య మైత్రియుండుట చేతనే బుద్ధదేవుఁడు పూరి యందు జగన్నాథుఁడుగను, ముంబయి రాష్ట్రమందు పంచానన శివుఁడుగను పరిణమించుటయుఁ గాక దశావతారములలో నాతఁడు నొకయవతార మగుటయును సంభవించెను. కల్హణుఁడిట్లు తనదేశమునందలి సమస్త

ప్రజలఁగూర్చియు సూక్ష్మముగాఁ దెలిసికొని, వారివారి మతములను బట్టి కాక, సౌశీల్యాది గుణములచేతనే జనులను గూర్చి తనయభిప్రాయములను వెల్లడించెను. కాశ్మీర దేశస్థుఁడైనను తనదేశమువారిని పిఱికిపందలని నిందించుట యందేమి, యితర దేశస్థులగు రాజపుత్రులు మొదలగు వారి ధైర్య శౌర్యములను శ్లాఘించుట యందేమి యాతని నిష్పక్షపాత బుద్ధి తేటపడఁగలదు. తనసమకాలికులగు రాజులయందలి దోషములను వెలిబుచ్చుటకుఁ గూడ నాతఁడు వెనుతగ్గలేదు. తాను బ్రాహ్మణుఁడైనను పురోహిత నామధేయులగు బ్రాహ్మణబ్రువులను కేవలకుక్షింభరులని నిరసించియున్నాఁడు. తాను వ్రాయఁబోవు గ్రంథముల కాధారములగు గ్రంథములను గ్రంథకర్తలను నాతఁడు పేర్కొనియేయున్నాఁడు. పాశ్చాత్య పరిశోధనా విధానానుష్ఠాతలమని చెప్పికొనుము గ్రంథచౌర్యముఁ జేయుచుండు నవీననాగరకులకిది వింతగనే కానవచ్చును గాని ప్రాచీనచరిత్రకారులు సర్వసాధారణముగా తామాధారముగాఁ జేకొనియున్న గ్రంథముల నెన్నఁడును బేర్కొనియుండకపోలేదు. భాష్యములు వ్యాఖ్యానములు మొదలగు వానిని వ్రాసిన వానియందెచ్చట చూచినను 'ఇతిమనుః' 'ఇత్యాపస్తంబః' అని యీరీతిగా నాయామూల గ్రంథములను బేర్కొనట చూచుచునేయున్నాము. అట్టిసాంప్రదాయము ననుసరించియే కల్హణుఁడు తానుపయోగించిన యీ

క్రిందిగ్రంథముల నుదాహరించి యున్నాఁడు:—(౧) సువ్రతుని కావ్యము. ఇది పుట్టిన వెనుక యంతకుపూర్వపు చరిత్రములకు వ్యాపకము తగ్గినదని యాతఁడు చెప్పియున్నాఁడు. పూర్వగ్రంథములందలి విషయము లన్నియు నిందు సంగ్రహముగాఁ జెప్పఁబడియుండుటచే, విపులము లగు నితరగ్రంథములు మూలఁబడినవని యాతని యభిప్రాయము. (౨) కాశ్మీరదేశముఁ గూర్చి తనకుఁ బూర్వముండి యుండిన పదునొకండు చరిత్రగ్రంథములు. (౩) క్షేమేంద్రుని 'నృపావళి'. ఇది సువ్రతుని గ్రంథముతోఁ దులతూఁగుచుండునని యాతనియభిప్రాయము. (౪) పద్మమిహిరుఁడు. ఛవిల్లాకరుఁడనువారువ్రాసిన చరిత్రములు (౫) పాశుపతమతస్థుఁడగు హేలారాజను నాతఁడువ్రాసిన పార్థివావళి.

పైగ్రంథములనే గాక దానశాసనములు మున్నగు వానిని గూడ నుపయోగించితినని యాతఁడు చెప్పికొనియున్నాఁడు. లోకప్రతీతి నీతఁడు నిరసించియుండలేదు. ఇతర విషయములు ప్రతీతిని బాధింప నప్పు డట్టివానిని చరిత్రకారుఁడు విడిచిపెట్టఁగూడదు. అదియే యెక్కుడుసత్యనిబద్ధమయి యుండవచ్చును. అయినను 'రాజతరంగిణి' నింగ్లీషులోని కనువదించిన స్టేనుగారీవిషయమై కల్హణునకు చారిత్రక దృష్టి లేదనియు నసందర్భపు కథల నెక్కుడు చరిత్రగా వ్రాయుచు వానింగూర్చి సంశయింపనైనను

సంశయింప లేదనియు పురాణగాథలకును చారిత్రిక విషయములకును ముడిపెట్టెననియు నేమేమో వ్రాసిరి. పూర్వకాలమున నితర దేశములందు చరిత్రము లింతకంటె నెన్నోరెట్లు హీనస్థితి యందుండెడివని మనము జ్ఞాపక ముంచుకొన్నయెడల కల్హణునందిట్టి చిన్నలోపము లున్నను నాతని విమర్శనా దృష్టి నవీన చరిత్రకారుల దృష్టికంటె భిన్నమైయుండుటను జూపుటయేగాక పూర్వకాలపు ఐతిహాసకుల న్యాయైకదృష్టిని వేయివిధముల విస్పష్టము చేయుచున్నది.

రాజతరంగిణిని చదువుచున్నప్పుడు గిబ్బను వ్రాసిన రోమనుసామ్రాజ్యోదయాస్తమయములను (Gibbon's Rise and fall of the Roman Empire) గ్రంథమును చదువుచున్నట్లుండును. అది కావ్యమునకుఁ గావ్యము, చరిత్రమునకుఁ జరిత్ర. కల్హణుఁడితరుల యభిప్రాయములను లక్ష్యము చేయక స్వతంత్రముగ సర్వవిషయములను విమర్శించివ్రాసియున్నాఁడు. పైనఁజెప్పఁబడిన మూలగ్రంథము లందలి దోషములనాతఁడు నిరూపించి సత్యాంశములనే గ్రహించి కొనెను. ఇట్టి స్వతంత్ర బుద్ధి గలవాఁడు కావుననే యాతని గ్రంథము మనోరంజకమై విలసిల్లుచున్నది. అతఁడు వర్ణించిన రంగములయందలి పాత్రలు మన మనోరంగములం దిప్పుడును వర్తించుచున్నట్టులనుండును. తాను హాస్యముచేయుచున్న పురుషులఁగూర్చి చదివి మనమును వినోదము నొందక తీరదు. అతఁడు వర్ణించిన ప్రదేశముల వర్ణన లతిస్వాభావికములై

సంతసముఁ గొల్పుచుండును. తనపూర్వుల చరిత్రములనుండి యెత్తివ్రాసిన విషయముల కాతఁడు బాధ్యుఁడు కాఁడు గాని తనకాలమున జరిగిన విషయముల నాతఁడు జరిగినట్లుగనే వ్రాయుటయు, నేమార్పులను నేయతిశయోక్తులను జేర్పకుండుటయు నాతని సత్యప్రియత్వమును వెల్లడి చేయుచుండును.

ఇంగ్లాండులో "డూమ్సుడేబుక్కు" అను గ్రంథమున నాయారాజుల కాలమున జరిగిన విషయము లెల్ల యథానుభవములుగా వ్రాయఁబడి యున్నవని యింగ్లీషువారి చరిత్రమున జెప్పఁబడి యున్నది. అట్లే కాశ్మీర దేశమునను నొకే గ్రంథమున గాకపోయినను వెవ్వేఱు గ్రంథములలో నాయాకాలములందు జీవించియుండిన వారు చరిత్రము వ్రాసి యుంచుచు వచ్చినట్లు మన మూహింపవచ్చును. కల్హణుఁడు రాజతరంగిణిని వ్రాసినపిదప జోనరాజ శ్రీవీర ప్రాజ్యభట్టులు కాశ్మీరపు తెరువాతి చరిత్రమును వ్రాసియున్నారు. కల్హణునకుఁబూర్వమే బిల్హణుఁడు విక్రమాంకదేవచరితమును అతనికి సమకాలికుఁడగు మంఖకవి శ్రీకంఠచరితమును రచించి యున్నారు.

ఇట్లాదేశముఁగూర్చి యేకాలమువఱకును చరిత్రములున్నవో తెలియదుగాని చరిత్రలేఖన మ్మాప్రాంతములయందెక్కువ గానవలంబింపఁబడి యున్నట్లు మన మూహింపవచ్చును. ఇట్లే యాయా రాజ్యముల చరిత్రములను పూర్వులు వ్రా

యుచునే వచ్చిరి. ముసల్మానుల కాలములోని చరిత్రములనేకము లిప్పుడు బయలు వెడలుచున్నవి. తంజావూరు ప్రాంతములయందు నూతనముగా కనుగొనఁబడిన యాంధ్రవాఙ్మయమున నెన్నియో చరిత్రగ్రంథములున్నవి. ఇట్లే ప్రతిరాష్ట్రమునందును దేశచరిత్రకు సంబంధించిన గ్రంథములు బయటికి వచ్చుచున్నవి. ఇట్టి గ్రంథముల యునికి తెలియని కాలములో నవియున్నవో లేవో తెలిసికొనుటకు శ్రమతీసికొనని వారిండియా దేశము వారికి చరిత్రములు వ్రాయు నలవాటు లేదని చెప్పియుండిరను నట్టి వ్రాతలిఁకముందు బయలుదేరకుండును గాక !

చరిత్రగ్రంథములఁ గూర్చిన ప్రశంస మనకు ప్రాస్తావికముగా వచ్చినది కాని విద్యావిషయమునం గాశ్మీరమునకుఁ బ్రఖ్యాతి చరిత్రగ్రంథములవలన రాలేదు. ఆదేశము పురాతన కాలమునుండియు నలంకారశాస్త్రమునకుఁ బ్రసిద్ధినంది యుండెను. ఒకొక్క విద్యాపీఠమునం దొకొక్క శాస్త్రము తక్కిన శాస్త్రములకంటె నెక్కువగాఁ గృషిచేయఁబడుచు వచ్చెను. కాశీ వ్యాకరణమునకును, నవద్వీపము తర్కమునకును నాకరపీఠములయినట్లే, కాశ్మీరమలంకార శాస్త్రమునకును, సాహిత్యమునకును మూలస్థానమని మనము చెప్పవచ్చును. అలంకారశాస్త్రమునం దాదిభిత్తి పెట్టినవాఁడు భామహుఁడు. ఇతఁడు క్రీ॥ పూ॥ ౫ వ శతాబ్దమున నుండెనని నిర్ణయింపఁబడినది. ఎట్లయినను నితఁడు కాళిదాసునకుఁ బూర్వమే

యుండెను. ఈతఁడు 'కావ్యాలంకార సూత్రములను' గ్రంథ
మును రచించెను. ఇతనితోడనే యలంకారశాస్త్ర మారంభ
మయ్యెనని మనము జెప్పవచ్చును. ఈతని పిదప మనకు దొర
కిన గ్రంథము వామన విరచితమగు 'కావ్యాలంకారసూత్ర
వృత్తి' ఈ వామనుఁడు ౭వ శతాబ్దమునఁ బుట్టిన 'వేణీసంహారము'
నుండి వక్రోక్తి యనునలంకారమునకు లక్ష్యము నుదాహ
రించుట చేతను ౧౦వ శతాబ్దము వాఁడగు అభినవగుప్తుఁడీతని
ప్రామాణికునిగా నంగీకరించుటచేతను రాజతరంగిణియందీతఁ
డు జయాపీడుని యాస్థానమున ౭౭౯,౮౧౩ సం॥ రముల మధ్యనున్న
ట్లు చెప్పఁబడియుండుట చేతను ౮ వ శతాబ్దమువాఁడని స్థిర
పడుచున్నది. ఈతని గ్రంథ మలంకార విషయమై యత్యంత
ప్రమాణముగా నంగీకరింపఁబడుచున్నది. ఈతఁడు వృత్తియం
దును సూత్రముల శైలినే యవలంబించియున్నాఁడు. తరువాత
నానందవర్ధనుఁడు 'ధ్వన్యాలోకము'ను రచించెను. ఈతఁడ
వంతివర్మ కాలములో (౮౫౫—౮౮౪) నాతని యాస్థానమున
నుండెను. ధ్వన్యాలోకము విజ్ఞాతకర్తృకమగు 'ధ్వనికారిక'లను
గ్రంథమునకు వృత్తియైనట్లు కనఁబడుచున్నది. ధ్వనిని గూర్చి
యీతనికిఁ బూర్వుల గ్రంథములలో నంతగా ముచ్చటింపఁ బడ
లేదు. ఈవిషయమై యతివిపులముగా నీతఁడు ముచ్చటించుచు
తాను వ్రాసిన దంతయు ప్రమాణముగా స్వీకరింపఁబడ వల
యునని చెప్పియున్నాఁడు. ఈతఁడు మిక్కిలి మనోహరము గు
దేవీశతకమును గూడ రచించియున్నాఁడు. రుద్రటశతానందుఁడు

'కావ్యాలంకారమ'ను గ్రంథమును రచించెను. ఈతని తండ్రి యగు భట్టారకవామకుఁడును గొప్పయాలంకారికుఁడని భోజ ప్రతిహారేందురాజు చెప్పియున్నాఁడు. కావ్యాలంకార కర్త ౮౫౦-౯౦౦ల మధ్య జీవించి యుండెను. కావ్యాలంకారము దండిరచించిన కావ్యాదర్శమున కనుకృతియై యున్నది. ఇది యార్యావృత్తములలో సకుంఠిత శైలిని వ్రాయఁబడినది. దీనికి ౧౬౫౯ సంవత్సరమున నేమినాధుఁడు వ్యాఖ్యానము వ్రాసి యున్నాఁడు. బృహద్వృత్త్యభిజ్ఞావిమర్శని' యను గ్రంథమును, 'లోచనా' యనుధ్వన్యాలోకమునకువ్యాఖ్యను, అభినవభారతి' యను నాట్యగ్రంథమునకు వ్యాఖ్యయగు నాట్యలోచనా యను గ్రంథమును నలంకారమువిషయమై కాక, భైరవస్తోత్రము' 'మహోపదేశవింశతి' యనుగ్రంథములను గూడ రచించి కవిత్వము, తర్కము, వేదాంతములందుఁ గూడ నసమానప్రజ్ఞావంతుఁడని ప్రఖ్యాతిఁ గాంచి యనేకులు తన్నాదర్శప్రాయునిఁ గాఁజేసికొనినయభినవ గుప్తాచార్యుఁడు పదియవశతాబ్దపు పూర్వార్ధమున జీవించియుండెను. జయ్యటుని పుత్త్రుఁడగు మమ్మటుఁడు కావ్యప్రకాశ'యను గ్రంథమును ౧౧వ శతాబ్దమునః రచించెను. ఈతని కాలములోఁ గాశ్మీరమున విద్యలన్నియు నత్యుచ్ఛదశలో నున్నట్లు తెలియుచున్నది. ఈతని శైలి మితపద సంబద్ధముగను స్పష్టార్థప్రతిబోధకముగను నుండును. క్షేమేంద్రుఁడు ఔచిత్యవిచారచర్చా యను శైలిని గూర్చిన గ్రంథమును, సువృత్తతిలక మను ఛందో

గ్రంథమును రచించెను. ఈతఁడు తానేర్పఱచిన లక్షణములకు లక్ష్యములను విపులముగా నిచ్చియున్నాఁడు. మమ్మటునికిఁ బూర్వుఁడైన రుయ్యకుఁడు 'అలంకారసర్వస్వ' మనుగ్రంథము నత్యుత్కృష్టశైలితో గద్యాత్మకముగను 'సహృదయలీల' యను మఱియొక గ్రంథమును పద్యాత్మకముగను రచించెను. జయద్రథుఁ డీతని గ్రంథమునకు 'వ్యాఖ్యానము' వ్రాసియున్నాఁడు. ఈతడు ౧౧వ శతాబ్దపూర్వార్ధమున నుండినట్లు తెలియ వచ్చుచున్నది. ౧౬ వ శతాబ్దాదిని గంగానందుఁడు కావ్యరసవిషయమై 'కర్ణభూషణ'మను గ్రంథమును రచించెను. ఈతఁడు లూనకర్ణుఁడను రాజు నాశ్రయించియుండెను.

పైన బేర్కొనబడిన వారెల్లరును కాశ్మీర దేశము వారు. వీరుగాక యలంకార గ్రంథముల వ్రాసిన వారింకను జాలమంది యున్నారు. ఇఁక వ్యాకరణమునకుఁ గూడఁ గాశ్మీరము కొంతప్రసిద్ధి వహించి యున్నది. కాశికా వృత్తిని రచించిన జయాదిత్య వామను లిద్దఱును గాశ్మీరము వారే. వీరిలో వామనుఁడు కావ్యాలంకారసూత్రవృత్తిని గూడరచించెనని పైని చెప్పియున్నాము. కాశ్మీరరాజగు జయాపీడుఁడే జయాదిత్యుఁడని కొందఱను చున్నారు గాని యిదియెంతవఱకు నిశ్చయమో తెలియదు. కాశికలోని మొదటిదైదు ప్రకరణములు జయాదిత్యరచితములును దరువాతి మూఁడుప్రకరణములును వామన రచితములునై యున్నవి. వీరిరువురును బౌద్ధమతస్థులో, బౌద్ధమతాభిమానులో యై యుందురని యొ

కరు వ్రాసియున్నారు. మహాభాష్యప్రదీపమును వ్రాసిన కైయటుఁడును కాశ్మీర దేశవాసియే. ఈతఁడుపాధ్యాయ జయ్యటునిపుత్రుఁడు. ఈతని గురువు మహేశ్వరుఁడు. భీమసేన విరచితమగు మమ్మటుని కావ్యప్రకాశవ్యాఖ్యానములో మమ్మటుఁడు, కయ్యటుఁడు, ఔవటుఁడు, నను వారలన్నదమ్ములనియు మమ్మటుఁడు కైయటుని కన్నయనియు దెలుపఁబడియున్నది. ఇదిగాక పండ్రెండు పదునాఱవ శతాబ్దముల మధ్య కాశ్మీరమునందు కాతంత్రవ్యాకరణ మెక్కువ ప్రబలముగా నుండెను. సింహళ, వంగదేశములందలి కాతంత్రవ్యాకరణమునకును గాశ్మీరమునందలి దానికిని గొంతభేదమున్నది. దుర్గసింహునికిఁ దెలిసిన సూత్రపాఠముకంటెఁ గాశ్మీరపండితులుపయోగించు సూత్రపాఠము భిన్నముగానున్నది. ఇందువలనఁ గాశ్మీరపండితులకు దుర్గసింహుని సూత్రవృత్తి కూర్పు యిటీవలనే తెలిసెనని యూహింపనగును. ఆసూత్రవృత్తికి పూర్వమున గాశ్మీరపండితులు స్వతంత్రముగా వ్యాఖ్యానములు వ్రాసియుండిరి. అట్టివానిలో కొన్నిమాత్రమే యిపుడు మిగిలియున్నవి. అందులో భట్టజగద్ధరుఁడు వ్రాసిన 'బాలబోధిని' యొకటి. దీనిపై 'ఉగ్రభూతి' యనునాతఁడు న్యాసమును వ్రాసెను. ఆనందపాలుఁడను రాజునకు గురువుగా నుగ్రభూతి యనువాఁడొకఁడుండెననియు, పండితులకు తచ్ఛిష్యుఁడగు రాజుచే బహుమానము లిప్పించి యాతఁడు తనవ్యాకరణమును వ్యాపింపఁజేసెననియు అల్బురూని యనుచరిత్రకారుఁడు

వ్రాసియున్నాడు. ఈయుగ్రభూతియు న్యాసకారుడగు నుగ్రభూతియు నొక్కడేయైనచో నీతడు పదియవశతాబ్దాంతమున నుండియుండును. 'బాలబోధిని' కాక చిచ్ఛభట్టవిరచితమగు 'లఘువృత్తి'యు నీకాలమునదే. పైవానివలెనంత ప్రశస్తములు కాకపోయినను తరువాతికాలమున ననేక వ్యాకరణములు బయలుదేరినవి. ఇప్పుడు కాశ్మీరములో సర్వసాధారణముగ వాడుకలోనున్న వ్యాకరణములన్నియు కాతంత్రవ్యాకరణమున ననుసరించునవే.

౮ వ శతాబ్దమున భల్లటుడు 'భల్లటశతక'మును భర్తృహరినీతిశతకమువంటిదొక గ్రంథమును వ్రాసెను. మంఖుడు 'శ్రీకంఠచరిత'మునేగాక 'మంఖకోశ'మను నొక నిఘంటువును గూడ రచించియున్నాడు.

ఇప్పటికి నలంకారసాహిత్యములందును వ్యాకరణమునందును కాశ్మీరము ప్రఖ్యాతివడసియున్నది. ఇచట నింద్రజాలవిద్యయు హెచ్చుగనున్నదట. తంత్రగ్రంథములచట హెచ్చుగా ప్రచారములో నున్నట్లును దెలియవచ్చుచున్నది.



శ్రీరస్తు.

# ప్రాచీన విద్యాపీఠములు

## కాశీ.

వేదకాలమునుండియు బ్రాహ్మణవిద్యకాటపట్టయి హిందువుల కందఱకిని తమతమ జీవితకాలములో నొకసారియైనను వీక్షింపఁ గోర్కె పుట్టించుటయేగాక తనయందు మృతిజెందిన వారికి ముక్తిని సంపాదింపఁగల్గి నాఁటినుండి నేఁటివఱకును నఖండ సంపదల కాస్థానమై, భక్తికి నెలవై, స్వార్థత్యాగమునకుఁ బట్టినిల్లై, హిందువుల నాగరకత శిథిలము గాకుండ వివిధ భాషలను మాటలాడు వారైనను భారత వర్షీయులెల్లరి నెక్కటి యను నైక్యమునకు గుఱుతై యొప్పు కాశీపట్టణము విద్యాపోషణమునందగ్రగణ్యత వహించియున్నది. ఇచటనుండియే బ్రాహ్మణులు సాహసించి దక్షిణ దేశమునకు వలసలు పోయి తమ నాగరకతను మొదటినుండియు ప్రబలజేయుచు వచ్చిరి. కాశ్మీరము, బదరికాశ్రమము, సింధునదీ ప్రాంతములు మొదలుగా గల ప్రదేశముల నాక్రమించి, క్రమక్రమముగా గంగాతీరముం జేరి, నానానాగరికతా సమ్మేళనమునకును, నానా జాతు లేకేశ్వరారాధనము జేయుటకును, భర

తవర్షము నంతటి నొక కేంద్రస్థానమునకుఁ దెచ్చి యైకమత్యముం బాదుకొల్పుటకు ననువై యున్న వారణాసి నార్యులాక్రమించి, దానిని మహోన్నతమగునట్లు గావించి, యచట చిరకాలము వసియించి, యచటనుండి దక్షిణమున కేతెంచియున్నట్లు మన కనేక నిదర్శనములు కానవచ్చుచున్నవి. అట్లు వచ్చినవారిలో మొదటివాఁ డగస్త్యుఁడని పురాణములు ఘోషించుచున్నవి. వింధ్యాచలము మేరువుతో మత్సరించి యుద్ధతిమై పెరిగిపెరిగి సూర్యమండలమును నిరోధింపగా లోకప్రవృత్తి యంతయు నిల్చిపోవుటచే దేవత లందఱును విశ్వనాథసేవాతత్పరుఁడై కాశీయందు వాసముచేయుచున్న అగస్త్యుని జేరంజని యాతఁడు సముద్రమంతయు బుడిసిటం దిగద్రావి రక్కసులగుట్టు బైటఁబెట్టుటయుఁ వాతాపీల్వలులను బరిమార్చిన విధంబును తమమనంబుల నాతనియెడ గల విశ్వాసమును దృఢపఱుప వింధ్యాచలము గర్వమునణఁగఁగొట్ట నాతని వేఁడికొనుటయు, నాతఁడును వల్లెయని దక్షిణాభిముఖుఁడై వింధ్యము తన శిష్యుఁడగుటచే సాష్టాంగపడ దాను తిరిగివచ్చువఱకు నట్టే యుండుమని యాదేశించి దక్షిణాపథముఁజొచ్చి యచ్చట నివసించి యెన్నటికిని రాకుండుటచే నాపర్వతమట్లే యొఱగియుండిపోవుట సంభవించుటయు నను కథ స్కాందపురాణమునఁ జెప్పఁబడియున్నది. ఆ కాలమునంగూడ వారణాసి మహాపుణ్యక్షేత్రమై భక్తులను తన్ను విడుచుటకు మనసుఁ

గొల్పఁ జేయుచుండెను. శ్రీనాథుఁడు కాశీ నిట్లు వర్ణించి యున్నాఁడు.

సీ॥ కాశికా నగరంబు కడసీమయందున్న
ఛండాలుఁ బోల నాఖండలాదు
లానంద వనములో ననశనస్థితి నున్కి
భువన సామ్రాజ్య వైభవము బోలు,
నవిముక్త దేశస్థుఁడయ్యెనే బతితుండు,
నశ్వమేధాధ్వరాహర్తదొరయు,
వారణాశీ సంభవంబైన మశకంబు
నైరావతముతోడ నవఘళించు,
గీ॥ నాటికొని శ్రీమహాశ్మశానమున నున్న,
యణుక నగ్నలపటుఁడైన నాగ్రహమున,
గర్వితోద్ధతి నేతెంచు గాళరాత్రి
మృత్యుదేవత ముక్కఁదుల్ల మెరకజాలు.

ఉ॥ తత్తరపాటులేక నదిదాన మొనర్చి పినాకపాణిదే
వోత్తము విశ్వనాథుఁ గరుణోదధి గమ్మని పువ్వుగుత్తులన్
బత్తిరి పూజఁ జేసి నుతిసారములన్ శ్రవణించువారికిన్,
దొత్తులవోలెదక్కుదురుదొప్పలుదోరలుముక్తిభామినుల్.
గీ॥ కాశికల్యాణమున కాదికారణంబు,
కాశి యణిమాది సిద్ధుల కాటపట్టు,
కాశి జనలోక సంకల్ప కల్పవల్లి,
కలుష పిసితంబు మెసవు రాకాసి కాశి.

సీ॥ పాలిండ్లు కదలంగఁ బసపు పయ్యెద విచ్చ
నచలాధిపతి కూర్మి యాఁడుబిడ్డ
ఘూత్కారమొనరించు శుండంబు ముక్కున
సీకరాసారంబు చిలుకుచుంటి
ప్రత్యక్షమై వచ్చి భాగీరథీగంగ
మృదులహస్తము సాచి మేను నిమురు
బ్రమథోత్తముఁడు భృంగి భయరక్షణార్థమై
ఫాలాగ్రమున దీర్చు భసిత రేఖ.

గీ॥ దక్షిణశ్రుతి మీఁదుగా ధాత్రిఁజెంది
పెద్ద నిద్రకు మ్రాగన్ను వెట్టువేళఁ
బంచజనులకుఁ దారకబ్రహ్మవిద్య
యభవుఁ డుపదేశ మొనరించునపుడు గాశి.

ఇట్టి కాశికాపుణ్యక్షేత్రంబుఁ బెడబాసి యుంట కెట్టి మూర్ఖుండేని సమ్మతించునే? లోకహితార్థంబు పొంటె నగస్త్యుండు దాని విడువ మది గొల్పెఁ గాక! అగస్త్యునంత వానికిని కాశికా విరహవేదనాభారంబు దుస్సహంబై యుండెను గదా! కావున నగస్త్యుఁడు కాశిని విడిచి పోవుచు నిట్లు జాలిజాలి పలవరింపఁ దొడంగె.

క॥ ఆమచ్చిక లాచనువా
పేర్మాతిశయంబు విస్తరింపగ వశమే,
వ్యోమమండల తిలకమ, పర
భూమికి నిన్నట్లు బాసి పోవుదుఁ గాశీ.

మ॥ నిజమేఁ బల్కెద బాహులెత్తి శ్రుతివాణీజాహ్నవీదేవతా
ధ్వజినీ ఢుంఠి గణేశ్వరుల్ గలుగవో వారాణశీదేవి యో
గజచర్మాంబరు కూర్మిపట్టమ యొకళ్యాణి నిన్బోలఁగం
బుజగర్భాండమునందు లేవు నగరంబుల్ తీర్థరాజంబులున్

సీ॥ పరమకళ్యాణి యో భాగీరథీగంగ,
వార్ధిభామిని పోయివత్తునమ్మ,
యమరేంద్రులార భోలార్క కేశవులార,
వనజసంభవ పోయివత్తునయ్య,
శ్రీవిశాలాక్షి దాక్షిణ్య పుణ్యకటాక్ష,
వాసవార్చిత పోయివత్తునమ్మ,
శ్రీపూర్ణభద్ర పారిషద నాయకులార,
వటుక భైరవ పోయివత్తునయ్య,
తీర్థసంవాసులార కృతార్థులార,
పాశుపతులార భాగ్యసంపన్నులార,
మందిరోద్యాన వాటికా మఠములార,
పోయివత్తును మీ కాశిపురము విడిచి.

ఇట్లు దురపిల్లుచుఁ గాశీక్షేత్ర "విప్రయోగ ప్రభూత హృదయసంతాపశాంతికై యిల్వాలారి" యుపనిషత్తుఁ బఠించుకొనుచు లోపాముద్రాసహితుఁడై వింధ్యగిరి పరిసర ప్రాంతంబులఁ జేరునప్పుడు,

చ॥ దురితమ్ము లెన్ని చేసితినొ తొల్లిటి జన్మమునందు గాశికా
పురమున సర్వజంతువులు భూరివిముక్తులు గొల్లవెట్టఁగా

హరహర! నెత్తిఁ జేతులిడి యశ్రులు కన్నుల నుప్పతిల్లఁగా
గరినిభయూరుతో నిదెపోకాలెద మిన్నులు వడ్డచోటికిన్.

అని యాక్రోశించెను. కాశీ విప్రవాస వేదవ్యాస భగ వద్ధూళిరహా రగస్త్యునివలె నింక ననేకు లుండిరి. అట్టి వారిలో వ్యాసుఁడు నొక్కఁడు. ఈతని భక్తిని బరీక్షింపఁగోరి విశ్వనాథుఁడు కాశీయందు వ్యాసునికి నితని శిష్యులకును నేడు దినములు కూడు చిక్కకుండఁ జేసెను. వారును క్షుధాతురులై యన్నమన్నమని దేవులాడఁ దొడఁగిరి. ఆకటి పెల్లున నోర్వలేక వ్యాసుఁడు కమండలూదకమును గ్రహించి కాశీని శపింప సమకట్టెను. అట్టి తఱి నొక వృద్ధస్త్రీ తలుపు తెఱచికొని బయిటికి వచ్చి కలస్వనంబున నాతని కిట్టులనియె.

గీ॥ భిక్ష లేదని యింత కోపింతురయ్య,
కాశికాపట్టణము మీఁదఁగాని నేయు,
నీమనశ్శుద్ధి దెలియంగ నీలకంఠు
డింత జేసెను గాక కూడేమి బ్రాఁతి.

గీ॥ శ్రీవిశాలాక్షి బంగారు తెడ్డువంను,
నమృత పాయస మొసఁగు నభ్యాగతులకు,
కాశికాపురి మధ్యాహ్నకాలమునఁగ,
వినియు నెఱుఁగవె యాతిథ్యవేళలందు.

ఉ॥ ఏను దినంబు లన్నమున కెడ్డయి పుట్టికి యంత మాత్రతో,
నేడు చుచున్న వాఁడవు మునీశ్వర నేడుతు నీదు ధీరతల్,

పాడఱిపోయెనే శివుని భార్యకుఁ గాశికిఁ బుణ్యరాశికిన్,
గాడుపెనర్పఁజూచెదవు కంఠపుఁగ్రోధము పెచ్చువెచ్చఁగన్

ఉ॥ కొన్నిలపువ్వుదాల్పునకుఁ గూరిమిభోగపురంధ్రికన్కటా
యిన్నగరీలలామమున కీపరిపాటికి నింతకోపమే,
లన్న! ఘటించెదో మునికులాగ్రణి! నిక్కము జాఁబుభుక్షిత
కిన్నకరోతిపాపము"ను కేవల నీతి దలంచిచూడగన్.

అని మందలించుచు ఓయీ కాశీపై కోపగితురా! దీ నిందలంచి యిందుమాళి యెంతకోపించునోగదా! కానిమ్ము నీవు బ్రాహ్మణుఁడవు నీవైనర్చిన తప్పుల నెన్నఁగూడదు మాయింటికి రమ్ము భిక్షనిచ్చెద నన వ్యాసుఁడు సంతసించెనే గాని గురూత్తముఁ డగుటచేఁ దన శిష్యుల యాకలిని మఱువక యాయమతో

శా॥ తల్లీ! యిన్నిదినాలకేనియు సుధాధార రసస్యందియై,
యుల్లంబుల్ సుఖియింపఁజేయు పలు కెట్లో విఁటికిన్ వీనులో
బెల్లాకొన్నతనాన శేనెకఁడనే భిక్షానకున్ వత్తునో,
యెల్లన్ శిష్యులఁగొంచువత్తునె నిజంబేర్పాటుగా జెప్పుమాఁ

గీ॥ ఈవు పెట్టిన భిక్ష మేమిందఱము ను,
బంచుకొని జేయువారము ప్రాణరక్ష,
నాఱియఁబధఱవియును ప్రాణములుఁగావె,
నాయుదియె ప్రాణమని వత్తుఁ ద భుజింప.

అను పల్కుల కాతని శిష్యవాత్సల్య సంప్రీత చేత

స్థుడై యాయన్నపూర్ణాదేవి యందఱికి నాతిథ్యముం జె
ప్పి వారి నిష్టమృష్టాన్నభోజనములచే సంతుష్టాంతరంగుల
గావించెను. కాని విశ్వనాథునకు వ్యాసునిపై గోపము వచ్చి
దక్షిణాపథవాసుల భాగ్యమునకో యన నాతనిఁ దన ప్రోలు
విడిచి పొమ్మనెను. కాని పార్వతి సవతి యగు కాశి నవమా
నించిన వ్యాసుఁ జేపట్టి దక్షవాటిక యందు భీమనాయకుఁ
గొలుచుచుండు మని నియోగింప నాతఁడును కాశీవిరహవేద
నా పరిపీడితుఁడై, తనవలె చాలకాలము క్రిందటనే దక్షవా
టిం జేరియున్న యగస్త్యునిఁ గలిసికొని,

ఉ॥ జగతీనాళి వతంస భూషణము విశ్వవిఖ్యాతముం గాశికా
నగరంబుం బెడబాసి నీకును జగన్నాథైక చారిత్రయీ
చిగురుంబోడికి నాకునుం గటకటా చేకూరెటు వాటిలె నీ,
ముగురంగూ ఏనమండదైవమునకున్ మోమాటలేదోసుమీ
యని తను, విప్రదాసముం జింతించుచు నెట్టకేలకు ద
క్షారామముననే కాలముఁ గడుపుచుండెను.

పై రెండు గాథలయందునుఁ జరిత్రాంశము లుండుటను
గనము సులభముగా గ్రహింపవచ్చును. వింధ్యాచలము పెచ్చు
పెరిగి సూర్యమండలము నడ్డపెట్టుబడియు మాపర్వత ప్రాంతముల
వారు గర్వాంధులై మేరుపర్వత ప్రాంతవాసులగు నార్యు
లతోఁ బోరాడ నుద్యమించుచుండ, నగస్త్యుఁ డచటి కేగి తన
బ్రహ్మతేజస్సుచే వారిని తనకు లొంగునట్లు చేసి వములల

గావించుటయు, నావెనుక దక్షిణమునకేగి యచటను నార్యు
లనాగరకతను బ్రస్తరింపఁజేయుటయును దెలుపుచున్నవి. అట్లే
గొప్పనగరములనైన నొక్కొక్కప్పుడు కఱవు కాలములలో ను
పాధులులేక జనులు విడిచి యితర ప్రదేశములకు వలసలు
పోవుట. స్వాభావికము; వ్యాసుని విప్రవాస మట్టిదియై యుం
నోపును. ఎట్లయిననేమి యార్యులు కాశియందు స్థిరవాస
మేర్పఱచికొని యచట తమ విద్యలను నాగరికతను వ్యాపిం
పఁజేసిన పిదపనే యచ్చటినుండి దక్షిణమునకుఁ గదలి
యుండుట తేటపడఁగలదు.

రామాయణ కథా కాలమునకే యగస్త్యుఁడు చాల కాల
మునుండియు దక్షిణాపథమున వాసము చేయుచుండెను. అం
టి కాలఁడప్పటి కెంతకాలము క్రిందవెల్లెనో చెప్ప వీలులేదు.
కావున నార్యులు కాశియందెప్పుడు ప్రవేశించిరో యెప్పటి
నుండి యది పవిత్రక్షేత్రముగాఁ బరిగణింపఁ బడుచుండెనో
గూడ చెప్పుటకు పిలులేదు. కావున కాశి యతి ప్రాచీనమగు
పట్టణ మనియు నచట నార్యవిద్య లెంతో కాలము నుండి
యు ప్రబలుచుండెననియు మనము తెలిసికొనవచ్చును.

కాశి చాల నవీనమైన పట్టణమని కొందఱు తలంచు
చున్నారు. కాకేమి? అది యెన్నటికిని నవీనస్వరూపముతో
గనఁబడుచుండును. అయిన దాని ప్రాచీనతను గనుఁగొన
టకు కొంతము కన్నులు తెఱవిచూపవలెను. నివేదితా

యీవిధమునై యిట్లు వ్రాయుచున్నది:—

"బజారులలో నీకు పట్టణమధ్యమునందేమి, యిండ్ల శిల్పమునందేమి, దీని ప్రాచీనత కండ్లకు గోచరమగుచునే యుండును. ఇదిగో జన్మసత్రము దీని శిల్పము ఉత్తరహిందూస్థానమున చంద్రగుప్తశతాబ్దము నుండి పదునారవ శతాబ్దము వఱకు ప్రబలియున్న జాన్‌పూరు పఠాను శైలిని జ్ఞాపకము చేయుచున్నది. ఇచటి కనతిదూరమున నున్న కలవపై చెక్కరీతిగా రాతిపై చెక్కయుంపబడి యశోకుని నాటి శిల్పమును జ్ఞప్తికిదెచ్చు నొక యింటిచూరు కానవచ్చుచున్నది. ౧౦౫ మెట్లున్న నొకగృహమున్నది. ఈయింటివారా యిల్లు రెండువేలసంవత్సరములనుండియు నట్లేయుండెనని చెప్పుదురు. ఈ యింటి చావడులలోని స్తంభములను పలకించినచో వారి మాటలను సంశయింపఁ బనియుండదు. ఇదిగో! విశ్వనాథుని బజారు వీథి. ఈవీథి వెంబడినే వేదకాలపుఋషులు సంచరించుచు సూర్యోదయకాలమున విశ్వేశ్వర సాన్నిధ్యమున ఋక్కులఁబఠించుచు హోమము జరిపి యుండవలెను.

ఇప్పుడు మ కంటికగపడు చూడు నగరమైనను లోకము తెలియని విమర్శకు లనుకొను దాని కంటె నెక్కువ పురాతనమైనదే. ఇచ్చటి సారనాథ్ దగ్గఱనే క్రీ. పూ. ౫౨౩ వంవత్సరమునో యాప్రాంతములనో బుద్ధుఁ డొకసారిగా నానంద పరవశుఁడై కనుగొంటిని! కనుగొంటిని! మృత్యువునుండి

తప్పించుకొనుమార్గము తెలిసినది. భిక్షువులారా! చెవి యొగ్గి వినుఁడి!" యని ముక్తిమార్గము నుపదేశించెను. ఆతని యుపదేశ ఘంటానాదము నేటికిని చెవులలో మ్రోగుచునే యున్నది. భోగములపై రోతపుట్టి దుఃఖముల నలువము నొందించు నుపాయము నారయుటకై యరణ్యముల వనవాస క్లేశముల సహించి యదియు తగిన మార్గముని తోచక యచట నుండి తనగురువుల యొద్దనే తన సంశయములు దీర్చుకొన నెంచి వచ్చుచు మార్గ మధ్యమున వారు మృతి నొందిరని విని కాశీ మార్గము బట్టి పోయి యచట తన పూర్వశిష్యుల నివసించి యుండు సారనాథు ఉద్యానవనము ప్రవేశించి బుద్ధుఁడు వారితో సంభాషింప నెంచెను గాని వారు తమ మనమున సమ్మానము లేని వారగుటచే నాతని యెడఁ బూర్వపు భక్తిని జూప నొల్లరైరి. కాని వారిలోఁ బెద్దవాఁడగు కౌండిన్యుఁడు తక్కినవారితోఁ గలియక ఆర్యగౌతము యని పల్కరించెను. ఇదియే తరుణమని కౌండిన్యునితో బుద్ధుఁడు తన కార్యశబ్దము తగదనియు నట్టి గౌరవ సూచక శబ్దముల నుపయోగించుచున్నంత కాలమును జనులు మృత్యు మార్గమునే యవలంబించుచున్నవార లగుదురనియు మృత్యువు నుండి విముక్తిఁ బొందు నుపాయమును గనుగొంటిననియుఁ జెప్పి తన యుపన్యాసము నారంభించెను. ఈయుపన్యాసము ధమ్మచక్కప్పవత్తనసుత్త (ధర్మచక్రప్రవర్తనసూత్రము) యందు

ప్రాయఁబడి యున్నది.

"ఆయుపన్యాస సమయమున దేవత లెల్లరు స్వర్గము విడిచి పరువు పరువున నేతెంచిరి. వారి రాక యొక్క గొప్ప తుపాను వచ్చునప్పటి ధ్వనిఁ గలిగించెను. అంత నొక భేరీ మ్రోత వినవచ్చెను. వెంటనే యాధ్వని యొక్కింతయు వినపడక సర్వమును నలుగు లేని సముద్రము వలె నుండెను. ప్రకృతి యంతటి యందును క్షోభము పుట్టెను. పర్వతములు సంతోషము పట్టలేక గంతులు వైచుచు పరమ గురువునకు సాష్టాంగపడెను. వాయుదేవత సర్వమును యథోచిత స్థానములనుండునట్లు చేసెను. మందమారుతములు వీచెను. పుష్పములు తమ సువాసనను వెదజల్లెను. అంత నుడుగణములు నంచలోని ముక్తాహారములుగా, నీలమేఘములు కబరీభరంబుగా, నగాధమగు నాకాశము చీరామచుంచు చీరెగా, స్వర్గములు కిరీటముగా, త్రిలోకములును దేహముగా, ఉదయ చంద్రుని కరముల గిరగిరతిరు విచ్చు ధవళసరోజము కన్నుల యుగముగా, భ్రమర గీతములు కలనాదములుగా, బుద్ధదేవునిఁ బూజించుచుకొను, నాతని ప్రథమోపన్యాసమును వినుటకును, సంధ్యా కన్య బయలువెడలెను. గౌతముఁడు పాలీభాషలో మాట్లాడుచున్నను దేవతలనుండి పిపీలికముల వఱకు నెల్లరు తమ తమ భాషలలో ప్రత్యేకముగా దమ్ముద్దేశించియే మాట్లాడుచున్నట్లుండెను.

మనుష్యుఁ డొకప్రక్క భోగేచ్ఛలను, రెండవప్రక్క దేహమును శుష్కింపఁజేయు నుపవాసాదులను విడిచిపెట్టి యీరెండింటికిని మధ్యమార్గము నవలంబింపవలయును. ఈ మార్గమున కెనిమిది యంగము లున్నవి. అవి క్రమములగు విశ్వాసము, క్రమమగు నాశయములు, క్రమమగు వాక్కు, క్రమమగుకర్మాచరణము, క్రమమగు జీవనము, క్రమమగు నుత్సాహము, క్రమమగు మనస్సు, క్రమమగు భక్తి, యనునవి, యీమధ్యమార్గము నవలంబింపవలయుట క్రింది నాలుగు విషయములును గారణములై యున్నవి.

౧. పుట్టుటయే దుఃఖము; వృద్ధి, క్షయము, రోగము, మరణమియు దుఃఖములే. మనము ప్రేమించు వస్తువుల నెడఁబాసి యుండుట, మనము తప్పించుకొన నెంచినవానిని ద్వేషించుట, అలభ్యములగువానికై యాస పెట్టుకొనుట, యివి యన్నియు దుఃఖదాయకములే. నేను వేఱు, నీవు వేఱు, అను నూహలను పుట్టించున దంతయు దుఃఖదాయకమే.

౨. దుఃఖ కారణము:—ప్రపంచేంద్రియ సంయోగముచే నాయింద్రియ తృప్తికొఱకుఁ గోరికలును, యింద్రియగోచరములగు వస్తువులఁ బొంది సంతోషమును జనించును. ఈరెండును నీజీవము పైవాంఛ జనింపఁ జేయును. ఇవియే దుఃఖకారణములు.

[illegible]

గ్రముగ జయించుటయే దుఃఖాంతము.

౮. ఈదుఃఖము నంతము నొందించుటకుఁ బైని చెప్పిన యష్టాంగములను ననుసరింప వలయును.

ఇట్లుపన్యసింపుచు బుద్ధుఁడు తన కీసత్యములు వేదాధ్యయనమువలనను, నితరులబోధలవలనను, దెలియలేదనియు హేతువాదము వలనను యంతరాత్మనుండియు వానిని సంపాదించితి ననియుఁ జెప్పి విరమించెను. వెంటనే యొకరి తరువాత నొకరాతని వాదము నంగీకరించి యాతని మతము నంగీకరించిరి.

ఇట్టి మహోపన్యాసములు జరుగుచుండిన యీవిశ్వవిద్యాలయమునందు చిరకాలము నుండియు వేదాంతము స్వేచ్ఛగా నభ్యసింపఁ బడుచుండుట తేటపడుచున్నది. బుద్ధుని యుపన్యాస తత్త్వమును బోధపఱచుకొనఁగలవారు వారును వేదాంత మార్గమును బాగుగఁ దెలిసికొని తర్కశాస్త్రసాంప్రదాయముల నెఱిఁగినవారై యుండవలెను. బుద్ధుని యుపన్యాసములు జరిగిన మూడువందల సంవత్సరముల కాలేఁదు [illegible] సంచరించిన తావులయందెల్ల నశోకుడుఁ పవిత్రాలయములఁ గట్టించి యుండుట వలన నాస్థల మాహాత్మ్య [illegible] ప్రాబల్యములును ధర్మసూత్ర నిర్ణయమును [illegible] పట్టుచు యుండెనని మనమూహింపవచ్చును. [illegible] గాశియందలి [illegible]

వెడలక పూర్వ మెప్పుడో తరములనుండియు సూత్రాస్థలముగా నేర్పడిన ఆబ్బారియా కుండముచే గాక దశాశ్వమేధ ఘట్టమును బజారును నెందఱో చక్రవర్తు లచట యాగములనుం జేసియుండుటను దెలుపుచున్నవి. పాటలీపుత్రముగమున గా క్రీ॥ పూ॥ ౩౫౦ సం॥రమునుండి క్రీ॥ శ॥ ౫౦౦ సం॥రము వఱకును గాశీ మతవిషయములఁ గూర్చియు యాగాదికర్మలఁ గూర్చియు ధర్మసంశయములను విడఁగొట్టు విద్యాపీఠమై యుండె ననుట కేసందియమును లేదు. బుద్ధుఁ డిన్నగరమునకే యిచ్చట గొప్ప శాస్త్రజ్ఞులు నెలకొని యుండెనని తెల్పుచున్నది. క్రీ॥ పూ॥ ౫౫౦ సం॥ ర॥లో బుద్ధుఁడు విసర్జించిన పట్టుబట్ట లీకాశీయందు నేసినవే యని వాడుక కలదు.

ఈరీతిగా మన మాలోచించుకొనుచుఁ బోయిన యెడల గాశీపురము నవీనముగా లేచిన నగరము గాదనియు, నన్ని నగరము లాస్థలమునందే లేచుచు పడుచున్నను, క్రమముగ నేఁటివఱకును నభివృద్ధిఁ బొందుచు వచ్చినదనియు, దీనిపురాణ మట్టిదని చెప్ప వీలులేనంత ప్రాచీనమైనదనియుఁ, జెప్పక తప్పదు. ఇప్పటికైనను భరతవర్షమున పూర్వకాలపు శిల్పుల ప్రతిభ యంతరించ లేదు. ప్రస్తుత కాశీనగర మందేని లక్షణమున శోభించినను నట్టి నగరము నాస్థలమునందే బుద్ధి నిర్మాణముఁ జేయఁగల శిల్పు లిప్పటికి నున్నారు. అందుచే

పోయెను. బుద్ధుని కాలమునకు బ్రాహ్మణ మతమునందు గొప్ప దోషములు ప్రబలి యుండవలెను. మతమను పేర జీవహింస ప్రబలియుండెను. ఇట్టి స్థితి బ్రాహ్మణమతస్థులలోఁ జాలమందికి రోతబుట్టించెను. కాని, బుద్ధునివలెఁ దక్కినవారు తమ పూర్వమతమునుండి విడఁబడుటకు సాహసింపకైరి. మందుగుండంతయు నొకచోఁ జేరియుండెను. బుద్ధుఁడను నగ్నికణము దానికిఁ దగిలినంతనే యొక్కసారిగా జ్వలనము ప్రారంభించెను. దాని వేఁడి యిప్పటికినిఁ జల్లారలేదు. అట్టి మహాదహనము వలనఁగాని హిందూమతము నందలి దోషముల రూపు మాప వీలులేదయ్యెను. అట్టి దోషములను బ్రాహ్మణులు క్రమక్రమముగాఁ గనువిచ్చి చూచికొనసాగిరి. తమ తప్పుల నొప్పుకొనుచు వచ్చిరి. బౌద్ధమతము నందలి గుణములు తమమత మందును గలవని తెలుపుటకు వానిని సంగ్రహించుకొనిరి. ఇట్టి సమ్మేళనమువలన హిందూమతము మరింత శోభావంతమై బయలువెడలెను. హిందూమతము వేలకొలఁది సంవత్సరములనుండియు చిరస్థాయిగా నుండుటకిదియే కారణము. హిందూనాగరకత యవిచ్ఛిన్నముగా కొనసాగుటకిదియే రహస్యము. హిందువుల మతమును, నాగరకతయు, నతి విశాలాశయములు గలవి. హిందూమతములో నెన్నో యితరమతములు సంక్రమించిపోయినవి. ఇప్పుడే క్రీస్తును కూడ కృష్ణునితోను ముడిపెట్టుచున్నారు. క్రైస్తవులు

హిందువులను తమ మతములోనికిఁ ద్రిప్పికొనని చటికి వచ్చి
రి గాని యెవరికిని దెలియకుండగనే క్రైస్తవ మతములోని
గుణము లనేకములు హిందూమతము సంగ్రహించుకొనినది.
కొలఁది కాలములో హిందూమతము మఱింత విశాలదృష్టితో
నిలిచి పోయి యుండగా క్రైస్తవమతమునకు బౌద్ధమతము
గతియే పట్టిపోవును. ఏదీ? బౌద్ధమత మిండియాలో నెక్కడ
నున్నది? లేదని కొందఱందురు. లేకేమి? నిజమైనబౌద్ధమత
మిచటనే నిలిచిపోయినది. బ్రాహ్మణమతములో నది మునుఁ
గు పడియు డియు దానిలోనుండియే తనప్రభాపుంజములను
వెదజల్లుచున్నది. గుణదోష సమ్మిళిత మగు బౌద్ధమతము
మాత్ర మితర దేశముల నాశ్రయించినది. క్రైస్తవ మతము
మన దేశమునకుఁ గ్రొత్తగాఁ బ్రవేశించినది. అదియు బ్రా
హ్మణ మతమందు లీనమై పోవుటకుఁ జాలకాలము కావల
యును. మహమ్మదీయులునుఁ జాలప్రాంతములందు హిందూ
మతాచారముల నవలంబించుచున్నారు. మహమ్మదుకూడ
హిందువుల యవతారములలో నొకఁడుగా సంక్రమింపక
పోవునా?

మహమ్మదీయుల నాగరకత హిందువుల యింటింటి
లోనికిని జొచ్చిపోయినది. దీనిని గనుగొనుటకు నాయా భాష
లనుఁ బరిశీలింపవలెను. జాతుల నాగరకతను దెలుపు వానిలో
మొదటిది భాష. మహమ్మదీయుల [illegible]

ములు ప్రతిభవలోనికిఁ బోయినవి. ఆపదముల మూలమున నాలోచనలును చల్లచల్లగ మాఱిపోయినవి. రెండవవిశేషము; ఎవరిమట్టుకు వారే తమ దుస్తులను తమయాభరణములనుఁ బరీక్షించి కొనినచో నెంతమట్టుకు దేశములో మహమ్మదీయులైపోయిరో తేటపడఁగలదు. ఈట్టినాగరకతా సమ్మేళనమునకును కాశియే కేంద్రస్థానమయ్యెను. హిందూమతమునకును, సంస్కృతవిద్యకును, కాశీ యాదిపీఠమైయుండఁగా దానికనతి దూరముననే యున్న జాన్‌పూరు మహమ్మదీయవిద్యా కాటపట్టయి వెలసియున్నది. సొగసైన రెండు నాగరకతలొకచో గూడి యున్నప్పు డారెండిటి సమ్మేళనము వలన నెట్టి ప్రతిభావంతులైనను బుట్టుట కేమి సంశయమున్నది. ఒకప్రక్క సమస్త విజ్ఞాన విధానమైన సంస్కృత వాఙ్మయమును, వేఱొకప్రక్క నతి మనోహరములును మధురములు నగు పారశీక కావ్యములనుఁ బఠియించిన విద్యావంతులవంటివారిని ప్రపంచమందు మఱియేదేశమును బుట్టించియుండలేదు. ఈప్రక్కను హిందూపండితుఁడు; ఆప్రక్కను జాన్‌పూరు మౌల్వి. వీరిరువురి కలయికవలన గలిగిన మనస్సు తన సంకుచితాశయములఁ బారద్రోలి, విశాలాశయములతో స్నిగ్ధమై కాంతివంతమై సర్వవ్యాపించును తనదిగా భావించుననుటకు సంశయము నుండదు. పారసీక కావ్యములఁ బఠించిన హిందువుల సంఖ్య తగ్గిపోవు కాలదిని

మనోహర మగు నాగరతయు నద్భుతశ్రీ మగుచుండుట సంభ
వించును.

ప్రస్తుత కాశీ విశ్వవిద్యాలయము పశ్చిమ విద్యాపీఠ
ముల ననుకరించుచున్నది. పరిపంచమును వ్యామోహమునకు
లోనై యాపద్ధతులే యిందనుసరింపఁబడుచున్నవి. కాని, యీ
వ్యామోహమును నశింపఁజేయు పూర్వప్రజాశయముల కిం
క తావున్నదో లేదో మనమిందు చూడవలెను. ఎనుబదిల
క్షల ధనముతో నూతనముగా స్థాపింపఁబడిన యీకొ్రత్తవి
ద్యాపీఠమే కొంచెము యామోదమనో బడయవచ్చును గాని
ప్రజమైన కాశీవిశ్వవిద్యాలయ మిక్కను నాయాదేవాలయ
ముల ప్రక్కఁ గాపురముండు పండితుల యిండ్లలోఁ జూర్వ
మువలె వసించియే యున్నది. ఇప్పటికిని భరతవర్షము నన్ని
దిక్కులనుండియు బీదవిద్యార్థులు చేరి గ్రంథములను శా
స్త్రములనుఁ బఠించుచుందురు. నవద్వీపము తర్కమునకుఁ
బసిద్ధికెక్కినది గాని కాశీ వేదమునకును వేదాంతమునకును
బసిద్ధిగాంచినది ధర్మసూత్రము లెచ్చట కలిగినను కాశీపం
డితులు నిర్ణయముల నిప్పటికి నందఱు శిరసా వహించుచు
న్నారు. ఇచట నొకొక్కశాస్త్రమును బన్నెండేండ్లు ధ్యయ
నము చేసినగాని యెవ్వఁడును సంపూర్ణపండితుఁడు కానేర
డు. నవీనతారతమ్య (Comporation ) పద్ధతి నొక్కసంవత్స
రములో నట్టి పండ్రెండువిషయములఁగూర్చి చదివినను నిది

గ్రి భ్రష్ట విద్యలై యుండిపోయి, మిడిమిడిజ్ఞానమే యబ్బు
గాని నిబ్బరముగ శాస్త్రప్రపంచమున సంచరింపవీలు లేదు
కావుననే కాశీపండితులు నవనాగరకుల జ్ఞానముకంటె భి
ముగు జ్ఞానసంపదగలిగి యేవిషయము గూర్చియైనను గో
మీద పిల్లివాటముగా నుండక తన యభిప్రాయమును నిశ్చ
ముగా వెల్లడింపఁగలఁడు.

ఇట్టి యనర్గళ పాండిత్యమును సంపాదించు మా
మేమి? విద్యార్థు లెట్లు సంపాదించుచున్నారు? చదువు
నువారికి కావలసినవి చదువుకొనుచోట నుండుట కిల్లు, తిన
ట కన్నము, మంచివిద్య యింతకంటె కావలసిన దేదియు లేదు
ఇప్పటివిద్యార్థులు విద్య నెట్లు సంపాదించుచున్నారో కొ
తయాలోచింతము. పాశ్చాత్యులకెట్లో పాశ్చాత్య విద్యకు
డబ్బే ప్రధానము. దానిని సంపాదించుటకు ధనము సాధనము
దానికి ఫలము గూడ ధనమే. పల్లెటూరివారు తమపిల్లల
బి. యే. వఱకు చదువు చెప్పింపదలచిరను కొందము. వారి
దము పల్లెటూరిలో నుండుట కవకాశము లేదు. ఇంగ్లీ
కాలేజీయో యొక పట్టణమునకు చేరికొనవలెను. ఇచట
గ్రామములో వలె సులభముగ జీవనము చేయుట దుర్లభ
గ్రామములలో కంటె రెండింతలైనను నిచట వ్యయముకా
తీరదు. అందుచేత మొత్తము మీద ఒకొక్కని చదువున
నుమారు పదివేలయినను నెక్కుడుగా వెచ్చింప వలయు

ధనమే ముఖ్యమైన వారింత ధనమును వృద్ధికి చేసికొనిన యెడల
బి. యే. ప్యాసయినతరువాత నానాకష్టములుపడి దాస్యము
నకు లోనై సంపాదించిన దాని యంతకంటె స్వతంత్రుఁడై
హాయిగ సుఖింపఁగలఁడు. కాని యీధన వ్యామోహము
వలన నేమేమో ముచ్చ్మాదు పొడిచి వేయఁగలనని, రాగా
నాతనికి చేకూరిన గురువులును సాధనలోఁ ధమునకు లోఁబడి
పనిచేయు వారలే యగుచున్నారు. ఈపరీక్షప్యాసయిన వారి
విలువ యింత, యిన్ని గంటలు పనిచేయువారి కింతజీతము అని
నిర్ణయించగా నది చాలదోయని దేవులాడు వారేగాని ఈవ
పవిత్రవిధులను సంస్మరించు వాఁడొక్కఁడును గానరాఁడు.
అట్టియెడఁ గురు శిష్యభావము ననేక వికారములఁ బొందు
చుండుట సంభవించును. ఈమైహిక విద్య కింతకంటె మంచి
గురువులుగాని శిష్యులుగాని యెట్లు జతగూడుదురు ?

పూర్వపు విద్యాపీఠములం దిట్టి యవస్థలు లేవు. అచ్చట
పరాపేక్షతో గురువులు నేర్పుటయు శిష్యులు నేర్చుకొను
టయు లేదు. విద్యను సంపాదింప వలెనను నుద్దేశము శిష్యు
లకును సార్థవిద్య విచ్ఛిన్నముగాకుండ కొనసాగుచుండవలె
నను చింత గురువులకు నుండెను. ఆవిద్య నేర్చి ధనవంతుల
గుదమను నుద్దేశము శిష్యుల కెన్నఁడును లేదు. కేవల స
త్యాన్వేషణమే వారినిఁ బ్రేరేపించునది. లోకము, దేహము, మనస్సు,
ఆత్మ, పరమాత్మ, వీని పరస్పర సంబంధమును దెలిసికొను

యానత్యే చోదిత మార్గమున జీవన యాత్ర చేయుటకే వారి విద్య నభ్యసించుట. కావుననే వేయిమైళ్లయినను కాలి నడకను కాశి కేగి యొక సమర్థుఁడగు గురువు నాశ్రయించి యాతని శుశ్రూష చేయుచు నాతని మనస్సు కనిపెట్టుకొని తిరుగుచు, శిష్యులు గురువును సంతోషపెట్టి యాతని వలన విద్యఁబడయుచుండిరి. వారికచట నుండుటకు యిండ్ల కద్దెలు లేవు; గురువుగారియింట్లే యాతని వాసము. మేడలలో గాని యుండ మను దీక్ష వారికి లేదు. ఏకటిక నేలనో హాయిగ నిద్రపోవుచుండిరి. బూట్లు, సూట్లు నెక్టయిలు, వారి కక్కఱ లేకుండెను. క్రింద నొకగుడ్డయు, మీఁదనొక గుడ్డయు, మూఁడుగా మఱియొక వస్త్రమును, రాత్రిపూట కప్పికొనుటకు కప్పటియు, పఱచుకొను బొంతయుఁ దప్ప హెచ్చుగా దుస్తులాతని కవసరము లేకుండెను. అట్టి వస్త్రములఁ గట్టికొన్నందువలన వానికి విద్యరాకపోలేదు. విలాసములపై నాతనికి మనస్సు తిరుగకుండుటచే విద్యనుండి దృష్టి చెదరక యుండి యతి శీఘ్రముగ విద్య నబ్బుచుండెను. తిండికా? అతని కేమిలోటు? అందుకుఁ గాశిలో ?

గీ. శ్రీవిశాలాక్షి బంగారు తెడ్డువంపు
నమ్మతో పాయస మొసఁగు నభ్యాగతులకు
కాశికాపురి మధ్యాహ్న కాలమునను
[illegible] నెమ్ముఁగ [illegible]

అన్నపూర్ణమ్మ యతులు నగునట్లు స్వయముగా గంగ కట్టుగాని వర్షించుచుండగా కొదవయేమి? పంచక్రోశము నందున్న యున్నూటరువది యైదు సత్రములలోను దినమున కొకదానియందు భోజనము చేసినను కాలక్షేప మైపోవును. కొన్ని సత్రములు విద్యార్థుల కొఱకే ముఖ్యముగా నేర్పడి యుండును. ఈరీతిగా వసతికి గాని భోజనమునకుగాని యిబ్బంది పడక తల్లిదండ్రులు దగ్గర లేని లోపమును గురువుగారును నాతని కుటుంబమును దీర్చుచుండ విద్యార్థికి చదువు నుండి మనస్సును చెదరఁ జేయున దేది యుండును? ఇట్టి సహాయములు లోకమునఁ గాశి యందేగాక ప్రాచీన విద్యాపీఠములందెల్ల సర్వసాధారణముగా నుండుచు వచ్చెను. కావుననే యార్యవిద్య యంత స్థిరముగ భరత దేశమున నాటుకొని యున్నది.

భారతవర్షీయుల కెల్లఱకుఁ గాశీ యిట్టి విద్యాపీఠముగుట యేగాక భరత దేశమునకు మహాశ్మశాన మైయున్నది. ముసలితనముచే కాయము కృశించి నడుము వంగి కన్ను పొడుచుకొనుచుఁ గాశి నెప్పుడుఁ జేరుదునా, మణికర్ణిక నెప్పుడు దర్శింతునా, గంగయొద్దననే యీజీవముల విడుచుటకు విశ్వేశ్వరుఁడు నాకు బలము నిచ్చి వేగఁదోడ్కొనిపోవు గాక! యని యనుదినము వదినవడి వేడుచుఁ గాశి మొగమై పోవు యాత్రికు [illegible] పూర్వ

మొక్కవలసి యుండిరి. కాశీ క్షేత్రమున మరణించినవారికి పునర్జన్మము లేదు. వారికదే ముక్తి యను విశ్వాసము హిందువులయందా బాలగోపాలమునకును గుదురుకొని యున్నది. కాశీ కేగలేనివాఁడు కాశీ కాశీ, యని స్మరించినను, కాశీకేగనని యనుకొనినను ముక్తుఁడగునని యనేకులు విశ్వసించుచున్నారు. కాశీయాత్ర చేయలేనివారును, మృత్యువాసన్నమైయుండనట్టి యాత్రఁజేయుటకు వీలులేనివారును, నింత కాశీగంగనోటిలో వేసికొని మ్రింగినచో ముక్తులమగుదుమని నమ్ముచున్నారు. ఇచట మృతి నొందుట కాశపడుట కేవల మూఢ విశ్వాస జనితము కాదు. “జనులారా! దేవుఁడు తన సింహాసనము పైఁ గూర్చుండి తనకు సాష్టాంగ పడువారినే యనుగ్రహించు ననుట మాట తప్పు. దేవుఁడు మీకు వెలిగా లేఁడు, అతఁడు మీహృదయములందేయున్నాఁడు. అతఁడు సచ్చిదానందమూర్తి యనినమ్ముఁడి” యనుసుపదేశముఁ జేయు నీకాశికా పట్టణమున ప్రాణముల విడుచుట కంటె నదృష్ట మేముండును?

భిన్నభిన్న నాగరకతలు గల యాయారాష్ట్రముల వారి నొకచో నాకర్షించి భరతవర్షమున నేకజాతీయతఁ గల్పింపఁ జాలు ప్రదేశ మీవారణాశియే. గంగయొడ్డున బడిపోవుచు న్నక్కనున్న గృహముల కావణేయకతను జూచి వాని చరిత్ర మును తెలిసికొనుచున్నచో నియంతయు తేటపడును. ఇదిగో [illegible] దక్షిణాపేశ్వరు లెల్లరు నిచటికి వచ్చు

చుందురు. అదిగో అహల్యాభాయి రాణీఘట్టము. ఈసాధ్వి, యీమహారాజ్ఞి కట్టించిన దేవాలయములు, వేయించిన బాటలు, త్రవ్వించిన చెఱువులు, నిప్పటికిని నాయమ్మ తన రాజ్యప్రజలకేగాక యెల్లర సౌఖ్యము కొఱకు నెట్లు పాటు పడియుండెనో వేనోళ్ళ చాటుచున్నది. అల్లదే శంకరాచార్యులవారి మఠము. ఆయాచార్యశేఖరుఁడు తొమ్మిదవ శతాబ్దమున నెట్టి కట్టుదిట్టములతో నీమఠమును స్థాపించెనో యంతకట్టుదిట్టముగ నేఁటికిని జరుగుచున్నది. ఆచారవిషయమున దీనికి పెట్టినది పేరు. అక్కఁబకునదే నాగపురపుభోన్సలా మహారాష్ట్రులప్రభ హెచ్చుగానున్న సమయమునఁ గాశితో సంబంధముఁ గలుగఁ జేసికొనుటకుఁ గట్టించిన కోట. దానికి కొలఁదిదూరములోనె గ్వాలియరు, నేపాలదేశరాజుల ప్రాసాద మార్గములు. ఈపట్టణము శివునిదైనను నిచట వేణీమాధవుఁడును నెలకొనియున్నాఁడు. అక్బరుకాలమున కట్టఁబడిన మనోహర మగు మానమందిరము మహమ్మదీయులు శాస్త్రములఁ బోషించిన విధమును వెల్లడిజేయుచున్నది. ఔరంగజేబు మశీదు ముసలమానుల మతవిశ్వాసములకు బదులు కట్టుచున్నవి.

ఇట్లు గంగయొడ్డునకే యనపేల! పురములోని కేగి దాని నంతటిని చూచినను హిందూదేశమున నేకజాతీయత యెట్లేర్పడుచున్నదో తేటపడఁగలదు. విశ్వేశ్వరాలయము

కప్పాను బంగారముతోఁ బలిపించి రణజిత్సింగు కాశీకిని అమృతసరమునకును నిత్యసంబంధము నేర్పఱిచెను. బంగాళా జమీందారులు, పంజాబు సర్దారులు, రాజపుత్రస్థాన పు సామంతులు, వీరు వారననేల, యెల్లరును నొకరితో నొకరు మత్సరించిరో యనునట్లు పంచక్రోశమధ్యమున దేవాలయములతోడను, మఠములతోడను, సత్రములతోడను నింపివేసిరి.

పారిశ్రామిక విషయములఁ జూచినను నీయేకజాతీయత కాశియందే స్పష్టముగఁ దేటపడఁ గలదు. బజారులోనికి పోయినయెడల నానాభాగములనుండి వచ్చిన వస్తువులు కండ్లకుఁ గనఁబడుచునే యుండును. చెన్నరాజధాని, దక్కనులనుండి వచ్చిన యుల్లిపొరలవంటి చీరెలు, పంజాబునుండి వచ్చిన కట్టుసామానులు, నాసిక, తిరుచనాపల్లి సీసాలు, ప్రాంతములనుండి వచ్చిన యిత్తడిసామగ్రి, గయ, జబ్బల్పూరు, ఆగ్రాలనుండి వచ్చిన రాతిచిప్పలు, నర్మదానదిలోనుండి వచ్చిన లింగములు, గండకినుండియు నేపాలమునుండియు వచ్చిన సాలగ్రామములు, నివియవి యననేల! భరతదేశమున నెక్కడ నే యేవస్తువు దొరకినను నిచ్చటను నది దొరకియే తీరును. ఏదేశము వారి భోజనము గావలసినను నిచటలభించును. ఏజనుల భాషయైనను నిచట వినఁబడుచునే యుండును.

మఱియు, ఆచారముల విషయమై నిర్ణయింపవలసిన చోఁ గాశీపండితులతోడఁ దెలుపవలయును. వారినిర్ణయములపై

మఱి నిర్ణయము లేదు. ఇచట బ్రాహ్మణు లాపోశనము నెత్తిరని తంతివార్త వచ్చినగాని గ్వాలియరు రాజకుటుంబము వారు భోజనము చేయరు. పూర్వకాలపు శిల్పవిద్యలు మఱి యెక్కడ నశించిపోయినను నిచ్చటమాత్రము శేషించియే యుండును. వేయేల, భరతవర్షము భరతవర్షముగా నున్నంత కాలము నన్ని బాటలు, నన్ని మతములు, నన్ని కాలములు, నన్ని చరిత్రములును తప్పక కాశీపురమునే కేంద్రస్థానముగా చూపుచుండును.

గీ॥ ఎన్నికల్పంబు లరిగిన నెడలిపోవ
దెందఱింద్రులు గడచిన నెలమిదప్ప
దెన్నిమన్వంతరంబులు చన్న నెపుడుఁ
బసిమిఁ దప్పదు కాశికాపట్టణంబు.

సీ॥ ఉర్వీధరశ్రేణు లుఱ్ఱూత లూఁగంగ
నేదు గాడ్పులు వీచు నెన్నఁడేని
చండభానుండు పంద్రెండు మూర్తులు దాల్చి
యెసఁగి యెండలు గాయు నెన్నఁడేని
పుష్కలావర్తకాంభోధర వ్రాతంబు
లెలగోలు వర్షించు నెన్నఁడేని
భూభువస్స్వర్లోకములు ముంచి జలరాశు
లేకోదకము గాఁపు నెన్నఁడేని

## ప్రాచీనవిద్యాపీఠములు.

యెన్నఁడేనుండు కాలంబు మిన్నచిక్కు-
భూతములు గ్రాలు నెన్నఁడే బుట్టినిండ్ల
నపుడు వారాణశీ క్షేత్ర మైదుక్రోసు
లంతమేర యుపద్రవం బందకుండు.



శ్రీరస్తు.

# ప్రాచీన విద్యాపీఠములు.

## నాలందా

హిందూదేశమున ప్రాచీన విద్యాపీఠములందెల్ల నగ్రగణ్యతఁ గాంచి యీదేశస్థులనే గాక యాశియా ఖండములోని యన్ని ప్రదేశముల నుండియు విద్యార్థులను విద్యాధురీణులను నాకర్షించుకొని మిక్కిలి ప్రఖ్యాతి గాంచిన విశ్వవిద్యాలయము నాలందాయందుండెను. ఇది యుండిన స్థలము ప్రస్తుత బిహారు రాష్ట్రములోని రాజగృహమునకు నేడు మైళ్ల దూరములో నున్న 'బారగాన్' అయినట్లు చారిత్రక పరిశోధనలవలనఁ దెలియవచ్చుచున్నది. ఇది యేకాలమున విద్యాస్థానముగా నారంభమయ్యెనో మనకు తెలియదు. కాని బౌద్ధమతోద్ధరణమునకై యిచట జరిగిన ప్రయత్నములఁ బట్టి చూడ బుద్ధుని కాలమునకు తరువాతనే యిది స్థాపింపఁబడినట్లూహింపవచ్చును. అంతకుపూర్వము కూడ నిది బ్రాహ్మణ మతబోధకు నిలయమై యుండియుండెనేమో. విద్యాస్వీకరణమునకు కొన్నికొన్ని ప్రదేశము లనుకూలములై యుండుటయు మఱికొన్ని యట్లుండకుండుటయు మనకు తెలియును.

నాలందా పెద్దవిద్యాపీఠమై పదలకొలది సంవత్సరము
లుండియుండుటకు వలయు పరిస్థితులు బౌద్ధమత స్థాపనము
నకు పూర్వము నుండియు నచట నుండెను. పూర్వ మచట
బ్రాహ్మణ మతము బోధింపఁబడి యుండియు నానాటికి బౌ
ద్ధమత మభివృద్ధి నొందుచు రాఁగా బౌద్ధ భిక్షువు లీప్రదేశ
మునఁ జేరి తమమత సంబంధములగు విద్యల ప్రచారము
చేయుచు వచ్చిరి.

అంతకు పూర్వ మెట్లున్నను నించుమించు క్రీ॥ శ॥
౩౦౧ సం॥రమున నాగార్జునుఁడును క్రీ॥ శ॥ 3.౨౦ సం॥ర
మున నార్యదేవుఁడను వాఁడును, నీవిద్యానిలయము నుపోషిం
ప నమకట్టిరని చారిత్రికాంశముల వలన తెలియుచున్న
ది. చీనాదేశ యాత్రికుఁడగు ఫాహియాను మనదేశమునకు
వచ్చి పాటలీపుత్రము, తామ్రలిప్తి, మొదలగు విద్యాపీఠము
లందు చిరకాల మొసర్చి, తనకు నాలందాకు కూడ వచ్చి
యుండెను. తక్కిన స్థలముల యందలి విద్యాపరిస్థితుల నా
తఁడు విపులముగా గ్రంథస్థములఁ జేసినను నేలకో యాత
డీ నాలందానుగూర్చి యంతగా వ్రాయఁడయ్యెను. దీని
జూచి కొందఱాతఁడచటికి వచ్చునప్పటికది విద్యాలయముగా
నుండి యుండలేదేమో యని సందేహించిరి. కాని యట్టి
సందేహమున కవకాశము గానరాదు. నాల్గవ శతాబ్దాభి
వృద్ధిలోనుండి ఈట్సింగు క్రీ॥ శ॥ ౬23 సం॥రమునుండి ౬౭
పర్యంతము వరకును నీదేశమున నున్న కాలములో నత్యు

ళశలో నుండిన యీవిద్యాలయ మీమధ్య కాలమున వచ్చిన ఫాహియాను కాలములో క్షీణించి యుండెనని చెప్పుటకు గాని యచట నొకటే విద్యావిధాన మనుసరింపఁబడలేదని చెప్పుటకు గాని తగిన కారణములుఁ గానరావు. ఈమధ్య కాలమున బౌద్ధమత మాప్రాంతములయం దభివృద్ధి నొందుచునే వచ్చెను గాని క్షీణించు చుండలేదు. ఒకవేళ ఫాహియాను తామ్రలిప్తి మొదలగు స్థలములయందు తాను నేర్చికొని సేకరించిన విషయములకంటె నిచట విశేషముగా సంగ్రహించుట కేమియు లేనందున దానిని గూర్చి యంతగా వ్రాయలేదని మన మూహించుట కవకాశమున్నది.

రాజావలంబనము లేని విద్యాలయము లభివృద్ధి నొందుట కవకాశము లేదు. గురువులును, శిష్యులును భైక్షవృత్తి నవలంబించి యెంతో కాలము తమ విద్యను కొనసాగించుకొనుట కవకాశముండదు. విద్యాస్థానములకు స్థిరవసతు లేర్పడినచో నావిద్యాలయము లుచ్ఛదశకు వచ్చుట కనువుపడియుండును. కావుననే నాగార్జునార్యదేవుల [illegible]డియు గొంతకాల ముపేక్ష నొందిన నాలందా విశ్వవిద్యాలయము ఫాహియాను కాలమున నంత ప్రసిద్ధి నొంది యుండక పోవుటకుఁ గారణమై యుండును. అంతమాత్రమున నచట విద్య సాగుచుండుట లేదని తలంపఁగూడదు. ఎట్లయినను క్రీ॥ శ॥ ౪౫౦ సం॥ రమున నీవిద్యాపీఠము మగధరాజుబాల

రమునకుఁ బాత్రమయి నాటి నుండియు క్రమ క్రమాభివృ
నొందుచు వచ్చెను.

ఏడవ శతాబ్దమున నాలందా విశ్వవిద్యాలయము మత్యు
చ్చ దశయందుండెనని హూనుత్సాంగు, ఈట్సింగుల వ్రాతల
బట్టి తెలిసికొన వచ్చును. క్రీ॥ శ॥ ౭౫౦ సం॥రం ప్రాం
మున కామశీలుఁడను నాతఁడిచట తంత్రశాస్త్రమును శిష్యు
లకు బోధించు చుండి యుండుటచే నెనిమిదవ శతాబ్ద మధ్య
మున గూడ దీని యౌన్నత్యము తగ్గియుండలేదని యే చెప్పవ
యును. క్రీ॥ శ॥ ౮౦౦ సం॥ రములవఱకును స్థాపనమునొం
యుండని విక్రమశిలా విద్యాలయమునుండి నాలందాకును, ని
టినుండి యచటికిని రాకపోకలు జరుగుచుండెనని చరిత్రము
వలన తెలియుటచే నిశ్చయించుగా పదియవ శతాబ్ద
వఱకు నాలందాయందు విశ్వవిద్యాలయము నడచినదియే మ
మనుకొనవచ్చును. హూనుత్సాంగు తానచటికి రాకపూర్వ
మేడు శతాబ్దముల నుండియు నచట విశ్వవిద్యాలయ ముం
ననియు వరుసగా దానిని శకాదిత్య, బుద్ధగుప్త, తథాగ
గుప్త, బాలాదిత్యులను రాజులు భక్తిపరులై యచ
విహారము నభివృద్ధియొనర్చుటకు బూనుకొనిరనియుఁ జెప్పి
యున్నాఁడు.

టిబెట్టు దేశపు గ్రంథములనుఁ బట్టి నాలందా యుండి
స్థలమునకు మగధ దేశమునం దెల్లెడల ధర్మగంజ యను
వ్యవహారనామముండెడిదనియు, నందు రత్నసాగరము,

ద్నదధి, రత్నరంజకము, నను మూడున్నత హార్మ్యములుం డి వనియు, వీనియందే యప్రతిమానమగు పుస్తక భాం రము నెలకొని యుండెననియుఁ దెలియ వచ్చుచున్నది. ర్మగంజ యనగా ధర్మము కావలసిన వారు దానిని స్వీక చుటకు సిద్ధముగా నుంచిన చోటని యర్థము. రత్నోదధి ను హార్మ్యము తొమ్మిది యంతస్థుల గృహము. ఇందు జ్ఞా పారమితా సూత్రములను, దివ్యగ్రంథములును, స జ గుహ్యాది తాంత్రిక గ్రంథములు నుండెను.

హానుత్సాంగు శిష్యులగు హ్వూలీ, యన్‌చుంగ్ నువారు తమగురువు ప్రయాణమును గూర్చి వ్రాసిన ంథములలోని యీక్రింది వృత్తాంతము వలన నీపశ్వవిద్యా యమందలి విద్యావిధానము గూర్చియు, నచటి యాచార ల గూర్చియు, స్థలరామణీయకతం గూర్చియు, మనము ంత తెలిసికొనవచ్చును. వారిట్లు వ్రాసియున్నారు.

"మాగురువుగారు బోధివృక్షమును దర్శించిన పది వ దినముం నాలందా యాలయమున కేగిరి. అచటి వార నెదురుకొని యారామములోనికిఁ దోడ్కొనివచ్చుటకు ప్రవిద్వాంసులను నలుగురను బంపిరి. వారితోఁగూడ నేడు జనములు ప్రయాణముచేసి యాలయ ప్రాంతమందలి క్షేత్రములఁజొచ్చిరి. ఈక్షేత్రములున్న గ్రామమందే వ హాత్ముఁడగు మౌద్గలాయనుఁడు జనన మొందెను. ట నాతఁడుపహారముల స్వీకరించి [illegible]

కలసి వచ్చుచున్న రెండువందల మంది మతప్రచారకులును వేయిమంది ధర్మసంరక్షకులును స్తోత్రపాఠములు జేయుచు ఛత్రచామర ధ్వజములం బట్టుకొని, పుష్పములను, సుగంధ ద్రవ్యములను, వెదజల్లుచుండ, నాలందాను ప్రవేశించెను.

ఆతఁడచటికిఁ జేరఁగనే యారామవాసు లందఱును వచ్చి యాతని కభివాదనము లొనర్చిరి. స్థవిరుని (సంఘాధ్యక్షుని) ప్రక్కనే యాతనికిని నాసనము వైచి యాతఁడు కూర్చుండినపిదపఁ దాము నాసీనులైరి.

పిదప కర్మదానుఁడు (అచటి వారు తాము తాము చేయవలసిన పనులను నియోజించువాఁడు) ఘంటానాదము చేసి, ఈధర్మోపాధ్యాయుఁ డారామమునందు వసించియుండు నంత కాలమును శ్రమణు లుపయోగించు సర్వద్రవ్యములును, మతధర్మానుసరణమునకుఁ గావలసిన సర్వోపకరణములును తక్కిన వారితోఁ బాటు ఆతఁడును, నుపయోగింప వచ్చును అని చాటెను.

తరువాత మధ్యవయస్కులును, స్ఫురమాత్రులును, మతగ్రంథములకు వ్యాఖ్యానముఁ జేయ సమర్థులును, నగు ఇరువదిమంది యాతనిని ధర్మనిధి యగు నుపాధ్యాయుని యొద్దకుఁ దోడ్కొనిపో నుద్యుక్తులైరి. ఈతఁడే శీలభద్రుఁడు. తమయుపాధ్యాయుని పేరితోఁ బిలుచుట యపచారమని యెం చుటచే వారాతనిని 'ధర్మనిధి' యనునామమునను వ్యవహ [illegible]

అంత వారందఱును గలసి యామహాభాగుని దర్శన ము న కేగిరి. అతనిం జూచినంతనే భిక్షుదానాధ్యక్షుండమిత ములగు నుపాయనముల నాతనిముందుంచి భూతలానత శీర్షుడై మోకాళ్ళపై నాతనిపాదముల ముద్దిడుకొని, వివిధమర్యాదల నడపెను. ఇట్లర్ఘ్యోపచారములైనపిదప శీలభద్రుం డాసనములం దెప్పించి యథోచిత స్థానముల నందఱిని గూర్చుండ నియమించి మాగురువుగారి దేశమునుగూర్చి యడుగగా తాను చీనాదేశమునుండి వచ్చితిననియు, నాతనినుండి యోగశాస్త్రము నభ్యసింప నభిలషించుచున్నాననియు నాతఁడు త్తర మిచ్చెను.

ఇదివిని యాతఁడగు 'పూర్ణ కేతు'ఁడై సర్వసూత్రములను, శాస్త్రములను నేర్చి వాదప్రతివాదములందు ప్రతిభ గడించి డెబ్బదియేండ్లకు మించిన వయసుగల తనమేనల్లుఁడగు బుద్ధభద్రునివంక మొగమై, "ఇచటివారికిం దెలియుటకై మూడు సంవత్సరముల క్రిందట నాకుంగలిగిన రోగముగూర్చియు, నేననుభవించిన బాధగూర్చియుం జెప్పుము;" అన నాతఁ డు నిట్టూర్పులు విడుచుచు కంట తడి పెట్టుకొని యిట్లు చెప్పఁ దొడఁగెను.

కొంతకాలము క్రిందట మాయుపాధ్యాయునకు వాతరోగము వచ్చెను. అది కనఁబడినంతనే కాళ్లు, చేతులయందు పట్లారంభించి నిప్పులతో కాల్చినట్లును, కత్తులతో పొడిచినట్లును నై బాధ కోర్వలేక యాతఁ డేడ్చుచుండెను [illegible]

గనెంత మహాత్ముగా వచ్చుచుండెనో యంత శీఘ్రముగ పోవుచుండెడిది. ఇట్లాతఁ డిరువది సంవత్సరములకుపైగా బాధపడెను. మూఁడు సంవత్సరముల క్రిందట నాబాధ భరింప శక్యము గాక యుండుటచే జీవనముపై రోతపుట్టి యుపవాసములచే నాతఁడు దేహత్యాగముఁ జేసికొన సిద్ధపడెను. అప్పుడర్ధరాత్రి మందాతని కొక స్వప్నము వచ్చెను. అందు స్వర్ణవర్ణము తోడను, స్ఫటికవర్ణముతోడను, రజతవర్ణము తోడను ముప్వురు దేవతలాతనికి కనఁబడిరి. వా రాజానుబాహులును, తేజోవిరాజమాన దీర్ఘకాయులును, శుభ్రవస్త్రధారులు నై యుండిరి. వా రుపాధ్యాయుని సమీపించి "ఏమీ! నీవీదేహమునుండి విముక్తి నొంద నెంచుచున్నావా? బాధల ననుభవించుటకే యీదేహము నిర్మితమైనదనియు దానిని రోసి విడిచిపెట్టఁగూడదనియు, ధర్మగ్రంథము లుద్ఘోషించుచున్నవి. నీవు నీపూర్వజన్మమున నొక దేశమునకు రాజవై యుంటివి. అప్పుడు జీవజంతువులకు హెచ్చుగ బాధఁ గలిగించితివి. దానికి ఫలముగా నీవిప్పుడీ బాధల ననుభవించుచున్నావు. కావున నీపూర్వాపరాధములను బరీక్షించికొని మనస్ఫూర్తిగ పశ్చాత్తాపము నొందుము. ఈబాధను ధైర్యముతో సహించియుండుము. సూత్రములను, శాస్త్రములను బోధించుటయందు నిత్యతత్పరుఁడవై యుండుము. నీబాధ తొలగుటకిదియె మార్గము. నీదేహము ననహ్యించుకొనినచో, బాధ హెచ్చునేకాని తగ్గదు సుమీ" యని పలికిరి.

పాధ్యాయు డా మాటలను విని భక్తి నమ్రుడై వారికి నమ స్కరించెను. అపుడు స్వర్ణవర్ణ దేవత స్ఫటికవర్ణ దేహునిం జూపి "ఈతఁ డవలోకితేశ్వర బోధిసత్త్వుఁడని నీకు తెలియునా తెలియదా? యని యడిగి రజతవర్ణుంజూపి, యీతఁడే మై త్రేయ బోధిసత్త్వుఁడు సుమీ" యని చెప్పెను.

వెంటనే యుపాధ్యాయుఁడు మైత్రేయునికి పూజ-జ సల్పి "మీ సేవకుఁడగు శీలభద్రుఁడు నీవిశాల వార్షిక్యములం దు జననము నొందఁగోరుచున్నాఁడు. ఆకోరిక నెఱవేరునో లేదో తెలియదన నాతఁడు నీవు విస్తారముగా ధర్మవ్యాపనము జేసినచో నచట జననము నొందఁగలవనెను.

అపుడు స్వర్ణవర్ణ కాయుఁడు "మంజుశ్రీ బోధిసత్త్వుఁడను నేనే. నీ శ్రేయస్సునకు వ్యతిరిక్తముగా నీవు దేహత్యాగము జేయ నెంచుటఁ దెలిసికొని యట్టి యుద్యమమునుండి నిన్ను మఱల్ప మేము వచ్చియున్నాము. నీవు మామాటలను విశ్వ సించి, సత్యమగు ధర్మమును, యోగశాస్త్రముల జ్ఞానమును లోకమున విస్తరింపఁ జేయవలయును. అట్లు చేయుచుండినఁ గాలక్రమమున నీరోగము తగ్గిపోయి బాధ నివారింపఁబడును. చీనాదేశస్థుఁ డొకఁ డిచటికివచ్చి నీతోఁగూడ నధ్యయనము జేయ నభిలషించును. ఆతనికి మనుపక జాగ్రత్తగ నాతనికి బోధఁజేయుము. అనగా ధర్మవిధి యట్లే గావించెదనని నెను. వారలును నంతర్ధానము నొందిరి. "అప్పటినుండియు నా

పాధ్యాయుని బాధలంతరించినవి.” అని బుద్ధభద్రుఁడు పలికిన వాక్యముల విని యచట నున్న వారందఱును నాశ్చర్యరసనిమగ్నులైరి.

మాగురువుగారును నీమాటలను విని తమ హర్షాశ్చర్యముల గణచి యుంచలేకపోయి తిరిగి ధర్మనిధికి ప్రణామము లాచరించి, “అయిన నిప్పుడు నేను ధర్మబోధన శ్రద్ధతో విన సిద్ధముగ నున్నాఁడను. తాము దయాపూర్వకముగ నాకు బోధ చేయ ననుగ్రహింతురు గాక” యనువిడిరి.

అంతధర్మనిధి యడుగగా గురువుగారు తాను మూఁడు సంవత్సరములు ప్రయాణము చేసి యచటికి వచ్చితినని చెప్ప నాతఁడు తన స్వప్నమునందు విధిన దానికిని దీనికి సరిపోవుటఁ జూచి యాతనిఁ దనశిష్యునిగా స్వీకరించెను.

అప్పుడు గురువుగారు బాలాదిత్య రాజశాలాశాల కే యుండు నాల్గంతస్థుల మేడయందు బుద్ధభద్రుని గృహమందు వాసము చేసి యేఁబదినము లాతనిచే యథోచిత సత్కారములు బడసి, పిదప ధర్మపాలబోధిసత్త్వుని వానగృహమున కుత్తరముగా నొక యింటిలో వసించెను. అచట నాతనికి సర్వోపచారములును జరుగుచుండెను. ప్రతిదినమును ౧౨౦ జంబీరఫలములు ౨౦, పోక చెక్కలు, ౨౦ జాజికాయలును, కొంత కర్పూరమును, కుంచెడు మహాశాలి తండులములును, నిచ్చుచుండిరి. ఈబియ్యము చిక్కుడు గింజలకంటె పెద్దవై యుండు

బెట్టినచో సువాసనఁ గలిగి నిగనిగ మెఱయుచుండును. ఏ బియ్యమును నీనితో సాటిరావు. ఈధాన్యము మగధదేశ మందేగాని మఱెచ్చటను పండవు. ఇవి రాజులును మహాత్ములును మాత్రమే యుపయోగింతురు. కావుననే వీనికి మహాశాలి యనునామము వచ్చినది.

మాగురువుగారికి నెలకు మూఁడుసేర్లనూనె, ప్రతిదినమును కావలసినంత వెన్న మొదలగు పదార్థములను నిచ్చుచుండిరి.

ఒకయుపాసకుఁడును నొకబ్రాహ్మణుఁడును, తమతమ కర్మలను విడిచి యాతనివెంట నెప్పుడును నొకయేనుఁగుతో కావలి యుండుటకు వచ్చిరి.

నాలందా మఠములో మఠాధికారి యీరీతిగా వేలకొలఁది మతగురువులను ప్రతిదినము సత్కరించుచుండును. మాగురువుగారు గాక నానాదేశాగతులగు యాత్రికులచటికిఁ జేరియుండిరి. తమయాత్రిలలో నెచ్చటను నిట్టిసత్కారము వారికిఁ గలిగి యుండఁబోదు.

నాలందామఠమును ధర్మగంజా మఠమును నొకటే. దీనింగూర్చి యొకగాథ గలదు. మఠమునకు దక్షిణముగా నుండిన యామ్రవనమున నొకమడువు గలదు. ఇందు నాలంద యను నొక నాగుడు వసించియుండును. ఆమడుఁగుప్రక్క నిర్మిత మగుటచే నీమఠమునకు నాలందా యను నామము

కలిగెను. తథాగతుఁడు బోధిసత్త్వుఁడుగా నున్నపు డొకగొప్ప దేశమునకుఁ జక్రవర్తియై యీస్థలమున తన రాజధానిఁ గట్టుకొనెనని యొకకథను చెప్పికొందురు. అనాథుల యెడలను దరిద్రులయెడలను, నాతఁడు కరుణారస పూర్ణహృదయుఁడై తనసర్వస్వమును వారికై వినియోగించెనట. అందుచేతనే దీనికి 'ధర్మగంజ' అనగా నెడతెగక ధర్మకార్యములు సలుపు ప్రదేశమను నామము వచ్చినదఁట.

ఈస్థలము మొదట సమరశ్రేష్ఠి యుద్యానవనము ౫౦౦ మంది వర్తకులు పదిలక్షల బంగారు నాణెముల నిచ్చి యీస్థలమును కొని బుద్ధుని కుపాయనముగా నొసంగిరి. ఇచ్చట బుద్ధుఁడు మూఁడుమాసములు ధర్మబోధ నొనర్పుటచే నావర్తకులలో చాలమంది యర్హతావస్థఁ బొందిరి.

బుద్ధుని నిర్వాణానంతర మాదేశపు రాజగు శక్రాదిత్యుఁ డాతనియెడ భక్తిచే నీమఠముఁ గట్టించెను. అతని యనంతర మాతని కుమారుఁడగు బుద్ధగుప్తుఁడు దీనిని వృద్ధిఁ జేయుచు దక్షిణపుదిక్కుగా మఱియొక సంఘారామమును స్థాపించెను. అతని తర్వాత నాతని కొడుకగు తథాగతరాజు తూర్పుగా మఱియొక సంఘారామమును స్థాపించెను. అతని తర్వాతి రాజగు బాలాదిత్యుఁ డీశాన్యదిశ నొక సంఘారామని ర్మాణముఁ గావించి చీనాదేశమునుండి కొందఱు మతధర్మములఁ దెలిసికొనుట కేతెంచిరని విని సంతోషపరిపూర్ణ

హృదయుఁడై సర్వమును వదలి శ్రమణకుఁడయ్యెను. అతని కొడుకగు వజ్రుఁడుత్తరదిక్కుగా మఱియొక సంఘారామము గట్టించెను. తరువాత మధ్యదేశమునకు రాజగు నొకఁడు దీని ప్రక్కనే మఱియొక సంఘారామమును స్థాపించెను. ఈరీతిని వరుసగా నార్గురు రాజులు తొల్లింటి మఠమును వృద్ధిచేయుచు వచ్చిరి.

ఈభవనముల చుట్టును నున్నత ప్రాకారమున్నది. ఈ ప్రాకారములోని యొక ద్వారముగుండా మహాకళాశాలలోనికిఁ బోనవీలగును. ఈకళాశాల సంఘారామ మధ్యముగానున్న యెనిమిది మండపములలో వేఱుపడి యున్నది. మిక్కిలిగా నలంకృతములైన దేవిడీలున్ను గిరిశృంగములవలె నింగిని ముట్టు బురుజులున్న నొకటొకటి గుమిగూడియున్నవి. నక్షత్రశాలలు ప్రాతర్హిమమునందు లీనమై యుండ, పైయంతస్తులు మేఘమండలమును దాటిపోయి యుండును.

అచటి వాతాయనముల నుండి చూచినచో గాలియు మేఘములును, గలసి చిత్రవిచిత్ర రూపముల నొందుచుండుట కనుపడును. అత్యున్నతముగ నున్న గుంటికస్తంభ యొద్ద సూర్యచంద్రుల కలయిక స్పష్టముగఁ గానవచ్చును. ఆరామములలోని సరోవరములు గంభీరములై నీలపుద్రుమభ్రాంతి గనుపఱచుచుండ నాజలములపై నీలసరోజములున్ను రక్తకనక పుష్పములును, నొండొంటఁ గలసి తాండవమాడుచుండ, వాటి

యున్నిటిపై నప్పుడప్పు డామ్రతరువులు తమ ఛాయలఁ బఱపు చుండును.

పై యావరణము నందున్న యర్చకుల గృహములన్నియు నాల్గంతస్థులు కలిగి సర్పాకారములుగల ముందుభాగములును, రంగులచే చిత్రింపఁబడిన చూరులును, నెత్తిని ముత్తియముల కాంతిని విడంబించుచు తీర్చియలంకరింపఁబడిన స్తంభములును హేమ్చగా నలంకరింపఁబడిన బురుజులును, వెలుతురునుండి వేయివిధములగు కాంతులుప్పతిల్లఁజేయుచు, నిగనిగలాడుచు నింద్రధనుస్సుపై నుండు పెంకులును, నా రంగమునకు వింతహొయంగులఁ గల్పించుచుండును. హిందూదేశమున వేలకువేలు సంఘారామములున్నను, వైభాగ్యమున గాని యాధిక్యమునగాని దీనిని బోలినది యొకటి లేదు. మఠములోని శ్రమణులును, నతిథులును, నందఱును కలసి యెన్నఁడును పదివేలమందికి తక్కువగ నుండరు. అందఱును మహాయానగ్రంథములను, బౌద్ధమతాంతర్గతములగు పదునెనిమిది భాగములకు సంబంధించిన గ్రంథములనే గాక, వేదాది గ్రంథములు, హేతువిద్య, శబ్దవిద్య, చికిత్సావిద్య, అథర్వవేదము, సాంఖ్యతత్త్వమును, బఠించుచు నితర గ్రంథములు గూడ బరీక్షించుచుందురు. ఇరువది విధములుగ సూత్రములను, శాస్త్రములను, వ్యాఖ్యానము చేయఁగల వేయి మందియు, ముప్పది విధములగు శాస్త్రముల బోధింపఁగ

౫౧౦ మందియు, వేదశాస్త్రముల కర్థము చేయఁగల వారు, మాగురువుగారితోఁ గలసి పదిమందియు, నిచటనున్నారు. ఈ శాస్త్రముల నన్నిటిని బోధసేయఁగలవాఁడు ధర్మనిధి యగు శీలభద్రుఁడొక్కఁడే. తనసుగుణసంపత్తి చేతను వయోవిశేషము చేతను నాతఁడు మఠమునందు ముఖ్యత్వము వహించియుండును. ఆలయములో నూరుబల్లలపై నూరుగురధ్యాపకులు నిలుచుండి యుపన్యాసములను ప్రతిదినము నొసంగుచుందురు. శిష్యులొక నిమిషమైనను వేళయతిక్రమింపకుండ నాయుపన్యాససమయములందు వచ్చి కూర్చుండి సావధానచిత్తులై వినుచుందురు.

ఇచట మతపరిచారకులు స్వభావసిద్ధముగా మన్ననలఁ బడయఁగల రూపములును గుణములును గలిగియుండుటచే, నారామస్థాపనమునుండి నేటి కేడువందల సంవత్సరములలోను నొక్కసారియైనను శిష్యులు తిరుగుబాటు చేసియుండలేదు.

ఆ దేశపు రాజచక్రవర్తులును సబహుమానముగాఁ గౌరవించి మఠమునకు నూరుగ్రామముల రాఁబడి నిచ్చుచుండుటయు, అచటిగృహస్థులలో రెండువందలమంది కొన్నివందల కుంచముల బియ్యమును, కొన్నివందల చట్టులతో పాలను, వెన్నను, దినదినమును మఠమున కిచ్చుచుందురు. ఇచట చదువుకొనువారు తమకు కావలసిన యన్నవస్త్రములకును, శయ్యలకును మందులకును, నేయిబ్బందియు లేక యుండుటచే, వారివిద్యా

నిర్విఘ్నముగ కొనసాగుటకును, వారువారు తమశాస్త్రములవారి తేరియుండుటకును, ననువుపడియుండును.”

హూయాన్ త్సాంగు నాలందా యందున్న కాలమం దచటఁ గొన్ని వేలమంది యుపాధ్యాయులు తమతమ శాస్త్రములం దతిసమర్థులగువా రుండిరి. వారిలో ననేకుల యశస్సతిదూరదేశములందును వ్యాపించియుండెను. వారందఱును నిర్మలచారిత్రులును, పవిత్రశీలురునై ధర్మమార్గమును దప్పకయుండిరి. మఠమునందు సంచరింపవలసిన విధు లతి కఠినములై యందఱును నిర్బంధముగ ననుసరింపవలసినవై యుండెను. భరతవర్షమునందలి యన్ని ప్రదేశముల వారును నీయాచార్యులను గౌరవించి వారినడవడి ననుసరించుచుండురు. అచట జరుగు నతిముఖ్య ప్రసంగములకు దినమంతయు వినుచుండినను కాలము చాలదు. ఉదయము మొదల స్తమయము వఱకును వాదోపవాదములు జరుగుచునే యుండును. వృద్ధులును, యౌవనులును పరస్పరము నచట సహాయము చేసికొనుచుందురు. త్రిపిటకములందలి విషయములకు వ్యాఖ్యానము చేయలేనివారి కిచట నెట్టి గౌరవమును లేదు. వారు సిగ్గుపడి దాగియుండవలయునే గాని వేఱుగతి లేదు. అందుచే వాదమునందు ప్రఖ్యాతిఁ గడింపనెంచు విద్యార్థులనేకులు నానా నగరములనుండియు నిచటికి వచ్చి తమవిజ్ఞాన ప్రవాహముల దేశదేశములందును బ్రవహింపఁజేయుదురు. అట్టివారి

నాలందావిద్యార్థులు మనపేరితో నిచటికేగినను మర్యా
దలఁ బడయుచుండిరి. ఇతర దేశస్థు లీమఠములోని కేగి వా
దమునందు పాల్గొన నెంచినచో తొలుత ద్వారపాలకుఁడిచ్చు
కొన్ని ప్రశ్నములకు సదుత్తరముల నొసంగవలయును. ఉత్త
రముల నీయలేక చాలమంది తిరిగిపోవుచుండిరి. మఠము
లోనికి ప్రవేశము దొరకుటకు మిత్రము ప్రాచీనాధునిక గ్రంథ
ముల నన్నిటిని చదివి యుండవలయును. నాలందాయందుఁ బ్ర
వేశింప నెంచినవారిలో నూటికి డెబ్బది యెనుబది మంది ప్ర
వేశము దొరుకకయే తిరిగి పోవలసి వచ్చుచుండెను. నాలందా
యందుండిన యాచార్యుల నామముల ననేకములను హ్యూను
త్సాంగు తెలుపుచు, వారందఱు నధ్యాపకులగుటయే, గాక
స్వతంత్ర గ్రంథములను, వ్యాఖ్యానములు మొదలగు వానిని
వ్రాయుచుండిరని తెలిపియున్నాఁడు.

హ్యూనుత్సాంగు తన దేశమునకు వెళ్లిపోయిన కొలఁది
కాలమునకే ఇట్సింగను మఱియొక చీనాదేశపు యాత్రికుఁడు
బౌద్ధమత గ్రంథములను సేకరించుటకీ దేశమునకువచ్చి క్రీ॥
శ॥ ౬౭౩ నుండి ౬౮౭ సం॥ రమువఱకు సుమారు పదునేను
వత్సరములు సంచారము సలిపెను. ఈతఁడు ఫాహియాను,
హ్యూనుత్సాంగులవలె నతదేశమును జూడక యుండినను న
భ్యుదయదశ యందుండిన నాలందా విశ్వవిద్యాలయమునందు
పదిసంవత్సరములు వాసము చేసియుండి యాస్థలమును గూ

ర్చి చాల విపులముగా వ్రాసి యుంచియున్నాఁడు. అతనిప్రకా ర మచటి మతవిధు లతిజాగ్రత్తతో నవలంబింపఁ బడుచుం డుటచే నందనేకులు మూఁడు వేలమందికి పైగా వసించియుండిరి. ఆవిశ్వవిద్యాలయమునం దేఁబది మండపములును, మూఁడు వందల గదులునుండెడివి. దానియధీనములో రెండువందలకం టె యెక్కువగా గ్రామము లుండెను. చాలతరముల రాజ లాగ్రామములను మఠమున కిచ్చియుండిరి. అందుచే నచట వినయ, ధర్మము, లతిజాగ్రత్తగ నవలంబించుచుండుట మా త్రమున మతాభివృద్ధి యగుచుండెనని ఈత్సింగు తెలిపియు న్నాఁడు. ఆమఠమునందున్న యొక ఘటికాయంత్రము సరియై న కాలముఁ జూపుచు నెప్పు డేయే పనులు జరుగుచుండవలె నో తెలుపుచుండెడిది. మగధదేశము నందలి గడియారముల నన్నిటి నీఘటికాయంత్రము చూపిన కాలముతో సరిచేసు కొనుచుండిరఁట.

“ఈవిద్యాలయమున శిష్యుఁడు గురుసేవానంతరము వ స్మృతగ్రంధమున కొంతభాగము చదివి దానినే మననము చే యుచుండును. ఈరీతిగా దినదినమును క్రొత్తభాగములను వ ల్లించుచు మాసాంతము పాతపాఠముల నొప్పగించుచుండు ను. ఆతఁడొక నిముసమైనను వృథసేయఁడు. విశ్వవిద్యాలయ ములో చేరకపూర్వమే శిష్యులు కొంతవఱకు సంస్కృతము నభ్యసించియుండవలెను. సంస్కృతవిద్య యంతటికిని వ్యాకర

గమేఁ బుద్ధాదియుఁ తెలపఁబడుటచే నచట నాశాస్త్రము నందే యెక్కువ పరిశ్రమచేయు చుందురు.

వ్యాకరణశాస్త్రమునకు సంస్కృతమున శబ్దవిద్య యను పేరు. ఇది ౧ శబ్దవిద్య, ౨ శిల్పస్థానవిద్య, ౩. చికిత్సావిద్య, ౪. హేతువిద్య లేక తర్కము, ౫. అధ్యాత్మవిద్య, యను నైదువిద్యలలో నొకటి. ఈశబ్దవిద్యాభ్యాసమునకు సోపానములుగా:—

౧. సిద్ధము: సంస్కృత ప్రారంభ విద్యకు విధింపఁబడు గ్రంథము. ఆఱేండ్ల వయస్సు గల బాలురు దీనిని ప్రారంభించి, యారునెలలలో ముగింతురు.

౨. పాణినీయసూత్రపాఠము:- ఎనిమిదేండ్ల బాలురు దీని నారంభించి యెనిమిది నెలలలో నేర్చుకొందురు.

౩. ధాతుపాఠము.

౪. ఖిలపాఠములు (అనగా అష్టధాతు, మంద, ఉణాదులు):- బాలురు దీనిని పదేండ్ల వయస్సప్పు డారంభించి మూఁడేండ్లలో దానిసారమును గ్రహింతురు.

౫. కాశికావృత్తి:- దీని పదునైదేండ్ల ప్రాయమున నారంభించి ఐదేండ్లలో నేర్చుకొందురు.

దీనినిబట్టి చూడ వ్యాకరణమును చదువుటకింతమించు పదునాలుగేండ్లు పట్టుచుండెననియు, నిదియైనఁగాని పెద్ద విషయములఁ గూర్చి తెలిసికొనవీలు లేకుండెననియు, తెలియఁ

గలదు. వ్యాకరణ మైన పిదప విద్యార్థులు గద్యపద్య రచనలఁ జేయుచు హేతువిద్యను, అభిధర్మకోశమునుఁ జదంతురు. న్యాయద్వార తర్కశాస్త్రమును చదువుటచే వారు సరియైన యనుమానములను గల్పింప సమర్థులగుచు జాతకమాలనుఁ జదంచుచు ధారణాశక్తిని వృద్ధిచేసి కొనుచుందురు. ఈరీతిగా వారు మూఁడేండ్లచట గడపి, మహావిద్వాంసుల సభలలో వాదింప వాదములఁ జేసి పండితుల యామోదముఁ బడసి నానాదేశము లందును యశస్సు గాంతురు. పిదప రాజసభల కేగి తమ నైపుణ్యమును, కుశాగ్రబుద్ధి, వ్యక్తపఱచి, రాజకార్యము లందు నియోగింపఁబడుచుందురు. పండిత సభయందు వారున్నతాసనము నలంకరించి తమ యద్భుత మేధాశక్తిని వినియోగించి ప్రతిపక్షులకు వాక్స్తంభనముఁ గావించుచుందురు. అప్పుడు వారు రాజాశ్రయముఁ బొంది భూముల సంపాదించి గౌరవోద్యోగములందు నియోగింపఁబడుచుందురు. తమ పాండిత్యమునకుఁ బారితోషికముగా వారి నామములు ద్వారములపైఁ దెల్లని యక్షరములతో లిఖింపఁబడును. పిదప వారు తమ యిచ్ఛవచ్చిన వృత్తి నవలంబింప వచ్చును.

ఇదిగాక యిచ్చట నభ్యసింపఁబడు నుత్తమ విద్యాసందర్భమున నీట్సింగు మఱికొన్ని గ్రంథములఁ గూడఁ దెలిపి యున్నాఁడు. అవియెవ్వియన, ౧. పతంజలి రచితమగు మహాభాష్యము, ౨. భర్తృహరినీతిశాస్త్రము, వ్యాకరణము, ౩.

వాక్యపదీయము, ౪. వేదము, వీనినేగాక మతగురువులు వినయగ్రంథములను, సూత్రములను, శాస్త్రములఁగూడ నభ్యసించుచుండెడి వారఁట.

దీనిని బట్టి యీట్సింగు కాలమున నాలందా యందుత్తమ విద్య యుచ్ఛదశలో నుండెడిదనియు, దానికి మూలముగా సంస్కృత మెక్కువగా నభ్యసింపఁబడుచుండెననియుఁ దెలిసికొనవచ్చును. బ్రాహ్మణవిద్యకును బౌద్ధులవిద్యలకును బునాది యొక్కటియే యైనట్లు కూడ పై తొమ్మిదిగ్రంథములలోను మొదటి యాఱును బ్రాహ్మణవిద్యయందు గూడ వినియోగించుచుండుటఁబట్టి మనము తెలిసికొనవచ్చును. తుది మూఁడుగ్రంథములును బౌద్ధమతస్థుఁడగు భర్తృహరి రచించినవి.

ఈవిద్యాలయమున విద్యను నేర్చుకొనునప్పుడు కేవలము నోటితో నేర్చుకొనుటయుఁ బుస్తకములఁ జూచి పఠించుటయు నను రెండు విధానములు ననుసరింపఁబడుచుండెను. పదిరోజులు వల్లించునరికి జ్ఞాపకశక్తి నూటవలె నూరుచు నతిశీఘ్రముగ నేర్చుకొనుట కనువు పడియుండుననియు, నొక్కసారి చదివినంతనే జ్ఞాపకముంచుకొనఁ గలవారి ననేకులను తాను జూచియున్నాననియు నీట్సింగు చెప్పియున్నాఁడు. వాక్యోపవాక్యములం దారితేరిన వారచట నాధిక్యతఁ గాంచుచుండురనియు, వాదమునఁ బ్రతిపక్షులను జయించుటయే ప్రజ్ఞయనియు నచట తలపఁబడుచుండెను. వాదములందు గెలిచిన

వారే సాధారణముగా రాజకీయోద్యోగములందు నియోక్తులగుచుండుటయు, వారినామములే ద్వారోపరిభాగమున ధవళవర్ణములతో లిఖితములగుచుండుటయు, సంభవించుచుండెను.

జాతక కథలను, వినయగ్రంథములను, చదువుటయే కావ్యపాఠముగా నుండెను. మఠములందలి వారు కవిత్వము చెప్పుటయందుగూడ నేర్పరులై యుండిరి. నాలందాయందు సంగీతవిద్య కూడ యభ్యసింపఁబడుచుండుటఁ జూచి చీనాదేశమునను నావిద్య యభివృద్ధి నొందవలెనని యీత్సింగభిలషించుచుండెను.

సాధారణవిద్యలోఁ జేరకపోయినను వైద్యముకూడ నచట నభిమానింపఁబడుచుండెను. విశేషానుభవముగలవారే దాని నభ్యసించుచుండిరి. కొన్ని వైద్యగ్రంథములగూర్చియు చికిత్సావిధానములఁ గూర్చియు నీత్సింగు వ్రాసియున్నాఁడు.

బౌద్ధమతము ప్రకారము ప్రపంచముతో నేసంబంధమ్ము నుండకపోవలసినను బ్రాహ్మణులవలె బౌద్ధులు దేహమును శుష్కింపఁజేయకుండిరి. దేహము సర్వవిధముల రక్షణీయమని వారు తలంచి వివిధ వ్యాయామములందు పాల్గొనుచుండిరి. ముఖ్యముగా మఠములందలి యందఱును తప్పక సాయంప్రాతలయందు చాలదూరము నడచుచు శరీరమును మంచి యవస్థయందుంచుకొనుచుండిరి.

బౌద్ధభిక్షువులు తమతమ ధర్మవ్యాపనమునందు బద్ధకంకణులైయుండి తమధర్మములఁగూర్చిన జ్ఞానమేగాక లౌకిక జ్ఞానమునుగూడ నెక్కువగా తమశిష్యులకు బోధసేయుచుండిరి. ఇట్టి లౌకికబోధ ప్రస్తుత విద్యావిధానమునందువలె నంత యెక్కువగా లేకున్నను నాటి బ్రాహ్మణ విద్యయందుకంటె యెక్కువగనే యుండెనని యొప్పుకొనక తప్పదు. ఈవిశ్వవిద్యాలయమున జేరువారియందు కేవలము బౌద్ధధర్మావలంబకులు కాఁబోవువారేగాక సాధారణవిద్య నభ్యసింప వచ్చినవారుగూడ నుండిరి. మఠపరిచారమునఁ బ్రవేశింపనెంచిన విద్యార్థులకు మానవులనియు, నట్టి యుద్దేశము లేనివారికిఁ బ్రహ్మచారులనియుఁ పేరుండెను. బౌద్ధమత మవలంబించినవాఁడు తిరిగి స్వమతములోనికి వెళ్ళిపోవుచుండుటయు సాధారణముగా జరుగుచునేయుండెను. భర్తృహరి యేడుసార్లు భిక్షువై యేడుసార్లు బ్రాహ్మణమతములోనికి వచ్చెనట.

నాలందాయందు విద్య యిట్లవిచ్ఛిన్నముగా జరుగుచుండిన కాలమందు భారతవర్షమునుండియే గాక చీనా, టిబెట్టు, మధ్యఆసియా, బొఖారా, కొరియా దేశములనుండియు ననేకులు బౌద్ధధర్మాభిలాషులు చేరి విద్యను స్వీకరించుచు నుచితముగ వసతులను, భోజనమును నీయఁబడుచుండిరి. ఐరోపాఖండము ఘోరాంధకారములో మునిఁగియున్నప్పుడు సారసేను, అరబ్బీ విశ్వవిద్యాలయము లింకను తలచూపని సమయ

ముందు నాలందావిశ్వవిద్యాలయము శాంతవిశ్రాంతికీర్తిని గడించి పదివేలమంది కెక్కుడుగ విద్యార్థులకు విద్యాప్రదాతయై యలరారుచుండెను.

ఈవిశ్వవిద్యాలయమున నాల్గు శాఖాశాలలుండెను. ఇందొక్కొక్క శాస్త్రమును బోధించుటకు వేర్వేరుగా నొక్కొక్క యధ్యాపకు డుండెను. వయోవృద్ధులును, విమల శీలురును, విద్వాంసులు నగువారే యధ్యాపకపదవికి నియోగింపఁబడియుండిరి. నవీనవిశ్వవిద్యాలయము లందువలె నొక్కొక్కవిషయమును బోధించుట కొక్కడే యధ్యాపకుడును, విద్యార్థికి రెండు మూఁడు శాస్త్రముల నభ్యసింప నభిలాష యుండినచో నాతఁ డాయా శాస్త్రాధ్యాపకులను గురువులుగా స్వీకరించుచుండెను. ముఖ్యశాస్త్రమేదో యొకటి నేర్చుకొనుచుండినను విద్యార్థి కన్నిశాస్త్రములఁ గూర్చియు నొకరీతిజ్ఞానము తప్పక యుండవలసి వచ్చెను.

ఈవిశ్వవిద్యాలయమునందు కళావిద్యకు తావులేక యుండుట మనము గమనింపవచ్చును. ఈవిషయమున నిది తక్షశిలాకు తీసిపోయి యుండెనని యే చెప్పవచ్చును. అచట ననేకశాస్త్రములును, కళలును నభ్యసింపఁబడుచుండెడివి. అయినను నాలందాయందు పాండిత్యములోనే ముఖ్యముగా గణింపఁబడుచుండెను గాని యనేక విషయములఁగూర్చిన సామాన్యజ్ఞానమంతగా లెక్కచేయఁబడకుండెను. తినుటకుతిండి,

కట్టుకొనుటకు బట్ట, తిండాదికొనుటకు వసతి గృహమును గూడ నిన్నివేలమంది విద్యార్థులకొసఁగుచుండ నధికధనముపై నాధారపడియుండు కళావిద్య నచటి యధికారులంతగా మోదింపలేదని నిందమోపుట సముంచితము కాదు. ఇది గాక బౌద్ధమతస్థులకు ప్రపంచవ్యవహారములతో జోక్యము కలుగఁజేసికొనుట తప్పగుటచే నట్టి కళలచట నభ్యసింపఁబడకుండెడివనియు మన మూహింపవచ్చును.

ఈరీతిగా నాలందాను వదలిపెట్టిన తరువాత చాలకాలము వఱకును నచట విద్యాలయము సాగుచునే యుండెను. తరువాతి కాలమున స్థాపింపఁబడిన విక్రమశిలకును, నచటికిని, రాకపోకలు జరుగుచునే యుండెను. కాని తురుష్కులీదేశముపై దాడివెడలినపుడీమతము నందలి యాలయములను, చైత్యములనుఁ బగులఁగొట్టిరి. వానిని ముదితభద్రుఁడను బౌద్ధసన్యాసి తిరిగి కట్టించెను. అతని తరువాత మగధరాజు కొద్ద మంత్రియగు కటుకసిద్ధి యను నాతఁడొక యాలయము నచటఁ గట్టించెను.

ఈరీతిగా నీమహావిద్యాలయము కొంతకాలమభివృద్ధియందుండినను బౌద్ధమత మితర ప్రదేశములకు జనుచుండఁగా కొలఁదిని దీని ప్రాధాన్యము తగ్గిపోవుచు వచ్చెను. ఈవిద్యాలయ మెప్పుడు శిథిలించిపోయెనో మనకు తెలియదు గాని యది యంతరించిన విధమును గూర్చి యొకకథను చెప్పుచుందురు. కటుకసిద్ధి కట్టించిన యాలయము నొద్ద కొం

నొకప్పు డిద్దరు నిరుపేదలగు తీర్థవాసు లేతెంచిరంట. వారిని చూచి యందలి బాలసన్న్యాసులు గేలిసేయుచు వారి పై చిమ్మనగొట్టములతో నీళ్లు చిమ్మనారంభించిరంట. ఆతీర్థవాసులకు కోపమువచ్చి పండ్రెండు వత్సరములు సూర్యోపాసనం జేసి తరువాత యజ్ఞము సల్పి యాయగ్నికుండము నందలి యగ్నికణములను బౌద్ధాలయములపైఁ బఱపఁగా వహ్నిజ్వాల లుదయించి రత్నోదధిని నిర్మూలముం జేసెనంట. అయినను ప్రజ్ఞాపారమిత సూత్రగ్రంథములనుండియు, సూత్రగ్రంథములనుండియు జలమస్ఖలితముగా స్రవించుటచే ననేక ధర్మగ్రంథములు నిలిచియుండెనంట. ఈకథ సత్యమైనను గాకున్నను బ్రాహ్మణులును, బౌద్ధులును నొకరి నొకరు ద్వేషింప నారంభించిన నాఁటినుండియు నీవిశ్వవిద్యాలయము క్షీణదశ నొందుచు వచ్చెనని మనమూహింప నవకాశమున్నది.



శ్రీరస్తు

# ప్రాచీన విద్యాపీఠములు.

## తామ్రలిప్తి

తామ్రలిప్తి యను పట్టణమున కిప్పుడు 'తమ్‌లూల్' అని పేరు. ఇది హుగ్లీనది ముఖద్వారమున నున్న యొక రేవు పట్టణము. ఇది చాలపురాతన పట్టణమై ఇండియాదేశపు వాణిజ్యమునకు గొప్పస్థానమై పరదేశవాసు లీదేశమునకు వచ్చుటకును, నిచ్చటివారు పరదేశములకుం బోవుటకును ముఖ్యముగ తావై యలరారుచుండెను. గ్రీకులు, యవనులు, విదేశములతో సంబంధము కలిగియుండిన క్రీ॥పూ॥ కొన్ని శతాబ్దములనుండియు నీరేవు పట్టణము చాల ప్రసిద్ధికెక్కి యుండెను. ఫాహియాను కాలమున నిచట నిరువదిరెండు బౌద్ధ విహారము లుండెను. వీనియందెల్ల ననేకులు భిక్షువు లుండిరి. హూయను త్సాంగు కాలమున నీప్రదేశము చాలభాగ్యవంతమై యుండెననియు, నిచటి జనులు చాల చురుకుదనము, తొందరపాటు గలవారైనను ధైర్యసాహసములు గలవారనియు దెలియుచున్నది. ఆ కాలమున నిచట బౌద్ధులును, బ్రాహ్మణులును, గలసి నివసించు చుండిరి. పదిసంఘారామ

ములును, వేయిమంది శ్రమణులును, నిచట నాకాలమున నుండిరఁట. బ్రాహ్మణ దేవాలయములు కూడ నిచట నేబది యుండెను. ఈబ్రాహ్మణు లనేక శాఖల వారై యుండిరి. ముఖ్యములగు రత్నములును, నితర వస్తువులును, దొరకుచుండెను. కావున నిచటి జనులు చాల ధనవంతులై యుండిరి. ఈపట్టణమ్ము ప్రక్కనే యశోకుఁడు కట్టించిన స్తూపము చుట్టును బుద్ధుఁడు తన పూర్వపు నాల్గవతారములందునుఁ గూర్చుండి సమాధి యందుండిన గుఱుతులుండెనఁట. ఈట్సిం గిచటి బౌద్ధాచారములఁ గూర్చి కొంత తెలిపి యున్నాఁడు. చీనాదేశమున బుద్ధుని నామమును పునశ్చరణఁ జేయుటనో వాడుకలో నుండెను గాని యాతని గుణసంకీర్తనము చేయు నలవాటు లేదనియు నిట్టి గుణ సంకీర్తనము చేయుటయందే యెక్కువ ఫలమున్నదనియు నీతఁడు చెప్పియున్నాఁడు. ఇచట చైత్యములనుఁ బూజించుచుండిరి. సాధారణ ధర్మోపన్యాసములు సాయంకాలము జరుగుచుండెను. ఇచటిశ్రమణు లందఱును స్తూపమునకుఁ బ్రదక్షిణము చేసి సాంబ్రాణి ధూపములను వైచి పుష్పములతోఁ బూజించుచుండిరి. వారందఱును స్తూపము చుట్టును మోకాళ్లపై నుండియుండగా శ్రావ్యకంఠముఁ గలవాఁడొకఁడు మనోహరముగా పదిలేక యిరువది శ్లోకములను చదివిన పిమ్మట నందఱును మఠమునందలి మండపము మీఁదికి పోదురు. ఇట్లు వారచట కూర్చుండిన పిటకసూత్రవాచకుఁ డొకఁడు సింహాసనము పై కెక్కి చిన్న

సూత్రమును చదువును. ఇచట చదువు పుస్తకములలో అశ్వఘోష విరచితమగు "త్రిభాగపూజ" service in these parts యను నర్థమునుగల యొక గ్రంథము ముఖ్యమైనది. దీనిలో మొదటి భాగములోని పదిశ్లోకములును త్రిరత్నస్తుతి. రెండవ భాగములో బుద్ధుని వాక్యములు కొన్నియుండును. మూడవ భాగములో పుణ్యమభివృద్ధి నొందు గాక యని ప్రార్థనగల పదికంటె నెక్కుడు శ్లోకములుండును. ఈశ్లోకములను చదివినంతనే యందఱును "సుభాషిత" well spoken hear hear అని యందురు. ఒకప్పుడు సాధు ! సాధు ! Good Good అని కూడ నందురు.

సూత్రవాచకుడు చదువ వలసిన దైనంతనే ముఖ్యోపాధ్యాయుడు లేచి తొలుత సింహాసనమునకును, తర్వాత బోధిసత్త్వ విగ్రహముల స్థానములకును, నమస్కరించి తనస్థానమున కూర్చుండును. అతని పిదప రెండవ యుపాధ్యాయుడు గూడ మొదటి వానివలెనే చేసి ముఖ్యగురువునకు నమస్కరించును. ఇట్లే యితరులు గూడ తమ గౌరవ క్రమమున జేయుచుందురు. చాలమంది శ్రమణులు చేరియున్నచో నొక గుర్రైగాగు రిల్లు చేసినంతనే తక్కిన వారందఱు నొకసారి యందఱికి నమస్కరించి వెడలి పోవుదురు.

ఈమతమునందింత శ్రద్ధతో బౌద్ధమత మవలంబింపబడుటం జూడ బౌద్ధవిద్యయు నిచట హెచ్చుగ ప్రబలియుండునని మనమూహింపవచ్చును.

---

శ్రీరస్తు.

# ప్రాచీనవిద్యాపీఠములు.

## సుధాన్యకటకము.

సుధాన్యకటకము నందు క్రీ॥ పూ॥ ౨౦౦ సం॥రములకుఁ బూర్వమునుండియు బౌద్ధవిద్య యత్యున్నతదశలో నున్నట్లు తెలియుచున్నది. సుధాన్యకటక నగరు ధాన్యకటకమనియు, ధనకటకమనియు, ధనకచ్ఛకమనియుఁ గూడ శాసనములందు పేర్లు గానవచ్చుచున్నవి. దీని నిప్పుడు ధరణికోట యందురు. ఇది కృష్ణానది దక్షిణప్రాగ్భాగమున నమరావతియను చిన్నపట్టణమున కొక మైలు దూరములోను బెజవాడకు పశ్చిమముగా ౧౮ మైళ్లదూరమునను నున్నది. బెజవాడయే ధనకటకమని ఫెర్గ్యుసనుగారు వ్రాసిన వ్రాతకాధారము లేదు. క్రీ॥ పూ॥ రెండుశతాబ్దములకు ముందిచ్చట శాతకర్ణులను రాజులు రాజ్యము చేయుచుండిరి. వీరికే పురాణములలో నాంధ్రభృత్యులను నామమున్నది. జనులు సాధారణముగ వీరిని శాతవాహనులని పిలుచుచుందురు. శాతవాహనశబ్దమే శాలివాహన శబ్దముగా మారినదని హేమచంద్రుఁడు తన పాశ్చాత్యవ్యాకరణమునఁ దెలిపియున్నాఁడు. శాలివాహను

తను నొకరా జీదేశమును బాలించినట్లును, ఆతనిమీఁదియే ప్రస్తుత వ్యవహారములో నున్న శాలివాహనశకమేర్పడినట్లును మనవారు చెప్పుచున్నారు గాని, శాసనములఁబట్టి శాలివాహన నామముగల పురుషుఁడొకఁడుండెనాయని చారిత్రిక పరిశోధకులు సంశయించుచున్నారు. ఈశాతకర్ణిరాజులకాదిపురుషుఁడు సింధుక, శిశుక, సిప్రక నామములతోఁగూడ వ్యవహరింపఁబడుచున్న శ్రీముఖుఁడనువాఁడు. ఈతఁడు కాణ్వవంశము నాశము నొందించి యీదేశమునకు క్రీ॥ పూ॥ ౭౩ సం॥ రమున రాజయ్యెను. ఆంధ్రభృత్యుల ముఖ్యపట్టణము ధనకటకమేయైనను యువరాజులు గోదావరీ తీరముననున్న పైఠానును రాజధానిగాఁ జేసికొని యుండిరనియుఁ దెలియవచ్చుచున్నది. రాజు చనిపోయిన తరువాత పైఠానునందలి, యువరాజు ధనకటకమునకు రాజగుచువచ్చెను. ఈరాజులు ప్రాకృతకావ్యరచనను బ్రోత్సహించుచువచ్చిరి అట్టివారిలో హాలుఁడు ముఖ్యుఁడు. ఈతని యాస్థానమున సకలవిద్యలును నెలకొని యుండెనని తెలియవచ్చుచున్నది. ఈతఁడు "సప్తశతి" యను గ్రంథమును బ్రాకృతభాషగా రచించుటయేఁ గాక విద్వాంసులను బోషించుచు వారిచేఁ బ్రాకృతకావ్యములను వ్రాయించుచు వచ్చెను. "నూనూగు మీసాల నూత్న యౌవనమున శాలివాహన సప్తశతి నుడివితి" నని శ్రీనాథుఁడు కాశీఖండమున వ్రాసికొనియున్నాఁడు. దీనినిబట్టి సప్తశతిని రచించినవాఁడు హాలుఁడు గాక శాలివాహనుఁడే యని కొందఱు

తలంచుచున్నారు గాని, శాలివాహననామ మొకపురుషునిది గాక వంశమును దెలియఁజేయునదే యనియు నావంశమున మిగుల విఖ్యాతి నొందియుండిన హాలుని శాలివాహన నామమున జనులు వ్యవహరించి యుండిరనియుఁ జెప్పుటకు తగిన కారణములు గలవు. ఈతని యాస్థానముననే గుణాఢ్యుఁడు మంత్రిగ నుండి బృహత్కథను పైశాచీ భాషలో రచించెనని తెలియవచ్చుచున్నది. ఈపైశాచీ భాషయే పూర్వపుటాంధ్ర భాష యని కొందఱు తలంచిరి గాని తదయుక్తమునకుఁ దగిన కారణముల నిరూపింపరైరి. బృహత్కథను గుణాఢ్యునకు కాణభూతి యేడుకథలుగాఁ జెప్పెననియు, నాతఁడొక్కొక కథకు లక్ష శ్లోకములచొప్పున తనరక్తముతో వ్రాసియుంచె ననియుఁ జెప్పుదురు. ఇంత పెద్ద గ్రంథమైన బృహత్కథ యిప్పు డెచ్చటను గానరాదు గాని, దానిలోని భాగములఁ దీసికొని యనేకులు తమతమ దేశభాషలలో కొన్ని కథలను వ్రాయు చువచ్చిరి. తమిళ ప్రబంధమగు శిలప్పదిగారము లోని యు యన కథకు మూలమీ బృహత్కథయే యని యా ప్రబం వ్యాఖ్యాత వ్రాసియున్నాఁడు.

ధరణికోట కొకమైలు దూరమందనే యమరావతీ స్థ ణమున్నది. అమరావతికి దలదా వంశమను బౌద్ధగ్రంథములో దీపాలదిన్నె యను పేరుంగాననియు నది నాగరాజను నా రాజ్యములోని దనియు వ్రాయఁబడియున్నది. ఇక్కడి బౌ రాష్ట్రమున బౌద్ధమతసులగు నాగార్జునయోగి యాంధ్రభృత్యు

క్రీ॥ శ॥ ౩౭౦—౩౮౦ సం॥రముల ప్రాంతమున నిర్మించిరని సూయలుగారు చెప్పుచున్నారు.

బౌద్ధసంఘారామములు సాధారణముగా నొకపట్టణము నంటి యుండును. బౌద్ధభిక్షువు లాపట్టణమున భైక్షుచరణము నాచరించి, యీయారామములందు తమ మతకర్మలను విద్యలను సాగించుకొనుచుందురు. కావున నమరావతియు ధరణికోటయుఁ జిరకాలమునుండి కలసియే ప్రసిద్ధిచెందియుండిన వని చెప్పవచ్చును.

ధాన్యకటకమునఁ దొలుత నారామముఁ గట్టించి విద్యాపీఠమును నెలకొల్పిన వాఁడు సిద్ధనాగార్జునుఁ డని తెలియవచ్చుచున్నది. ఈతఁడు క్రీస్తుపూర్వమే యుచట నుండెను. ఈతఁడు తొలుత బ్రాహ్మణుఁడైనను బౌద్ధమతమును స్వీకరించి, సర్వమును విసర్జించి, బౌద్ధధర్మములఁ దప్పక, యాయామత గ్రంథములసారమును సంపూర్ణముగ గ్రహించుటయేగాక, లైన భక్తిచే సర్వాత్మప్రాప్తికి ప్రథమసోపానము నధిష్ఠించి యుండెననియు, నీతని శిష్యుఁడగు దేవుఁడను వాఁడు వైశాలి కేగి యచట బౌద్ధమతము నణఁగఁ ద్రొక్కఁబ్రయత్నములు చేయుచుండిన బ్రాహ్మణులను వాదమున నోడించి తిరిగి యిక్కడి సంఘారామమున ఘంటానాదమును వెడలఁ జేసెననియు హ్యూనత్సాంగు తెలిపియున్నాఁడు.

ఈచీనా యాత్రికుఁ డిచ్చటికి వచ్చినప్పు డీదేశము సస్యములు ఫలవంతముగా నుండి పట్టణము సమృద్ధిగా నుండు

చూచెను. చాలమట్టు కూపరక్షేత్రములును నిండుండెనని యు పట్టణములందు జనసమృద్ధ మంతగా లేదనియు, నిది చాల నుష్ణప్రదేశమనియు, నిచటి ప్రజలు చామన చాయ వారనియుఁ జాలతొందర పాటువారనియు నతఁడు చెప్పి యున్నాఁడు. ఈదేశ వాసులకు విద్యయనినఁ జాలఁ బ్రీతి యుండెను. ఇచట చాల సంఘారామములుండెను గాని వానిలో జాలమట్టుకు పాడుపడి యుండెను. అప్పటి కిరువది సంఘారామములును, వేయిమంది శ్రమణులును మాత్రముచ్చట నుండిరి. వీరందరును మహాయానగ్రంథములనే పఠించుచుండిరి ఇచట నూరు బ్రాహ్మణదేవాలయములు నుండెనని యు ననేక మతముల వారా యాలయముల కేగుచుండిరనియు నీతని వ్రాతలవలనఁ దెలియుచున్నది.

ధాన్యకటకమునకుఁ దూర్పునఁ జేరువగానున్న యొక పర్వతమునందు 'పూర్వశిలా' యను నొక బౌద్ధారామమును, పశ్చిమమున నున్న పర్వతమునంటి అవరశిలా యను నారామమును నుండెను. బుద్ధుని యెడ భక్తిచేఁ బూర్వరాజొకఁడు పూర్వశిలారామమును నిర్మించెనట. ఆతఁడీకొండ లోయలను త్రవ్వించి బాటలు వేయించి, ఱాతిబండలను దొలిపించి, పెద్ద శిలాగృహములను, మెట్లవరుసలను గట్టించెను. ఇచటి మందిరములఁ గట్టించుటకు శిల్పులను దూరదేశములకుఁ బంపించి యా యా దేశముల శిల్పముల నిచటను నిల్పెనని హూలీ యను చీనాదేశస్థుఁడు వ్రాసి యున్నాఁడు. ఈతఁడే

సిద్ధనాగార్జునుఁడై యుండవచ్చును. ఇచ్చటి మండపము లతి విశాలములై యుండెను. దేవత లీయారామములను గాపాడు చుండిరఁట. మహాత్ములును మహర్షులును వచ్చి యిచ్చట నివ సించుచుండిరఁట. బుద్ధనిర్యాణానంతరము హూనుత్సాంగిచటికి వచ్చువఱకు నీవేయిసంవత్సరములలోను వేయిమంది మాన వులకనఁగా సాధారణ జనులకును వేయిమంది శ్రమణుల కును దక్కువకాకుండ నిచట వర్షకాలమున జనులు నివసించు చుండిరఁట. ఇచట నిర్వాణావస్థఁబొందిన వారెల్ల వాయు మార్గమున వెడలి పోవుచుండిరఁట. హూనుత్సాంగచటికి వచ్చుటకు పూర్వము మూఁడు సంవత్సరముల నుండియు నా పర్వతము తన యాకారమును మార్చుకొనుచు నొకప్పుడు పొడుగను నొకప్పుడు పొట్టిగను గనబడుచుండుటచే నచ టివారు భయపడి యాస్థలము విడిచిపెట్టియుండిరట. ఏదో యొక భూకంపము కలుగుట చేతనో, లేక యాయారామము శిథిల మగుచుండుటచేతనో వారాప్రదేశమును విడిచిపెట్టి యుందురు. హూనుత్సాంగచటికి పోయినప్పుడెక్కువమంది యాసంఘారామమున నివసించి యుండలేదు.

ఈచీనా యాత్రికుఁడచటి కేఁగునప్పుడు 'భావవివేకుఁడ' ను నాచార్యుఁడారామమున నధ్యక్షుఁడుగా నుండెను. ఈతఁ డు బహుశాస్త్రములయందు ప్రజ్ఞావంతుఁడై యుండుటయే గాక తన సౌశీల్యాది గుణములచే మిగుల గౌరవింపఁబడు చుండెను. ధాన్యకటకమునకు దక్షిణముగా నున్న యొక

పర్వతగుహాలో నీతఁడు వాసము జేయుచు, మైత్రేయబో
ధిసత్త్వుఁడు బుద్ధుఁడుగా నవతారము నొందుటకై ప్రతీక్షించు
చుండెను. ఈతఁడు పైకి కపిలుని శిష్యుఁడనని సాంఖ్యతత్త్వ
ము నవలంబించు వానివలెఁ గనఁబడుచుండినను మనస్సులో
మాత్రము నాగార్జునుని బోధన సంపూర్ణముగ విశ్వసించి
యుండెను. మగధ దేశము ధర్మపాలుఁడను బౌద్ధగురువు తన
మహాత్మ్యముచే మన్ననల బడయుచు నుండెను. వినినయాతనితో
వాదము చేయ భావవివేకుఁడాతని యొద్దకేగెను గాని యా
గురువు భావవివేకునకు దర్శనమీయక "యీ జీవనమంతయు
మాయ. శరీరము బుద్బుదప్రాయము. తత్త్వమును దెలిసికొను
టకు నాకు దినమంతయుఁ జాలదు. వాదములకు నాకు తీరుబడి లే
దని" చెప్పి పంపివేసెనఁట. భావవివేకుఁడును ఖిన్నుఁడై తిరి
గి ధాన్యకటకముఁజేరి "మైత్రేయుఁడు బుద్ధుఁడుగా నవతరించినఁ
గాని నా సందేహములకు సమాధానము నెవ్వరును జెప్పఁ
జాలరు' అని తలంచి, యాహారపానీయముల విసర్జించి యవ
లోకితేశ్వరుని సాన్నిధ్యమున "హృదయధారిణి" యను మ
త్రమును బఠింప నాతఁడు సాక్షాత్కరించి 'నీకేమి కావలయు'న
ని యడుగుడు "మైత్రేయుఁడవతరించు వఱకును నేనీ దేహము
తోడనే యిచట నుండునట్లనుగ్రహింపవలయు"నని వేడికొనె
నఁట. అవలోకితేశ్వరుఁడు, "ఓయీ, బుద్బుదప్రాయమగు నీశరీ
రము నేలయపేక్షించెదవు? ధర్మమార్గమును నిష్ఠతో నవలం
బించి తుషితస్వర్గమున కేగినచో నచటనే నీకు మైత్రేయుఁడు

కాన్పించునే? యని చెప్పినను నాతఁడు వినఁడయ్యెను. అప్పు డాతఁడు భావవివేకు నుద్దేశించి "నీవు నీపట్టును విడువకున్నావు. అయిన నీధనకటకమునకు దక్షిణమున గుహలోనున్న వజ్రపాణిశక్తిని గొలిచి, వజ్రపాశిధారిణీ మంత్రమును" జపించుము. మైత్రేయుఁ డేతెంచునని చెప్పి యంతర్ధానము నొందెను. అట్లే యాతఁడును మూఁడుసంవత్సరములు శక్తిని గొలువఁగా నామె ప్రసన్నయై యాతని కొకమంత్రముపదేశించి యావర్తమునకు దక్షిణమున యసురుని కోట యున్నదనియు నాకోటయొద్ద నానుపదేశించిన మంత్రమును మననము జేసినయెడల కోటగోడలు విడి దారి యిచ్చుననియు, నందు ప్రవేశించి వాసము చేయుచుండిన నొకకొంతకాలమునకు మైత్రేయుని దర్శనము లగుననియుఁ జెప్ప నాతఁడట్లే చేసి యాగుహలోనికి మరి ముగ్గురితో ప్రవేశింపఁగా గోడలు తిరిగి మూసికొని వారందులో నుండిపోయిరనియుఁ దరువాత వారేమయిరో తెలియదనియు హియాన్‌త్సాంగు చెప్పియున్నాఁడు హియాన్‌త్సాంగిట్టి కతలెల్ల నప్పుడప్పుడు తాను వినినవానిని చెప్పుచుండినను దుకొంచెమైన సత్యముండకపోదు. భావవివేకుఁడు వజ్రపాణిశక్తి నారాధించుటఁజూడ బౌద్ధమతస్థులు క్రమక్రమముగా బ్రాహ్మణాచారముల నవలంబించుచుండుటను దెలుపుచున్నది.

ధాన్యకటకమున నుండిన బౌద్ధులు "మహాయాన" శాఖారని చీనాయాత్రికులు చెప్పియున్నారు. ఈ మహాయాన

శాఖవారు దక్షిణహిందూ దేశమునందేగాక యుత్తరదేశమునను బ్రబలియుండిరి. బుద్ధుఁ డుపదేశించిన ధర్మములందు తరువాతివారు కొన్నిమార్పులను దెచ్చిపెట్టియుండిరి. వానియర్థము నందఱు నొక్కరీతిగా బోధచేసికొనక స్వతకల్పలను జేసికొని వీరు నానాఁటికి ననేకశాఖలుగా విడిపోఁజొచ్చిరి. అశోకుని కాలమునకే బౌద్ధమతస్థు లనేకశాఖలుగా విడిపోయియుండిరి. ఇదిచూచి యాచక్రవర్తి బౌద్ధశ్రమణుల సభనొకదానిని గూర్చి యందు బుద్ధుఁడుపదేశించిన మూలధర్మములను నిర్ణయింపనెంచెను. ఈప్రయత్నమువలనను నీభేదాభిప్రాయము లంతరింపలేదు. తరువాత కనిష్కుఁడు వివిధశాఖాసమ్మేళనముగావింపఁ దానును నొక సభఁ గావించెను. ఆవెనుక సింహళద్వీపమందలి యనూరాధపురమున బౌద్ధధర్మనిర్ణాయకసభ మఱియొకసభ జరిగెను. ఇట్లితరప్రదేశములయందును ననేకసభలు జరుగుచునచ్చెను. కాని యేకార్యమును లేకపోయెను. సంఘములందును నూహలయందును గలిగిన మార్పులను కొన్నిసభలును బరిషత్తులును దీసివేయజాలునా? శాఖలు కలుగుటకు బీజమెప్పుడు కలిగినదో యాశాఖలట్లు పెరిగి పోవలసినదే. ఆదిధర్మములనుండి విడిపోవుటవలన గలుగు నష్టముల నాయాశాఖలవారు గ్రహించినగాని శాశ్వతములగు సంస్కరణములు పొడసూపవు.

ఈరీతిగా విడిపోయిన బౌద్ధమతశాఖలన్నియు "హీనయానము" లనియు "మహాయానము" లనియు రెండు తెగ

తులుగా నేర్పడినవి. బుద్ధుఁడు తొలుదొల్త నుపదేసించిన ధర్మములను, నాచారములను, సిద్ధాంతముల నేయున నరింతుమను వారు హీనయానమువారు. ఎవనిమట్టుకు వాఁడే ప్రయత్నములు సలిపి జ్ఞానమును సంపాదించుకొని, సంసారమునుండి తప్పించుకొని పునర్జన్మము లేకుండఁ జేసికొనవలయుననియు, కొకనికి మఱియొకఁడెట్టి సహాయమును జేయఁజాలఁడనియు, బుద్ధుఁడు బోధించెనని హీనయానమువారందురు. వీరిప్రకారము జ్ఞానయోగమువలననే ముక్తి లబ్ధమగును. బుద్ధుఁడు కేవలమును మనుష్యుఁడే. జ్ఞానమును సంపాదించుటచేత నాతనికానామము కలిగినది. మనుష్యులకంటె నతీతుఁడనని యాతఁడెన్నడును జెప్పికొనియుండలేదు. ఆతనివలె నితరులును బుద్ధులు కావచ్చును. మృత్యువు తరువాత నేమున్నదో యెవ్వరికి దెలియదు; ఏమున్నదని ప్రశ్నించుటకుఁగూడ నెవ్వనికి నధికారము లేదు.

ఈ ఈ వాదమును మహాయానము వా రంగీకరింపరు. ఎవనిమట్టుకు వాఁడు జ్ఞానసంపాదనముఁ జేసి ముక్తినొందుటవలనఁ గార్యము లేదనియు, దక్కినవారందఱు జ్ఞానవ్రతము సంసారమున దేవులాడుచుండఁగాఁ దానొక్కఁడును నిర్వాణము నొందనెంచుట యొంటెత్తుగుణమనియుఁ, దనతోఁ బాటు తక్కినవారినిఁగూడ ముక్తిమార్గమునఁ దీసికొనిపోవుట యే శ్రమనియుఁ, గేవలజ్ఞానయోగమువలన ముక్తిఁబడయు విలువనియు, భక్తియోగమును గర్మయోగమును జ్ఞానముకంటె

ముక్తింగోరువార్కు సమరములనియు, మంజుశ్రీ, అవలోకితేశ్వరుఁడు, మైత్రేయుఁడనను మువ్వురు బోధిసత్త్వులు తప్ప నితరులు బుద్ధులు కాఁజాలరనియు, వారు పూజనీయులనియు, ముక్తిని బొందుట కందఱికి నర్హత గలదనియు వీరందురు. ఈరెండుశాఖలకును ద్వైతాద్వైతముల వారికున్న భేదమున్నది. హీనయానమను పేరు వారికి మహాయానము వారొసంగినది. కాని, వారట్టి పేరితో నన్యవారి పిలుచుట కిష్టపడరు. మహాయానమువారి మతము ధర్మవిరుద్ధమైనదనియు, బుద్ధునియభిప్రాయముల ననుసరించినది కాదనియు వీరందురు.

ఈమహాయానశాఖ వారిమతము హూయానుత్సాంగు దక్షిణదేశమునఁ బ్రబలముగా నుండియున్నట్లు చెప్పియున్నాఁడు. ఆంధ్రదేశమునందలి యీశాఖవారి మతమునే టిబెటుదేశమువారు ననుసరించిరి. కాని, యాదేశమున నిది మతాంతరవైలక్ష్యము నొంది "లామా" మతమను ప్రస్తుత శాఖగాఁ బరిణమించినది.

టిబెటునకు ముఖ్యపట్టణమగు లహాసా యొద్దనున్న డ్రీపాంగులోని గొప్పమఠము ధాన్యకటకమునందలి మఠము ననుసరించియే నిర్మాణము గావించిరి. ఇచటి సంఘారామమున నాఱు కళాశాలలున్నవఁట



౯ గ్రంథ
'వం

శ్రీరస్తు.

# ప్రాచీనవిద్యాపీఠములు.

## మధుర

### తమిళసంగములు.

సంగమనునది 'సంఘ' శబ్దమునకు తమిళ భాష యందు వికృతి. ఈపదము తమిళ భాషలోనికి బౌద్ధ మత వ్యాపనము వలన వచ్చినదని కొందఱు తలంచుచున్నారు. బౌద్ధులకు సంఘారామము లెట్లో తమిళులకు సంగములు పూర్వ కాలమున నుండెను. ఇవి పూర్వకాలపు పరిషత్తులకు సరి పోవును. పరిషత్తులందు ధర్మసూక్ష్మము లెల్ల నిర్ణయింపఁ బడుచుండెనో, యీతమిళ సంగములందు గ్రంథకర్తల గ్రంథముల ప్రాశస్త్యమెల్ల నిర్ణయింపఁ బడుచుండెను. ఈసంఘ సభ్యుల యామోదమునఁబడయని గ్రంథము ప్రసిద్ధికి వచ్చుటకు వీలులేకుండెను. ఇందలి సభ్యులు శాస్త్రములందు పండితులై, తాము మొదట కావ్యరచనయందు ప్రఖ్యాతిఁబడసిన వారై యుండిరి. వీరు కేవలము నాయాగ్రంథములఁ బరీక్షించుచుండిరేగాని, విద్యా[illegible]ములుగా నుండియుండలేదని తెలియవచ్చుచున్నది.

# ప్రాచీనవిద్యాపీఠములు.

ఏగ్రంథములు దేశవాఙ్మయమునం దుండఁదగినవో, యెట్టివుండఁగూడదో, నిర్ణయించుటకు పూర్వకాలమున నాంధ్రదేశమున సంఘములుండినట్లు కానిపించదు. అట్టి ప్రతిష్ఠాపన యొకటి ఆవశ్యకమా కాదా యను నంశముతో మనకుఁ బనిలేదు, కావ్యకర్తల యూహాలనరికట్టనెంచి, వాఙ్మయస్వరూపమును నిర్ణయించుటకుఁ గొందఱు పండితులు సమర్థులై యుండఁజాలరు. కావ్యములామోదింపఁబడుటయు నపేక్షింపఁబడుటయు ప్రజలచిత్తమునకు వదలివేయవలసి యుండును. అప్పుడే స్వతంత్రవాఙ్మయము బయలు వెడల వీలగును. ఆంధ్రవాఙ్మయమిట్టి స్వాతంత్ర్యమునొందనే వ్యవహరించినది. జనులామోదముఁబడసిన గ్రంథములే మిగిలియున్నవి. తక్కినవి నశించిపోయినవి. ఫ్రెంచివారట్టి సంఘమును స్థాపించుకొనియుండఁగా నింగ్లీషువారట్టిదానిని తమదేశమునఁ బ్రతిష్ఠింపకుండుటకుఁ గారణము స్వాతంత్ర్యాభిలాషయేగాని వేఱొండు కాదు. ఒకవేళనట్టి ప్రతిష్ఠాపన జరిగినను ప్రభుత్వము వారు వెనుకనుండి సహాయము చేయకుండినచో, సంఘముల నిర్ణయముల నెవ్వరుఁ జెవింబెట్టరు. అందుచేత శీఘ్రముగా నవి రూపుమాసి పోవును.

తమిళదేశమునఁ బాండ్యరాజుల కాలములో క్రీస్తునకు పూర్వమునుండియు నిట్టిసంఘములుండెను. రాజులు వానికి సహాయము చేయుచుండిరి. అట్టివానిలో మూఁడు ప్రసిద్ధములై

తెలియున్నవి. ఇఱైయనర్ వ్రాసిన అగప్పొరుల్ అను గ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాసిన నాక్కీరర్ అనునాతఁడీసంఘములలో మొదటిదానిఁగూర్చి యిట్లు చెప్పుచున్నాఁడు. దీనికి అగస్త్యుఁడధ్యక్షుఁడు. శివుఁడు, సుబ్రహ్మణ్యస్వామి, మురింజియూరులోని ముదినాగరాయఁడును గాక ౫౪౯ గురు సభ్యులిందుండిరి. ఈ మహాగ్రంథములను వీరియామోదమునకొఱకు పంపిన కవిశ్రేష్ఠుల సంఖ్య ౪౪౪౯. ఈ సంగము దక్షిణమధురయందుండెను. ఈమధుర సముద్రములో మునిఁగిపోయినదఁట. ౮౯ గురు పాండ్యరాజులీసంఘమునకుఁ బోషకులై యుండిరి. వీరిలో నేడుగురు కవులైయుండిరి. వీరి కాలమున వ్రాయఁబడిన గ్రంథములలో ముఖ్యములు పరిపడల్, ముదునారై, ముదుకురుకు, కలరియావిరై, అనునవి. వీరి కాలమునను అగస్త్యవిరచితమగు వ్యాకరణము వాడుకలో నుండెను.

రెండవసంగముఁగూర్చి పైవ్యాఖ్యానమందే యిట్లున్నది. దీనియందు అగస్త్యుఁడు, తొల్కాప్పియర్, మోసియరు, చిరుపాండరంగన్, వెల్లూర్ కప్పియన్, తువరైక్కోమన్, కీరందైయార్. అనువారును మఱియేఁబదియిద్దఱు విద్వాంసులును సభ్యులుగానుండిరి. వీరు ౩౭౦౦ మంది కవుల కావ్యముల నామోదించిరి. వీరు కవాటపురమను మఱియొక స్థలమునఁగూడియుండిరి. ఇదియును సముద్రములో మునిఁగిపోయినది. దీనిని ౫౯ గురు పాండ్యరాజులు పోషించుచువచ్చిరి. వీరందఱు

విద్వాంసులునై యుండిరి. వీరికాలమున ప్రసిద్ధికివచ్చిన గ్రంథములు కలి, కుఱళ్, వెందలి, మాపురాణమ్, వ్యాలమాలెయ్, భూతపురాణము, ఈశెయ్ నునుక్కమ్, మొదలగునవి.

మూఁడవసంగముంగూర్చి పైగ్రంథకర్తయే యిట్లుచెప్పుచున్నాఁడు. కీరనక్కల్ అన్నయ్యను చిత్తలెమ్, చత్తనార్, కల్లాడర్, కపిలర్, పరనర్, ఉగ్రపాండియన్, మాంగుడిమరునర్, అమవాఁరుగాఁ మొదలు నలువదియొక్కరు సభ్యులైయుండిరి. ౪౪౯ గురు కవులకావ్యముల వీరామోదించిరి. వీరు ఉత్తరమధురయందు కూడియుండిరి. నలువదితొమ్మండ్రు రాజులు వీరిని పోషించుచువచ్చిరి. వారిలో ముగ్గురు స్వయముగా కవులై యుండిరి. ఈసంఘముకాలమున బయలువెడలిన కావ్యములలోఁ బ్రసిద్ధములు, నెడుమ్‌తొగై, కుఱుమ్‌తొగై, నత్రిణై ఐమ్కుఱునూఱు, పదిత్రుప్పత్తు, కుఱుమ్‌కలి, పరిపడల్, కుత్తు, వరి, పెరిశెయ్, శిత్రిశెయ్, ముత్తొల్లాయిరమ్, అగననూఱు, పురాణనూఱు, మొదలగునవి.

పైవ్యాఖ్యాత వ్రాసినదానిలోఁ జాలసందర్భములు కానవచ్చుచున్నవనియు, ౧౨౦౦౦ సం॥ రములయుండియు తమిళ వాఙ్మయము ప్రచారములో నుండియుండెనని వ్యాఖ్యాతల్ చెప్పినమాట విశ్వాసపాత్రము కాదనియు, తమిళచరిత్రకారులు చెప్పుచున్నారు. చారిత్రకశోధనలంబట్టి యీమూఁడుసంగములును క్రీ॥ పూ॥ ౫౦౦ నుండి క్రీ॥ శ॥ ౫౦౦ సంరములవఱకును నుండియున్నట్లు తెలియుచున్నది. ఇం

దీర్ఘకాలమిది సాగుచుండుట మాత్రము గొప్పకాదా? పిన్న మొదటి ౫౦౦ సం॥రములలోను నుత్పన్నమైన గ్రంథములలో తొల్కాప్పియమను మఱియొకటి రెండు గ్రంథములు న తప్ప మఱియెవ్వియును దొరకలేదు. మొదటి రెండు సంగములును నొకదానివెనుక నొకటి వచ్చియున్నట్లు మన మూహింపవచ్చును. ఈరెండును గలసి క్రీ॥ శ॥ ౨౦౦ సం॥రముల వఱకును నుండియుండును. మూఁడవది యెప్పుడు స్థాపితమయ్యెనో తెలియదుగాని యది క్రీ॥ శ॥ ౫౦౦ సం॥రములో నంతమొందెనని చరిత్రకారులు చెప్పుచున్నారు.

నాల్గవ ఐదవ శతాబ్దములమధ్య బౌద్ధజైనులకును, బ్రాహ్మణులకును తగవులారంభమయ్యెను. అంతచేత వజ్రనంది యను నాతఁడు ౪౭౦సం॥రమున బౌద్ధజైనులనుండి విడదీసి బ్రాహ్మణసంఘమునొకదానిని స్థాపించెను.

ఈ బ్రాహ్మణసంఘమునకు పోటీగా నుండిన బౌద్ధజైన సంఘమే మూఁడవద్రావిళసంగముకావచ్చును. ఈ కాలముననే తమిళములో నైదు మహాకావ్యములును, నైదు ఉపకావ్యములు నగాక యింకననేక గ్రంథములు బయలువెడలెను. ఈ మహాకావ్యములలో సిలప్పదిగారమ్, మణిమేఖలై, యనునవి ప్రసిద్ధికెక్కియున్నవి. ఈరెండు గ్రంథముల కథలను నాంధ్రులయందలి కథలను కొంతవఱకుపోలియుండుటచే, వానినిచట సంగ్రహముగా చెప్పుట యుక్తము.

## సిలప్పదిగారమ్.

జంబూద్వీపమున కావేరీముఖద్వారమున పుహార్ అను నామాంతరముగల కావేరీపట్టణముండెను. ఇచట పరదేశములతో సముద్రవర్తకము విస్తారముగా జరుగుచుండెను. ఆ పట్టణమందు ధర్మపరతుడును, భాగ్యవంతుడునగు మానాయకన్ (మహానాయకుండు) అను వైశ్యుడొకండుండెను. ఇతని కికన్నకి (కన్యక) యను లక్షణవతియగు కూతురుండెను. ఆమె సౌందర్యమునకై పేరును గొని యాడబడుచుండెను. ఆపట్టణమందే మాచాత్తువన్ అనుమరియొక వైశ్యుడుండెను. ఇతని పుత్రుండగు కోవిలన్ చాలా రూపసియై, సకలకళల నభ్యసించియుండెను. ఈ యిరువురు వైశ్యులును కన్నికను కోవిలనుకిచ్చి పెండ్లిచేయ నిశ్చయించి యతివైభవముతోఁ గల్యాణమహోత్సవముఁ జరిపి యొక దివ్యహర్మ్యమునందు వారిరువుర కాపురముంచిరి. భార్యాభర్తలిరువురును నన్యోన్యముగ ప్రేమించుకొనుచుఁ జాలకాలమచటనే భోగముల ననుభవించుచుండిరి.

ఆకాలమున కరికాలచోడుఁడా దేశమునకు రాజై యుండెను. అతని యాస్థానము సకలవిద్యలకును, కళలకును నిలయమై యుండెను. అచటికి లావణ్యవతులగు వేశ్యలువచ్చి తమకు నృత్యమునఁ గల నైపుణ్యముఁ జూపుచుండిరి. అట్టివారిలో మాధవియను నొకతె తనచాతుర్యమును ప్రదర్శింప రాజసభకువచ్చెను. అచటికి కోవిలను కూడవచ్చియుండెను. మా

జామెనైపుణ్యమునకు సంతసించి కాసులపేరు బహుమానమి చ్చెను. ఆమె సౌందర్యమునుజూచినకోవిలనుమన స్సామెపైఁ జొత్తెను. ఆమె యూవలకువచ్చినంతనే యాకాసులపేరును తా నుధనమిచ్చి కొని దానినేతిరిగి యామెకు తానును బహుమా నమిచ్చి తనకామెపై గలమోహము నూకేఁడు వ్యక్తపఱచెను. అచిరకాలములో వారిరువురు నొకచోటవసింపసాగిరి. వారికి మణిమేఖలయను నొకకూఁతురు గల్గెను. కోవిలనుకన్నకియొద్ద కుతలచుక వెళ్లుచుండుట మానుకొనెను. తనయొద్దనున్నధన ముతఱిగిపోవుచున్నప్పుడెల్ల భార్యయొద్దకేగి యామెయాభరణ ములనుఁ దీసికొనియమ్మి యాధనమును వ్యయపఱచుచుండెను కన్నకియు నిట్టియపాయము లేక భర్తకు సంతోషముగు కార్యముఁ జేయుటయే కర్తవ్యమనియెంచి యాభరణముల ని చ్చివేయుచుండెను. ఆమెయిచ్చినదంతయు నీతఁడమ్మివేసి వ్య యము చేయుచుండెను. తుదకుకన్నకియొద్ద కాలియందెలు మాత్రము మిగిలియుండెను.

ధనముతగ్గిపోవుకొలఁదిని మాధవికి తనపైప్రేమ తగ్గి పోవునేమో యని కోవిలను అనుమానపడుచుండెను. అను మానమువెనుభూతముగదా పాపము, మాధవి కాతని యెడఁ గల ప్రేమయిసుమంతయు తగ్గకయున్నను, నామెవాక్యము లను, చర్యలను, నాతఁడన్యథాతలంచుచుండెను.

ఒకనాఁడు కావేరీముఖముననింద్రోత్సవము జరుగుచుం డెను. ఆచటికి రాజుమొదలుగా నాపట్టణములోని వారందఱు

పోయిరి. వారితో మాధవియు గన్నకియుఁ నువెళ్లిరి. ప్రియు డుతనపై ప్రేమ తగ్గుచున్నదేమోయని సందేహించుచున్న మాధవియన్యాపదేశముగా కోవిలనుద్దేశించి యొకపాటపాడెను. ఆపాటను విన్న కోవిలుడు మాధవిమతి యొకనిని ప్రేమించుచున్నదని యనుకొని, యామెతో మాట్లాడకుండ నచ్చోటువిడిచి పోయెను.. మాధవి కాతఁడు వెడలిపోవుటకుఁ గారణముగోచరముకాలేదు.

అచట, కన్నకి మిక్కిలి విచారముతో నభర్త యెప్పటికైన రాఁగలఁడాయని యెదురుచూచుచు నాతని నే నమ్మికొని యుండెను. ఇంతలో మాధవిపై మనసు విఱిగిపోయిన కోవిలుడు గూడవచ్చెను. ఆమె పరమానందభరితురాలై యాతని నాదరించెను. కోవిలుడు పశ్చాత్తప్తుఁడై యామెపై ప్రేమగునిమడిక కన్నీరువిడిచెను. ధనమంతయు వ్యయపఱచినాఁడే ఇఁకపై వారుజీవయాత్రచేయుటయెట్లు? అతివైభవముతో వసించియుండిన కావేరీపట్టణమున దరిద్రుడై తలయెత్తుకొని తిరుగుటెట్లు? కావున నాయూరువిడిచి భార్యకాలియందెలనమ్మి మధురయందు వర్తకము చేసికొని ధనవంతుఁడైన పిదప తిరిగిరాదలంచి, యాతడు కన్నకితోఁగూడ నెవ్వరికిని దెలియకుండ నర్ధరాత్రమప్పుడు పయనమయ్యెను.

త్రోవలో వారనేక కష్టముల బడిరి. నిర్జనారణ్యములందున, కటికశిలల మీఁదను, నడచుచుఁ గన్నకి తన ప్రియభర్తకు దెలియకుండ నననరించుచుండెను. ఇట్లు వారు త్రోవలో

సభయంతఁగుమిగూడిరి. అప్పుడుకన్నకి పట్టరానికోపమున "ఓయీ నీవు రాజవా? నీమతియెచ్చటికిఁబోయినది. నాభ దొంగిలించెనని నీవనుకొనినయెడ నీరాణిదా? అదినాది గోదానిజతయందె. నీభార్యయందెను దెప్పించుము. నాయ దెవరత్నములతో నిండియున్నది. కావలసిన దెప్పించిచూడు ము." అనగా రాజు తనభార్యయాభరణమునందు మంచిముత్య ములుండుటఁ దెలిసినవాఁడు కావున కన్నకిమాటలనుఁబరీక్షింప నెంచి, స్వర్ణకారుఁడిచ్చినయందెను బద్దలుకొట్టఁగా నందుం డి దేదీప్యమానములై వెలుగుచుండిన రత్నములు బయలువె లెను. రాజు పశ్చాత్తాపమునొందఁ జొచ్చి యామెచేత క్షమా పణ వేఁడికొనుచుండ, కన్నకి యుగ్రురాలై మధురయగ్ని జ్వాలల కాహుతియగుఁ గాకయని శపించి మఱలిపోయెను. రాజామెపాదములపైఁబడి శాపమునుపసంహరింపుమని వేఁ కొనసాగెను. కాని శోకాగ్నితప్తయగు నాపతివ్రతమాట తిరుగుండునా? చూచుచుండఁగనే మధురయందు హుతాశన కీలలు వ్యాపించి సర్వమును నాశనముచేయఁజొచ్చెను. మధు రాపురాధిదేవతయామెకు సాక్షాత్కరించి కోపమునుపశమిం పఁజేయుమనియు, నామెభర్త పూర్వజన్మమునఁ జేసినకర్మ ఫలమునను భవించెనేగాని వేఱుకాదనియు, మిగిలియున్న ట్టణమునైననుఁ గాపాడవలయుననియు వేఁడగా నట్లేకానిమ్మ తనయందె నాదుర్గయాలయము మొలకొట్టిపాఱవైచి, విచా ముతో వైగైనదీతీరముంబట్టి యొకకొండయెక్కి భర్తనిష్ఠ

యున పదునాల్గవదినమున దాను స్వర్గస్థురాలయ్యెను.

కోవిలునితల్లి గుండెపగిలి మృతినొందెను. ఆతనితండ్రి సంసారము త్యజించి బౌద్ధభిక్షువయ్యెను. కన్నకితండ్రి తనసర్వస్వమును బీదలకు పంచిపెట్టి యాజీవకసన్యాసులలోఁగలసిపోయెను. ఈవృత్తాంతములను వినమాధవియు భిక్షుకియై తనకుమార్తెయగు మణిమేఖలను బౌద్ధులయాశ్రమమునఁ బ్రవేశపెట్టెను.

కోవిలునకు శిరశ్ఛేదనమయిన నాఁటినుండియుఁ బాండ్యరాజ్యమున ననావృష్టియు, కఱవును, సంభవించెను. తరువాత రాజ్యమునకు వచ్చిన పాండ్యుఁడు కన్నకిశాపమువలననే యీయుపద్రవములు సంభవించెనని యెంచి యామెపేర కట్టించిన దేవాలయమునందు వేయిమంది స్వర్ణకారులను బలిచేయించి తనరాజ్యమున నెల్లయెడల నామెకుకోవెలలుకట్టించి, యేఁటేఁట నామెయుత్సవముల జరుపుచుండెను.

చేరరాజగు చెంగుట్టువన్ అనునాతఁడు గంగాతీరమునకు దండెత్తిపోయి, మగధరాజువలన హిమాలయములనుండి స్ఫటికశిలలం దెప్పించి, కన్నకి రూపముతోనొక విగ్రహము చెక్కించి నానాదేశరాజుల నాహ్వానముచేసి పెద్దయుత్సవముతో నామెకొఱకేర్పఱచిన యాలయమునందావిగ్రహమును బ్రతిష్ఠించెను.

## మణిమేగలై

'మణిమేగలై' యను గ్రంథమున, సిలప్పదిగారములోనికథ తరువాయి చెప్పబడినది. మాధవియను వేశ్య భిక్షుణియై జీవించుచుఁ దనకూతునిఁ గూడ నాబౌద్ధారామమునందే యుంచి పెంచుచుండెనని మనకు తెలిపియున్నది. మణిమేఖల నానాటికిని పెరుగుచు నవలావణ్యముచే పౌరుల నేత్రములకానందము కలిగించుచుండెను. మాధవి తల్లి పేరు చిత్రాపతి. ఈమె తన మనుమరాలి నాగ్రామపు రాజపుత్రుండగు నుదయకుమారున కప్పగింపవలెనని తలంచుచుండి తనకూతురు విరక్తిమార్గమునుండి యట్టి మార్గముననే మనుమరాలిని పెంచుచుండుట కిష్టపడక తిరిగి వారిరువురిని వేశ్యావృత్తికిఁ దిగవలయునని తన పరిచారిక యగు వసంతమాలనామెయొద్ద కంపెను. ఆమెయు చిత్రాపతి సందేశము మాధవికి తెలిపింప నామె తన పూర్వవృత్తాంతముఁ దెలిపి దుఃఖాంతమగు నీజీవనముపైనను, నశ్వరమగు దేహముపైనను, మోహము కలిగియుండుట కంటె నవివేకముండదని యామెకు బోధచేసి పంపివేసెను. ఈ కథను దగ్గఱనే యుండి వినుచుండిన మణిమేఖల కన్నీరు కార్చసాగెను. ఆకన్నీరపుడు తాను గ్రుచ్చుచుండిన పూలదండపై పడుటఁ జూచి మాధవి కుమార్తెతో, "అమ్మా, కన్నీటిచే కలుషితమైన యాపూలదండ యర్చనకుపనికిరాదు. వేఱెపుష్పములనుఁ దెచ్చి మాలకట్టుము," అనెను. మణిమేఖల సఖియగు సుతమతి, "అమ్మా, ఈమె సౌందర్యవతి. ఈమె శంపాతివన

మునకుఁగాని, కణేరవనమునకుగాని పోయినచో చోళరాజకుమారుని కంటఁబడకతప్పదు. ఇది యనుచితముగదా. అయినను ఉపవనమున కేగినచో నెట్టియపాయమునుండదు. ఈమెతో నేనుకూడ పోయెదను" అనుమాటలను మాధవి యొప్పుకొనన నామె మణిమేఖలతో నుపవనమున కేగనువారందు పూవులుకోయుచుండఁగా రాజవీథియందు పెద్దకలకలము వినవచ్చెను. "తొలఁగిపొండు, తొలఁగిపొండు, పట్టపుటేనుఁగువిడిపోయి రాజవీథులందిరుగాడుచున్నది" యనుధ్వనులు వినంబడెను. ఉదయకుమారుఁడు వెంటనే బయలుదేరివచ్చి యాగజమును పట్టుకొని మావటివానికప్పగించి తనయశ్వముపై పోవుచుండగా నొకమేడలో నొకవేశ్యయు నామె ప్రియుడును విచారముఁ జూపు మొగములతో నాతని కగపడిరి. వారివిచారహేతువు నారయ, వారు, "ఇప్పుడే యీమార్గమున మణిమేఖల యుపవనములోనికి మందగమనముతో నేగియుండుటఁ జూచి పుష్పకోమలియగు నామె సన్యాసము బౌద్ధమతమున గ్రహింపవలయునే యనియు, నామె తల్లిదండ్రులవృత్తాంతముఁదలఁచియు చింతిల్లుచున్నామ" నిరి.

ఈపలుకులు విన్న రాజకుమారుఁడు మణిమేఖలం జేపట్టనెంచి యానందముతో నుపవనముఁ జొచ్చెను. తనపైనుదయకుమారుఁడు మరులు గొనియుండెనని వినియున్న మణిమేఖల యేమియుఁదోఁచక యచటియంతర్గృహముఁ జొచ్చెను. సుతమతి రాజకుమారునెదుట నిలిచి యాతనికి సదుపదేశము

లఁజేసి యచటినుండి మఱల్పఁ బ్రయత్నించుచుండ మణిమేఖల యొకగవాక్షము నొద్ద నాతని కంటఁబడెను. ఆమెసౌందర్యమును దలంచుకొనుచు నాతఁడెట్లైన నామెను దర్శనము చేసికొనఁదలఁచియున్నప్పటికి మఱియు నొక గృహమునకేగి యామెను తనయొద్ద కెట్లు రప్పింపఁగలనాయని యాలోచించుకొనుచుండెను.

ఆసమయమున 'మణిమేఖల' యనుదేవత యాయుపవనసమీపముననే సంచరించుచు బుద్ధవిగ్రహమునకు ప్రదక్షిణముచేయుచుండెను. ఈదేవతపేరే మాధవికుమార్తెకును పెట్టఁబడెను. ఆదేవత సుతమతివలన సర్వవృత్తాంతము నెఱింగి, యుదయకుమారుని కలలోఁగనఁబడి తానుచేపట్టిన కార్యమధర్మమనియు, ఇట్టిమార్గమవలంబించినచో వంశనాశ మగుననియు భయపెట్టి నిద్రించుచున్న మణిమేఖలను దూరముగ సముద్రతీరముననొక బుద్ధవిగ్రహమునకు సమీపమున విడిచిపెట్టి, సుతమతితో భయపడవలదని చెప్పి మణిమేఖలయున్న తావామె కెఱింగించి, యామెయచిరకాలముననే యాపట్టణమునకువచ్చి కొన్నియద్భుతకార్యములఁ జేయునని చెప్పి యంతర్ధానము నొందెను.

మణిమేఖల సముద్రతీరమున సూర్యకిరణములచే ప్రబోధితయై నలుదిక్కులఁజూచి సుతమతింగానక యీమాయ యేమని యబ్బురపడసాగెను. అంతకంతకును నెండ చుఱుకుమనుచుండుటచే నామె యచ్చోటుకదలి యిసుకతిన్నె

పెనడచును తుదకుబుద్ధవిగ్రహమునుజూచి దానికిపూజలుసలుపుచుండ నచటికి బ్రహ్మధర్ముఁడను నొకయోగివచ్చి యామెవలన సర్వవృత్తాంతము నెఱిఁగి, దానికంతటికిని పూర్వజన్మమునందుచేసిన నిజకర్మమే కారణమనియామెకు బోధించి యామెకొకభిక్షాపాత్రనిచ్చి దానియందలి యన్నమక్షయమగుచుండుననియు దానిఁ జేతనుంచికొని క్షుధార్తులయాఁకలిదీర్చుచు ధర్మనిరతమైయుండవలయుననియు తానుపదేశించిన యొకమంత్రమును జపించినచో నెట్టియాఁకలియునుండబోదనియు జెప్పి వెడలిపోయెను. మణిమేఖలబుద్ధునిపూజించుటవలనఁ దనపూర్వజన్మములఁగూర్చి సర్వమును దెలిసికొనఁగలిగెను. ఉదయకుమారుఁడును దానును పూర్వజన్మమున భార్యాభర్తలై యుండిరి. భర్తపాముకఱచి మృతినొందఁగా భార్యయుసహగమనముచేసెను. వారేతిరిగి యిట్టిజన్మమునెత్తిరి. పూర్వజన్మమున తనకుపదేశముచేసినయాతఁడే యుదయకుమారుని తండ్రియై పుట్టెను.

మణిమేఖల క్రమక్రమముగా కావేరీపట్టణముచేరెను. అప్పుడాదేశమున కాటకము పట్టెను. తిండిలేకజనులు మలమలమాడుచుండిరి. వారికష్టములఁజూచి తనభిక్షాపాత్రసహాయమున నెంతమందికైనను నాహారమును పెట్టుచుండెను. ఆమాహాత్మ్యమునువిని రాజుమణిమేఖలంజేరి నాప్రజలను పోషించుచున్న నీకేమికావలయునని యడుగ తనకెద్దియునక్కఱలేదనియు, రాజ్యములోని కారాగృహములనుండి ఖైదీలనువదలి

పెట్టి యాగృహముల ననాథజనులకిచ్చియు, కొన్నింటిని ధర్మ సత్రములుగా మార్చియు. కొన్నిటిని వైద్యశాలలుగా మార్చి యుఁ, బుణ్యము సంపాదింపుమని చెప్ప నాతఁడు నటులే చేసెను. మణిమేఖలయు నావద్దారామముఁ జేరి యచట కయచండికయ ను నొక వృద్ధురాలిగోరిక ననుసరించి యామెరోగమును మాన్పఁగా నామెయుదన్ను బెండ్లియాడిన భర్తను వెదకుటకై బయలుదేరు మణిమేఖలకు తనయిచ్ఛవచ్చిన రూపమును మార్చుకొన గలశక్తి నొసంగి యచ్చోటు వదలిపోయెను.

ఉదయకుమారునకు మణిమేఖలపై మోహము నానా టికిని హెచ్చసాగెను. ముసలియవ్వయగు చిత్రాపతియు మనుమరాలినెట్లయిన రాజకుమారునొద్దకుఁ జేర్ప నిశ్చయించి యాతనితో మణిమేఖల భిక్షుణివేషమున మఠమునందున్నదని యు, నామెను రథముపైఁ బెట్టి తీసికొనిపొమ్మనియుఁ జెప్ప నాతఁ డును నట్లే చేయుమనని మఠమునకేఁగగా మణిమేఖల యాత డు చేయు కార్యము మంచిది కాదని యెంత చెప్పినను విన కుండుటఁ జూచి వరప్రభావమున నామె కయచండిక రూప మును తటాలున దాల్చెను. ఇంతలోనే యచటికి కయచండి భర్తయును భార్యను వెదకికొనుచు వచ్చుట సంభవించెను. ఆతఁడు భార్యం జేరఁజని యామె రోగము పోయినదని ప్రశ్ని ప కయచండిక రూపమునందున్న మణిమేఖల యాతని మాటల వినక యుదయకుమారునితోఁ దగ్గఱనున్న వృద్ధురాలింజూ యందఱును నామెవలె కృశింపవలసినదేయనియు, నిహలో

సాలభంజికమాటలను నిద్రలోవిని మణిమేఖలయడుగు పడిలేచి పూర్వజన్మమునంగన భర్తయైయుండిన యుదయకుమారునిశవముం గాంచి పలువిధముల విలపింపఁదొడంగెను కాని సాలభంజికయామెనోదార్చి యుదయకుమారుఁడిక ముందు మంచిజన్మమునందె యనుజన్మరాహిత్యముఁబొందఁ గలమార్గమును బట్టి చరింపఁగలఁడను మాటలనువిని కొంతయూ రడిల్లెను.

తెల్లవారుసరికి నాస్థలమునకు వచ్చినవారు రాజకుమారుని కళేబరముగాంచి, మణిమేఖలవలన నాతఁడు గతించిన విధమును తెలిసికొని రాజునకు నివేదించిరి. రాజును "నాకుమారునివంటి శ్రేష్ఠులకై నేనే మరణదండన విధింపవలసినది. ఆపని కాంచననే చేసినాఁడు. సగేతలేని కళేబరమునకు దహనసంస్కారములఁ జేసి మణిమేఖలను కారాగృహమునందుంచుఁడ"ని యాజ్ఞయిచ్చెను.

రాజభార్యయగు రాజమహాదేవి పుత్రశోకము భరింపలేక, యుదయకుమారునికి మృత్యుహేతువగు మణిమేఖల నెట్టులైనను అవమానింపనెంచి యొకనాఁడు రాజుతో భక్తురాలగు నామెను కారాగృహమునందుంచుట యనుచితమని చెప్పి యామెను తన యంతఃపురములోనికిఁ దెప్పించుకొని, యొక త్రాగుబోతునకు ధనమిచ్చి మణిమేఖలకును మత్తుమందు పెట్టి యామెను చెఱపట్టుమనిపంపెను. మణిమేఖలకు మందువలన మత్తెక్క లేదు. ఆత్రాగుబోతు ఆమెను చేరినప్పుడామె వానికం

తో నొకటి సంబంధించిన కథలను దెలుపుచున్నవి. దక్షిణదేశమునుండి బయలువెడలిన యీకథలయందు కొన్నిమార్పులు కలుగుచుండగా దరువాతికాలమున నాగ్రంథమును రచించినవారు తమకు తెలిసిన కథనే కన్యకాపురాణములోని కెక్కించియుందురు.

'మణిమేఖల' కథను సంగ్రహముగా వ్రాసియుంటిమి గాని యాయాపాత్రముల పూర్వజన్మకథలతో నది చాల చిక్కుగనేయుండును. పింగళిసూరనరచించిన కళాపూర్ణోదయమునకిదియే మూలాధారమైయుండును. పేళ్లయందును, కథాసాదృశ్యములయందును, కథయొక్క చిక్కుదనమునందును నిట్లనేకవిధముల నీరెండుకథలకును ఛాయలు గనబడుచున్నవి. సిలప్పదిగారమునకువలెనే మణిమేఖలకును నా దక్షిణదేశమున వ్యాప్తియుండవచ్చును. అది తెలుగుదేశమునకు గూడ నంటియుండవచ్చును. జనులయందుగల వాడుకలో నుండిన యట్టికథనాధారముచేసికొనియే సూరనకవి తనసామర్థ్యము జూపి, చిన్నెలువన్నెలు కల్పించి యతిమనోహరముగా కళాపూర్ణోదయగ్రంథమును రచించియుండెను.

మూడవతామిళసంగ మంతరించినతరువాత గూడ గొంతకాలమువఱకును మఱికొన్ని సంగములు బయలువెడలియుండె ననుటకు నిదర్శనములున్నవి. కాని బౌద్ధులకును బ్రాహ్మణులకును స్పర్ధకలుగ నెచ్చుగుకొలది బౌద్ధమతము తగ్గుచు బ్రాహ్మణమతము వృద్ధినొందుచుండెను. బౌద్ధమతముతోడనే సంగములును శీర్ణించిపోయినవి.

శ్రీరస్తు.

# ప్రాచీనవిద్యాపీఠములు.

## వేంగి

వేంగి యనుపదము వ్యాఘ్రశబ్దభవమనియు, పెద్దపులులు సంచరించు మహారణ్యప్రదేశమగుటచే వేంగిదేశమను నామము గలిగినదనియు కొందఱనుచున్నారు. "దగ్ధమగు" అను నర్థముగల "వేం" ధాతువునుండి యిదిపుట్టినదనియు [illegible] జనులు బెట్టుటచే దగ్ధరాష్ట్రమను నర్థముగల వేంగియను పద మేర్పడినదనియు మఱికొందఱనుచున్నారు. వేగు అనగా ఉదయించు అను నర్థముగల ధాతువునుండి వేంగిశబ్దము పుట్టినదనియు జపానుదేశమునకు సూర్యోదయదేశమను నామమున్నట్లే దీనికిని నాపేరు గలిగినదనియు, మిక్కిలి బాగుగానున్న రాజ్యమగుటచే దీనికానామము కలిగియున్నదనియు నింక కొందఱనుచున్నారు. మఱికొందఱీదేశమున వేగులవాండ్రెక్కువగానుండుటచే నాపేరు గలిగినదని చెప్పుచున్నారు. శబ్దముల వ్యుత్పత్తినిబట్టి చారిత్రకాంశముల నిర్ణయింపఁబూనుట సాహసము. క్రీస్తుపూర్వమునుండియు వేంగిరాష్ట్రము సుప్రసిద్ధమై యుండఁగా నిది యెన్నడు వ్యాఘ్రముల కాలవాలమైయుండెనో, యెవరు

దీనిని తగులఁబెట్టిరో, వేఁగులనాఁడీదేశమునే యెక్కువగా నేలుచుండవలెనో యెప్పుడుండిరో మొదలగువిషయములు తెలిసినఁగాని యిట్టి శబ్దశాస్త్రపాండిత్యముపై నాధారపడుట కొంతవినోదముగా నుండవచ్చునుగాని, సత్యనిర్ణయమునకు తోడ్పడదు.

రాజమహేంద్రవరము వేఁగిదేశమునకు చాళుక్యుల కాలములో రాజధానియయ్యెఁగాని, యాంధ్రులకాలమున ధాన్యకటకమును వేఁగియు రాజధానులుగా నుండెను. కృష్ణాజిల్లాలోని యేలూరునకు సమీపములోనున్న పెదవేఁగి యను గ్రామమే పూర్వకాలపు వేంగి యని యనేకులు తలఁచుచున్నారు. ఈగ్రామమునకు సమీపముననే గుంటుపల్లియు బౌద్ధదేవాలయములును పాడువడిన కొన్ని కట్టడములును గానవచ్చుచున్నవి. ఇచట నప్పుడప్పుడు భూమిలోనుండి తామ్రశాసనములును, నాణెములును బయలుపడుచుండును. ఇప్పుడిది యొక కుగ్రామముగా మారినను బూర్వకాలమున నావిషయమున గొప్పపట్టణమొకటి యుండియుండును.

హ్యూనత్సాంగిచటికి వచ్చినప్పుడు భూమి సారవంతమై సస్యసమృద్ధమై యుండెను. ధాన్యకటకమువలె నదియు నుష్ణప్రదేశమై యుండెను. జనులు తొందరపాటుగలవారై యుండిరి. ఇచటివారిభాష మధ్యదేశమువారి భాషకంటె భిన్నముగా నుండెను. ఆభాషయందలి వాక్యములలోని పదములకూర్పుకూడ భిన్నమే. ఇచ్చటివా రుపయోగించు నక్షరములు

గూడ మధ్యదేశమువా రుపయోగించునవి కావు. ఇక్కడ నిరువది సంఘారామములును మూఁడువేలమంది భిక్షువులు నుండిరి. ముప్పది బ్రాహ్మణదేవాలయములును నిచట నుండెను. బ్రాహ్మణమతస్థులు బౌద్ధులతోఁ గలసి వర్తించుచుండిరి.

వేఁగి కనతిదూరముననే యొక సంఘారామముండెను. ఇందంతస్థులుగల హర్మ్యములును, సొగసుగఁ జెక్కఁబడిన వగు స్తంభములచే నలంకరింపఁబడిన యుత్తరగృహములు నుండెను. ఇచటి బుద్ధవిగ్రహము నా శిల్పి తన నేర్పంతయుఁ జూపి కళలూరునట్లు చెక్కియున్నాఁడు. ఈయారామము మోఁల నూఱడుగుల యెత్తుగల యొక స్తూపమున్నది. దీనిని, విగ్రహములను గూడ నచలుఁడను నర్హతుఁడు నిర్మించెను.

సంఘారామమునకు దగ్గఱగనే యున్న మఱియొక స్తూపము నశోకరాజు కట్టించెను. పూర్వకాలమున తథాగతుఁ డిచట వాసముచేసి యనేకులను బౌద్ధమతములోనికి త్రిప్పెను.

ఈసంఘారామమునకు దగ్గఱగనే యొకశిలాస్తూపముండెను. ఇచట జి బోధిసత్త్వుఁడు "న్యాయద్వారతారకశాస్త్ర" మను పేర హేతువిద్యాశాస్త్రమును రచించెను. బుద్ధనిర్యాణానంతర మీబోధిసత్త్వుఁ డామతము నవలంబించి శ్రమణకుఁడై, కాషాయవస్త్రము లంగీకరించి, మిగుల జ్ఞానము సంపాదించెను. ఈతఁడు మహాతపస్సంపన్నుఁడై నిరాధారముగ నున్న లోకముపైఁ గరుణగలిగి బౌద్ధధర్మముల వ్యాపింపఁజే

క కాదంబరి, యనుగ్రంథములను వ్రాసిన మొదటినాగవర్మ తాతతండ్రి వేఁగిమండలములోని వేఁగిపల్లెలో నుండెను.

జైనమత మీదేశమున వ్యాపించుచుండఁగా, బ్రాహ్మణమత మడఁగుటను భయముచేతనో, జైనవాఙ్మయాభివృద్ధిఁజూచి యాంధ్రభాషయందు బ్రాహ్మణమతగ్రంథముల రచింపవలయునను నుద్దేశముతో డనో, చాళుక్యరాజు లాంధ్రమున గ్రంథముల వ్రాయింపఁబ్రయత్నములు సలుపుచుండి యుండవచ్చును. కాని, యట్టి గట్టిప్రయత్నము రాజమహేంద్రవరమున పదునొకండవశతాబ్దమున రాజరాజునాస్థానమున గాని జరిగియుండలేదు.



శ్రీరస్తు.

# ప్రాచీన విద్యాపీఠములు.

## ఉద్దండపురము.

ఉద్దండపురమునకు 'ఓదతపురి' యను నామాంతరము కలదు. ఇది బీహారురాష్ట్రములో నున్నది. నాలందావిశ్వవిద్యాలయము నాటికిని వర్ధిల్లుచుండగా నీస్థలమున నొక విద్యాపీఠము బయలువెడలెను. సుమారు ౭౩౦ సం॥రమున వంగదేశమునకు రాజైన గోపాలుడను మఱియొక పేరుగల లోకపాలుడను వాడు బౌద్ధారామమును నిర్మాణముగావించెనని తెలియుచున్నది. ఇచట బ్రాహ్మణమతమునకును, బౌద్ధమతమునకును సంబంధించిన యనేకగ్రంథములుగల గొప్ప పుస్తకభాండారముండెను. మంచిపుస్తకభాండారము విశ్వవిద్యాలయమునందు లేదని కొందరు వ్రాసియున్నారు. కానేమి? ఇంత గతించిపోయిన గొప్పయాచార్యుల విజ్ఞానసారము నేలకొరిగియుండదుగదా. ఇచటనేగదా పూర్వపువారికిని ప్రస్తుతపువారికిని సంపర్కము కలిగి జ్ఞానవేదపోకడ లోకమున సాగుచుండును? కావుననే పూర్వకాలమున పుస్తకములనిన ప్రాణప్రదములుగా కాపాడుకొనుచుండిరి. వానిని

వ్రాయుట మిక్కిలి కష్టతరముగా నుండెను. "భగ్నపృష్ఠకటిగ్రీవః। స్తబ్ధదృష్టిరధోముఖమ్। కష్టేనలిఖితంగ్రంథం।యత్నేనపరిపాలయేత్॥" అని ప్రతిని వ్రాసినవాఁడు బ్రతిమాలుకొనుచుండును. మంచి వ్రాతకాండ్రను పెట్టి యుత్కృష్టగ్రంథములను ధనమిచ్చి ధనికులు వ్రాయించుకొనుచుండిరి. కావుననే చిత్తగ్రంథము లెన్నిపుట్టినను నవి మిగులక వానిలో మంచివని జనులంగీకరించినవానినే రక్షించుచుండుటచే గ్రంథములపారిశుద్ధ్యమును నిర్ణయించుటకు వేఱేప్రయత్నము లక్కఱలేకుండెను. ఇట్టి ప్రశస్తగ్రంథముల సముదాయ మాయాగ్రామములయందలి ధనికులయిండ్లలో నుండియుండె. తమకగ్ర ఆలేని గ్రంథములకొఱకెందఱు గాత్రికులుమూలకుం బంపి వ్రాయించుకొనుచుండిరి. సుశిక్షిత గ్రంథరాజములనిజాగ్రత్తతో కాపాడంబడుచుండెను. దేశమందు రాజులు వానిని వివిధములగు గ్రంథములను నొకకేంద్రస్థానమునకుం జేర్చుచుండెను. ఈరీతిగా పుస్తకభాండారస్థాపనము పరంపరగా జరుగుచునే యుండెను. ముఖ్యముగా నారామములయందు మతగ్రంథములన్నియు చేరుచుండెను. వానిని వ్రాసికొని తమదేశమున నార్యవిజ్ఞానము వ్యాపింపఁజేయుటకే దూరదేశములను నీయుపవిద్యాసుముల, మతధర్మములఁ దెలిసికొనవచ్చినవారు మన దేశమునకనేకులు వచ్చుచుండిరి. చీనాయాత్రికులగు ఫాహియాను, హ్యూయెన్త్సాంగు, ఇత్సింగు మొదలగువారు బౌద్ధగ్రంథములను సంవత్సరములకొలఁదియుం గష్టపడి వ్రాసికొని తమదే

మునకుఁ దీసికొనిపోవుచుండిరి. ముద్రణాయంత్రములు వచ్చిన నాఁటినుండియుఁ బూర్వగ్రంథాలయములు నశించిపోయినవి. పుస్తకములు చెదపురుగులపాలైపోయినవి.

నాలందా మొదలగు విహారములందువలె నుద్దండపురమునందుండిన గ్రంథభాండారమునందును నమూల్యములగు గ్రంథములు చేరియుండెను. వీనిని చదువుకొనుటకును, ప్రతులు వ్రాసికొనుటకును విద్యార్థులు వచ్చి చేరుచుండిరి. వీరిచట శాస్త్రార్థవిచారము చేయుచుఁ గొంత కాలముండుచు వచ్చిరి. ఇట్లు వీరు సంపాదించిన జ్ఞానముతోడను, గ్రంథములతోడను తమదేశములకేగి యార్యవిజ్ఞానమును వ్యాపింపఁజేయుచుండిరి.

౧౧౯౭ సం॥రమున మహమ్మదీయులీవిహారముపైఁబడి బౌద్ధులనుచంపి, సర్వమును నాశనముచేసి, యిచటి గ్రంథసంచయము నంతటిని దగులఁబెట్టిరఁట! అప్పుడు చేతికిచిక్కిన గ్రంథములను సంగ్రహించుకొని బ్రతికియున్న బౌద్ధభిక్షువులు విక్రమశిలానగరముఁ జేరికొనిరి.

టిబేటుదేశమునందలి విద్యాపీఠములలో నతిప్రసిద్ధిఁ గాంచిన శాక్యనగరమునందలి బౌద్ధవిహారమీయుద్దండపుర విద్యాపీఠము ననుసరించినదే. ఇచట ౧౨౦౨ సం॥రమున వాదధర్మ్మల నిర్ణయించుట కొకగొప్ప పరిషత్తు కూడెను.

---

శ్రీరస్తు

# ప్రాచీనవిద్యాపీఠములు.

---

## విక్రమశిల

---

ఉద్దండపురవిద్యాపీఠమును నెలకొల్పిన గోపాలుని పౌత్రుఁడగు ధర్మపాలుఁడు విక్రమశిలయనుగా మఱియొక విద్యాపీఠమును తొమ్మిదవశతాబ్దమున స్థాపించెను. ఈవిహారము బీహారురాష్ట్రములోని భాగల్పురమునకు మైళ్ళ దూరముననున్న పాతరఘాటయని కొందఱనుచున్నారు. ఈవిహారము చంపానగరమునకుఁ దగ్గఱగా నుండెను. ఇది తొమ్మిదవ శతాబ్దమున స్థాపింపఁబడుటచే చంపానగరమున కేగియుండిన హూయుత్సాంగు దీనిని గూర్చి యేమియు ముచ్చటించియుండలేదు. చోరకవి తాను వ్రాసిన "చౌరపంచాశిక" యను గ్రంథమున దీనిని శివాసంగమ మను పేరున వ్యవహరించియున్నాఁడు. ఇచట పాడుపడిన బౌద్ధారామములును, స్తూపములును, విగ్రహములును బయలువెడలుచున్నవి. ఈస్థలమునందు దొరకిన బుద్ధ, మైత్రేయ, అవలోకితేశ్వరుల విగ్రహములు ముద్దులు మూటగట్టుచు నాలందాయందలి శిల్పకౌశల్యమును బురణించుచున్నవి.

శ్రీరస్తు.

# ప్రాచీనవిద్యాపీఠములు.

## రాజమహేంద్రవరము.

దక్షిణహిందూదేశచరిత్రయందు పదునొకండవశతాబ్దము చాలముఖ్యమైనది. అంతకుపూర్వము రాజ్యస్థాపనములతోడను, వానినిమిత్తమై ఘటిల్లిన యుద్ధములతోడను, రాజ్యవిప్లవములతోడను దేశము క్షోభమొందుచుండెను. ఈశతాబ్దమంతమొందుచు వచ్చునప్పటికి తగ్గి యుద్ధములు, సంతుష్టియు నారంభమయ్యెను. ఈమధ్యకాలమున నన్నగా క్రీ॥శ॥ ౯౮౫ సం॥ర మునుండి ౧౦౭౦ సం॥రమునఱకు నొకశతాబ్దము దేశమందు శాంతి నెలకొనియుండెను. ఈకాలమున చిన్నచిన్న సంస్థానములును, చిన్నచిన్నరాజులును, దమలోదాము పోరాడుచుండుట యంతరించినది. చిన్నసంస్థానములన్నియు పెద్దరాజ్యములలో లీనములైపోయినవి. అతివిస్తారములును, నత్యంతవైభవోపేతములునగు సామ్రాజ్యములు కొన్ని స్థిరపడినవి. ఇట్లేర్పడినచోళ, చాళుక్య, కళింగసామ్రాజ్యములు మూడును దక్షిణదేశమును బంచుకొని యత్యుచ్ఛదశలోనికి వచ్చెను. చోళరాజగు రాజరాజు విక్రమమున నెంతప్రసిద్ధి

నక్కెనో, దూరాలోచనయందుననంత ప్రసిద్ధికెక్కియుండెను. తానెన్నియుద్ధములు చేసి విజయముఁ గాంచినను, దేశమందెల్లను శాంతి నెలకొనియుండిననట్టి జయములవలన నెట్టి ప్రయోజనమును నుండఁబోదనియు, సామ్రాజ్యస్థాపనమునకు మైత్రిముఖ్యముగాని శత్రుత్వము సర్వదా భేదహేతువగుననియుఁ దలంచి చాళుక్య కళింగ రాజ్యములతో నాతఁడు సంబంధబాంధవ్యములు జేయనారంభించెను. ఈతని బుద్ధికుశలతవలనను, చాళుక్య కళింగరాజ్యములును శాంతిఁ గోరుట చేతను, నీమూఁడును నొక్కటయి దక్షిణహిందూదేశమంతయు నొక్కని యేలుబడిలోనికి వచ్చునేమోయను నాశపుట్టెను.

వాణిజ్యము, కృషి, పరిశ్రమము, కళలు నభివృద్ధి నొందుటకు శాంతిపరిస్థితులెట్లు కావలెనో, వాఙ్మయాభివృద్ధికిని నట్లే కావలయును. కావుననే తక్కినవానితోఁ బాటీ కాలమున వాఙ్మయమున్నతదశలను వృద్ధినొందుచుండెను. ద్వేషపూరితములగు మతములు వ్యాప్తిఁ గొందక, యందఱును పరమతసహనము గలిగి వర్తించుచుండిరి. రాజులు ప్రజాభివృద్ధి మొదల సుముఖులై యుండుటయేఁ గాక తాము కావ్యగీతప్రియులై యుండిరి. పండితులును విద్వాంసులును గవులును రాజులు మొదలఁ బహుమతులు వడయసాగిరి. తమిళ తెలుఁగు దేశములందు బ్రాహ్మణమతము నాటుకొనెను. తమిళదేశమునందు సంస్కృతగ్రంథములకు భాషాంతరీకరణము బయలువెడలెను. కంబ రామాయణమును వ్రాసెను. కాంచి స్కాందమును పది[illegible]

కన్నడదేశమునఁ గర్ణాటకవాఙ్మయ ముచ్ఛ్రదశకుఁ గివచ్చెను. ఇచట నతిమనోహరము లగు స్వతంత్రగ్రంథములు బయలు వెడలెను. రత్నత్రయమని పేరుగాంచినవారిలో పంప విక్రమార్జునవిజయమను నామాంతరముగల భారతమును, నాదితీర్థంకరుఁడయిన పురుదేవుని చరిత్రమగు నాదిపురాణమును రచించెను. పొన్న శాంతిపురాణమును, జినాక్షరమాలను రచించెను. రన్న యజితపురాణమును, సాహసభీమవిజయమును రచించెను వీరుమువ్వురును వేఁగిమండలము వారేయని తోఁచుచున్నది. పంప తనభారతమునఁ దన తాతముత్తాతలు వేంగిమండమందలి వేంగిపళువునకు చేరిన నాల్గ్రగహారములందగ్రగణ్యులుగా నుండినట్లు చెప్పికొనియున్నాఁడు. పొన్న తన శాంతిపురాణమున వేంగివిషయములోని కమ్మనాటికి చేరిన పుంగనూరుగ్రామమున నుండిన మల్లప, పున్నమయ్యల ప్రేరణముచే నాగ్రంథమును రచించినట్లు చెప్పికొనెను. రన్న యజితపురాణమున వేంగిమండలమును హెచ్చుగా వర్ణించియున్నాఁడు. ఆకాలమునాఁటి వేంగిమండలవర్ణనము నాతఁడిట్లు చేసియున్నాఁడు.

తుంగమతంగజేంద్రవనదిం ఫలభారవినమ్రనాళికే
రంగళి, నద్రికాననది, నుత్తమశాలివనంగళిం, చళ
ద్భృంగకుళకుళీకృతసరోరుహషండదిఁ, సిక్షువృష్పవా
టింగళినావమండలమ మగ్గెలెవందుద వెఁగిమండల.

వ. అల్లికేంటకివృత్తియం వయఃపరిణతియం ఫలతరుగళొళ్, దానభంగముంగజగళొళ్, కంఠగ్రహముం నెఱ

భోగదోళె, చళనక్రియెయుంరవ వాదదోళె, మత్తం ధనదరల్లదధన నరిల్ల, శక్కరిల్లదెటుక్కరిల్ల, జన్మనుల్లదెబన్మనుల్ల, భోగమల్లదె రాగమిల్ల, అజ్ఞనల్లదెబజ్ఞనిల్ల, పెప్పల్లదెబెప్పల్ల, కులీనరిల్లద కులీనరిల్ల, వాదియుల్లదెబాదియిల్ల, జాతియల్లదెవిజాతియిల్ల విదగ్ధరల్లదవిదగ్ధరిల్ల, సురాలయమిల్లదసురాలయమిల్ల, విప్ర లాపమల్లదెవిప్రలాపమిల్ల, పారిజాతమల్లదెపరాజాతమిల్ల, అధి కారిగళల్లదధికారిగళిల్ల, విప్రయుక్తరల్లదప్రయుక్తరిల్ల పరలోకభయమల్లదెపరలోకభయమిల్ల, పరార్థవేషిగళల్ల దె పరార్థవేషిగళిల్ల, పాపభీరుగళల్లదసాపభీరుగళిల్ల, పరహిత వ్యసనిగళల్లదె దుర్వ్యసనిగళిల్ల, గోసాసనమల్లదెకర్ణగోసా సనమిల్ల.

సకళవిషయసంపాతి యొళ్లల్లదవగ్రహమె బుద్ధిల్లదె
వక్రతమదాదోషంకె యుక్తదకాగ్గళనిరెనాగ్వకా
లికఫలదాయియగ్గళదబత్తడెపెర్వళసిందదేవమా
తృకముమాకృష్టపచ్చుమెనల్పారెవెత్తుదువెంగిమండలం॥

ఆళికలికుసుమపరిమళ
ఫలరసమందానిలాద్రికాననలీలా
విలసనదంభోగమహీ
తళమెనిపుదువిషయజనకె వెంగివిషయం॥

"జలధితరంగతాడితమహీతళదొళ్నెగళ్పెత్తువెంగిమం
డలం"......................అజితపురాణము.౧. ౨౧-౨౪

పైవానిలోని తుదిపద్యభాగము నాంధ్రభారత పీఠికయందలి

'అఖిలజలధివేలావలయిత వసుమతీవనితావిభూషణం బైన వేఁగీదేశ'మను గద్యభాగముతో సరిపోల్చికొనవలయును. ఈరీతిగా నాకాలమున వెంగిదేశము సకలసంపదలకు నాలవాలమై విద్యలకు రచ్చపట్టై విలసిల్లుచుండెను. జైనమతగ్రంథములు ప్రబలియుండెను. రత్నత్రయము వ్రాసిన గ్రంథములు దేశభాషలలోనుండి సర్వజనాదరణపాత్రములగుచుండెను. బ్రాహ్మణమతమంతయు సంస్కృతమునందే యుండిపోయి సామాన్యజనులు తమంతట తాము తెలిసికొనవీలు లేకుండెను. రాజులు బ్రాహ్మణమతావలంబులై యుండి బ్రాహ్మణవిజ్ఞానము ప్రజలఁ జేసి, జైనమతమువంకలి యభిమానమును ప్రజలందు తగ్గింపఁ జూచిరి. కావుననే చాళుక్యరాజరాజు నన్నయభట్టుం జూచి,

క. జననుతకృష్ణద్వైపా
యనమునివృషభాభిహితమహాభారతబ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్॥

అనిపలికినట్లు భారతపీఠిక దెలుపుచున్నది.

రాజమహేంద్రవర మెప్పుడు వేఁగిదేశమునకు రాజధానియయ్యెనో తెలియదు. చిన్నకోట పెద్దన తనకావ్యాలంకారచూడామణియందు భారతరచనకుఁ దొడఁగిన రాజరాజనరేంద్రుని రాజమహేంద్రపురస్థాతయని చెప్పియున్నాఁడుగాని యంతకుఁ బూర్వమునుండియు ననఁగా నమ్మరాజవిష్ణువర్ధ

నుని కాలముననో అమ్మరాజవిజయాదిత్యుని కాలముననో యనఁగా నేఁడవ శతాబ్దము మధ్యనుండియు నీపురము ప్రసిద్ధికెక్కి యుండెనని తలంచుటకు తగిన కారణములున్నవి. తొలుత వెంగియునుఁ బిదప విజయవాటికయు నచటినుండి రాజమహేంద్రవరమునకును నీరీతిఁ గ్రమక్రమముగా వేంగిరాజుల రాజధాని మాఱుచువచ్చెను.

తెనుఁగునందు రాజరాజు పూర్వము గ్రంథరచనమున్నదో లేదో తెలియదు. బెజవాడ శాసనములోని యక్కరలు తప్ప మనకు వాఙ్మయదర్శనము లంతకు పూర్వముండినవి కానరావు. ఆంధ్రీకృత మహాభారతమే మనకిప్పటికి మొదటి గ్రంథముగా నేర్పడుచున్నది. ఈ యాంధ్రీకరణమునకై రాజరాజు చాలమంది పండితులను, కవులనుఁ దన యాస్థానమునఁ బోషించుచువచ్చెను. భారతపీఠికలోని యాకిందివచనము లన నారాజెట్టి విద్యాభిమానియు, రసజ్ఞుఁడునై యుండెనో తెలియఁగలదు.

"అఖిలజలధి వేలావలయిత వసుమతీవనితావిభూషణంబైన వేఁగీదేశంబునకు నాయకరత్నంబునుంబోని రాజమహేంద్రపురంబునందు మహేంద్రమహిమతోఁ బరమానందంబున ననవరతమహామహీరాజ్యసుఖం బనుభవించుచు సకలభువనలక్ష్మీవిలాస నివాసంబైన రమ్యహర్మ్యతలంబున మంత్రి, పురోహిత, సేనాపతి, దండనాయక, దౌవారిక

మహాప్రధానాసంతసామంతవిలాసినీపరివృతుండై, యపారశబ్ద శాస్త్రపారంగతులైన వైయాకరణులును, భారతరామాయణాద్యనేకపురాణప్రవీణులైన పౌరాణికులును, స్వాదుమధుర రసభావభాసుర నవార్థవచనరచనావిశారదులైన మహాకవులును, వివిధతర్కవిగాహిత సమస్తశాస్త్రసాగరగరీయః ప్రతిభులైన తార్కికులును, నాదిగాఁగలుగువిద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ విద్యావిలాసగోష్ఠీసుఖోపవిష్టుండై యిష్టకథావినోదంబులనుండి యొక్కనాఁడు.

ఈరీతిఁగానతివైభవోపేతుండై బ్రాహ్మణమతమునాధరిలోకమున వ్యాపింపఁజేయసమకట్టి రాజరాజాఖ్య విద్వత్పరిషత్తు నేర్పఱచి, వారిలోఁ దెనుగు కావ్యము రచింపవలసిన పద్ధతుల నేర్పఱచి, యాపద్ధతులమీఁదనే భారతరచనను నడిపించుచుఁ దానును విద్వాంసుఁడగుటచేఁ దనకుఁ దోఁచినచోట గొన్ని పద్యములను చేర్చుచు, నిపరిషత్తునకు తనవంశము నాశ్రయించి, చిరకాలముండిన వంశమునజనించి, యక్షరజ్ఞుఁడై సకలపురాణేతిహాసకథాకథనదక్షుండై నిత్యసత్యవచనుఁడును, మతిమంతుఁడునై యుండుటయేగాక శబ్దశాసనబిరుదమునకు పాత్రుఁడై యుండిన నన్నయభట్టు నధ్యక్షునిగానియమించి, తెనుఁగుభాషకు మహోపకారముఁగావించెను. శ్రీకూర్మము శాసనములోని, "సరాజరాజనృపతిః సువిశాలకీర్తిః యస్సూరిభిస్సహాకిలస్మృతిజాలసార మాంధ్రీచకారవరభారతవంశవృత్తమ్" అనుదానినిబట్టి రాజరాజునుఁ గవియైయున్నట్లు తెలు

మున్నది. భారతాంధ్రీకరణభారమంతయు నన్నయమీఁదనే పడియుండెను. ఆతనికినారాయణభట్టు చాలవఱకు సహాయము చేసెను. ఈనారాయణభట్టు సంస్కృతప్రాకృతకర్ణాటపైశాచికాంధ్రభాషలయందు కవిరాజశేఖరుఁడను ప్రశస్తిఁగాంచియుండెను. నారాయణభట్టు నన్నయకుతోడ్పడిన విధము భారతపీఠికలోని.

ఉ. పాయకపాకశాసనికి భారతఘోరరణంబునందునా
రాయణునట్లువానను ధరామరవంశవివర్ధనుండునా
రాయణభట్టువాఙ్మయధురంధరుఁడుందనకిష్టుఁడున్నహా
ధ్యాయుఁడునైనవాఁడభిమతంబుగఁదోడయినిర్వహింపగన్

అనుపద్యమువలనఁ దేటపడుచున్నది. నన్నయనారాయణులే కాక యనేకులుకవులు రాజరాజునాస్థానమున నుండినట్లు "రాజమహేంద్రకవీంద్రసమాజసురత్నోజ" యనుసంబోధనమువలనఁ దెలియుచున్నది.

భారతాంధ్రీకరణమరణ్యపర్వమధ్యమున నాగిపోయినది. దీనికిఁగారణము నన్నయకుఁగలిగిన చిత్తచాంచల్యమే యని కొందఱందురుగాని రాజనిర్యాణమే యగునేమో. రాజుకొఱకునన్నయమీఁదనే యాధారపడియుండ లేదుగదా.

ఎట్లయినను రాజరాజునంతరము రాజమహేంద్రవరమునకు విద్యాపీఠమను ప్రసిద్ధికొంత తగ్గినదనియే యని చెప్పవలెను. రాజావలంబనమున్నఁగదా కవిత్వమును, కళలును. రాజరాజమ్మంగదేవుల పుత్రుఁడగు కులోత్తుంగచోడునకు

దక్షిణదేశముపై మోహముపుట్టి యాతఁడు రాజమహేంద్రవరమును వదలిపెట్టెను. అప్పటినుండియు చాళుక్యరాజ్యము క్షీణింపఁజొచ్చెను. తిరిగి రెడ్లకాలమువఱకును విద్యలీదేశమున నెట్లుండెనో తెలియదు. వేమారెడ్డియనుతన యన్నసహాయమున వీరభద్రారెడ్డి రాజమహేంద్రవరమును ముఖ్యపట్టణము చేసికొని పరిపాలనము చేయుచుండెను. ఈతనియాస్థానముననే తిరిగికవిత్వము తలచూపెను. కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడీతనియొద్దనే యుండి మన్ననలకుఁ బాత్రుఁడై యాతనికి కాశీఖండమునుఁ గృతినిచ్చెను. ఈకవిశేఖరుఁడు సర్వజ్ఞచక్రవర్తిబిరుదాంకితుఁడగు కోమటివేమారెడ్డియొద్ద విద్యాధికారిగానుండి యాతనిసేనానియగు ప్రెగడమంత్రికి పండితారాధ్యచరిత్రమును, మంత్రియగు మామిడిసింగనామాత్యునకు శృంగారనైషధమును, వీరభద్రారెడ్డిమంత్రియగు బెండపూడి అన్నయామాత్యునకు భీమఖండము నంకితమిచ్చెను. ఈతఁడుతానురచించిన గ్రంథములఁగూర్చి యిట్లుచెప్పియున్నాఁడు

సీ. చిన్నారిపొన్నారి చిఱుతకూకటినాఁడు
రచియించితిమరుత్తరాట్చరిత్ర
నూనూఁగుమీసాల నూత్నయౌవనమున
శాలివాహన సప్తశతినొడివితి
సంతరించితినిండు జవ్వనంబునయందు
హర్షనైషధకావ్యమాంధ్రభాషఁ

ప్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకుని మహిమఁ
బ్రాయ మింతకు మిగులఁ గ్రొవ్వాలకుండఁ
గాశికాఖండమను మహాగ్రంధ మేను
దెనుఁగు జేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.

ఈకవిశిఖామణి 'మదపుటేనుఁగుగతి' ననుకరించు శైలితో విశృంఖలముగఁ దనగ్రంధములను రచించియున్నాడు. ఈతఁడు భీమఖండములో గోదావరివచ్చురీతిని వర్ణించిన పద్యమే యీతనికవితాగతినిఁ గూడ వర్ణించుచున్నది. "తరులతో షండములతోడ దరులతోడ విమలడిండీరఖండతండములతోడ మురువుహొరువును నాటోపమును జవంబు వడువు నొప్పంగ గంగమ్మనడువవమ్మ." మురువు, హొరువు, ఆటోపము, జవము ననుగుణములన్నియు నీతనికవిత్వమునఁ గాన్పించుచుండును. ఈతఁడింకననేక గ్రంధముల రచించియున్నాఁడు. శివరాత్రిమహాత్మ్యమొకటి యిప్పుడు బయలువెడలి ముద్రితమైనది. కాపులుహాయిగా పాడికొను 'హరిహరీనారాయణ' పద మీతనిదే యనివాడుక. ఈతని పల్నాటివీరచరిత్రమునందలి శౌర్యసాహసకృత్యముల వర్ణనములు చదువుచుండిన నొడలుపులకరించుచుండును. భీమేశ్వరపురాణమున శ్రీనాథుఁడు రాజమహేంద్రవరము నిట్లువర్ణించియున్నాఁడు.

సీ. కమలాచలాగ్రమార్కండేయశివశిర
శ్శశిచంద్రికాధౌతసౌధవీథి
గోదావరీపుణ్యకూలంకషాజల
స్ఫారితశ్రీరుద్ర పాదయుగళి
బలవదభ్యున్నత ప్రాకారపరివేష
గండూషితాజాండ మడలంబు
గంధదంతావళగ్రైవేయఘంటికా
ఠంకారముఖర ఘుంటాపథంబు
రాజబింబాననానూత్నరత్నపేటి
వీరరాజాంత్తసుభటకంఠీరవాద్రి
వేమభూపాల రాజ్యాభివృద్ధికరము
సాంద్రవిభవంబు రాజమహేంద్రవరము.

వీరభద్రారెడ్డికి మంత్రియగు లింగనకూన తనప్రభువువలెఁ గవీశ్వరుల నాదరించుచుండెను. ఈతఁడు 'కవిబుధశ్రేణికిఁ జెవులపండువులుగా నాస్థానమున మాట్లాడనేర్చు' నని శ్రీనాథుఁడు చెప్పియుండుటంబట్టి యీతఁడు విద్వద్గోష్ఠియందు కాలముఁగడుపుచుండెనని తెలియుచున్నది. ఈతనితమ్ముఁడగు వెన్నమంత్రియు బహుభాషలనేర్చి వివిధదేశముల లిపులతో వ్రాయఁగల నేర్పరియైయుండెనట.

మ. అరబీభాష,తురుష్కభాష,గజకర్ణాటాంధ్రగాంధారఘూ
ర్జరభాషల్, మలయాళభాష, శకభాషాసింధుసౌవీరబ
ర్బరభాషల్ కరహాటభాషమఱియున్ భాషావిశేషంబుల
చ్చెరువైవచ్చునదేటి యన్నిటికిగోష్ఠీసంప్రయోగంబులన్.

ఉ. అన్నయమంత్రిశేఖరుఁడ హమ్మదుశాసనదానభూమిభృ
త్సన్నిధికిన్మదిన్సముచితంబుగ వేమమహీసురేంద్రరా
జ్యోన్నతిసంతతాభ్యుదయమొ దఁగ బారసిభాషవ్రాసినం
గన్నులపండువైయమరుఁగాకితమందలివర్ణపద్ధతుల్.

రెడ్లు తెనుఁగువాఙ్మయమునకేగాక సంస్కృతమును కూడ చాల ప్రోత్సాహపఱచుచుండిరి. సంస్కృత కావ్యములకుఁ జాలమట్టుకు వీరికాలమున వ్యాఖ్యానములు బయలు వెడలినవి. విద్యాశాలలు నెలకొల్పఁబడి యందువిద్యసాగుచున్నదో లేదో చూచుటకు విద్యాధికారులు నియమింపఁబడుచుండిరి.

కాని యచిరకాలముననే రాజమహేంద్రవరము మహమ్మదీయులచేతులలోఁబడెను. తిరిగియరాజక మారంభమయ్యెను. తరువాత కాలమున నిచటవిద్యలెట్లు సాగుచుండెనో మనకు తెలియకున్నను, రాజాదరణము లేకుండినను నిచటవిద్యలు సాగుచుండెననియే చెప్పవచ్చును. నేటికినినిది విద్యావిషయమున నితరస్థలములకు తీసిపోదు. ముఖ్యముగా మనకులభించు నాంధ్రవిశ్వవిద్యాలయమిట్టి సాంప్రదాయములుగల రాజమహేంద్రవరమునగాక యితరస్థలములందు స్థాపించుట యుచితముకాదు.

---

శ్రీరస్తు.

# ప్రాచీన విద్యాపీఠములు.

## నవద్వీపము.

---

శిక్షా, వ్యాకరణము, చందస్సు, నిరుక్తము, జ్యోతిష్యము, కల్పమనను నాలు వేదాంగములలో శబ్దస్వరూపముఁ దెలియుటకు వ్యాకరణమెల్ల ముఖ్యమో, న్యాయము, వైశేషికము, సాంఖ్యము, యోగము, పూర్వమీమాంసా, ఉత్తరమీమాంసా, యను షడ్దర్శనములలో నర్థస్వరూపముఁ దెలిసికొనుటకు న్యాయమంత ముఖ్యము.

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ॥

అని కాళిదాసు పఠించినరీతిని వాగర్థములకు నర్ధనారీశ్వర రూపము దాల్చిన పార్వతీపరమేశ్వరుల యవినాభావసంబంధము కుదురుకొనియున్నది. వ్యాకరణన్యాయముల కందుచేతనే మిక్కిలి దగ్గఱసంబంధమున్నది. వ్యాకరణమునకుఁ బ్రఖ్యాతిఁగాంచిన హిందూదేశమందుచేతనే న్యాయశాస్త్రమునకునుఁ బ్రసిద్ధి వహించియున్నది. కేవలవ్యాకరణమునుగాని, వలన్యాయమునుగాని యభ్యసించుటవలన నాయొక్క శాస్త్ర

మునందుమాత్రము జ్ఞానము సంపాదించినవాఁడగునుగాని, యింకను బండితుఁడని చెప్పుటకు వీలులేదు. అనగా రెండుశాస్త్రములు నామూలముగ నభ్యసించినపిదపనే వేదమున కర్థముబోధపఱచుకొనుట కధికారము కలుగుచున్నది. తర్కవశాస్త్రములును, దర్శనములును ముఖ్యములేగాని యవియీరెండును నభ్యసించిన పిదపరాఁదగినవి. ఈవ్యాకరణన్యాయము లింతముఖ్యములగుటచేఁ గాశికిపోయి వ్యాకరణము నభ్యసించినవారు నవద్వీపమునకునుబోయి న్యాయమునభ్యసించిన తరువాతనే తమదేశములకు మఱలివచ్చుచుందురు.

న్యాయమనగా నొకవిషయములోనికిఁ దీసికొనివెళ్లునదనియర్థము. అనగా నావిషయమును వికరణముచేసి దానియందేమేమియున్నదో తెలియజేయునది. ఇట్లొకవిషయమునందలి యంతర్భాగముల విడఁదీసి, దానిస్వభావమును బాగుగఁ దలిసికొని వానినితిరిగి కలియఁగలుపుట సాంఖ్యమువిధమైయున్నది. కావునన్యాయము సాంఖ్యమునకుఁ దోడ్పడి యాయావిషయములఁగూర్చి స్పష్టముగు జ్ఞానముఁ గలుగఁజేయును. న్యాయమునుఁ దర్కమును నొక్కటేయని కొందఱందురు. గానినిజముగా తర్కమున్యాయములో నొకభాగముమాత్రమే. సర్వవ్యవహారహేతువగు బుద్ధియే జ్ఞానము.

స్మృతి, అనుభవమునని యదిరెండువిధములు. సంస్కారమాత్రముచేతఁ బుట్టినజ్ఞానమునకు స్మృతియనిపేరు.

దానికిభిన్నమగు జ్ఞానము అనుభవము. అదిరెండువిధములు, యథార్థము, అయథార్థము నని. ఒకవస్తుస్వరూప మొకరీతిగానుండఁగా నది యట్లేయున్నదని గ్రహించుట యథార్థము. దీనికే 'ప్రమా' యనిపేరు. ఒకవస్తువుస్వరూప మొకరీతిగా లేకున్నను నారీతిగనే యున్నదను కొనుట అయథార్థము. దీనికే 'అప్రమా' యని పేరు. యథార్థానుభవము ప్రత్యక్షము, అనుకూలినము, ఉపమానము, శబ్దమునని నాలుగు విధములు. అయథార్థానుభవము మూడువిధలు, సంశయము, విపర్యయము, తర్కమనఁగా వ్యాప్యారోపముచేత వ్యాపకారోపముచేయుట. పర్వతముపై నగ్నిలేకపోయినచో ధూమము కూడలేదని యూహించుటతర్కము. ఇట్లు తర్కము న్యాయములో నొకభాగమైనను నీశాస్త్రము రెండుపేర్లతోడను వ్యవహరింపఁబడుచున్నది.

గోతమన్యాయసూత్రమునందు వివరింపఁబడిన యంశములు పదునారు. దానిలో మొదటిది ప్రమాణము, అనగా 'ప్రమ' యనుయథార్థజ్ఞానమును సంపాదించుటకు సాధనము. ఈయథార్థజ్ఞానమును నాలుగువిధములుగా మనస్సుపొందుచున్నది (౧) ఇంద్రియార్థసన్నికర్షజన్యమగు జ్ఞానము ప్రత్యక్షము. దిత్థుఁడు, ఇతఁడు బ్రాహ్మణుడు, ఇతఁడు శ్యామవర్ణుఁడు, ఇతఁడుపాచకుఁడునని గ్రహించుటయే ప్రత్యక్షజ్ఞానము. ౨. అనుమితికరణమనుమానము. పరామర్శజన్యమగుజ్ఞాన మనుమితి. వ్యాప్తివిశిష్టపక్షధర్మతాజ్ఞానము పరామర్శము. వహ్ని

వ్యాపించియుండఁగా నీపర్వతము ధూమవంతమని చెప్పుట పరామర్శము. దీనివలనఁ గలిగిన 'పర్వతము వహ్నిమంతమని చెప్పుట' యనుమితి. 'ధూమమున్నచోట్లనెల్ల నగ్నియున్నది' అను సాహచర్యనియమ మేదికలదో యదియే వ్యాప్తి. వ్యాప్యమునకుఁ గల పర్వతాదివృత్తిత్వమే పక్షధర్మత. (౩) ఉపమితికరణ ముపమానము. సంజ్ఞకును, సంజ్ఞికిని గలసంబంధమును గూర్చిన జ్ఞానము పమితి. ఒకానొకనికి 'గవయము' అనుపదార్థము తెలియక యొక యారణ్యక పురుషునివలన గోసదృశము గవయమని తెలిసికొని వనమున కేగి వాక్యార్థమును స్మరించి గోసదృశమగుదానిని చూచును. అప్పుడు 'ఇది గవయపదవాచ్యము' అని యనుకొనును. ఇట్లే యనుమితి కలుగుచున్నది (౪) ఆప్తవాక్యము శబ్దము. యథార్థవక్తయే యాప్తుడు. వాక్యమనఁగా పదసమూహము. ఉదా: గోవును తీసికొని రమ్ము, శక్తమయిన దేపదము. ఈపదమువలన నీయర్థము గ్రహింపవలయునను సంకేతమే శక్తి.

పైఁజెప్పఁబడిన ప్రత్యక్షానుమానోపమానశబ్దభేదములలో రెండవదియగు ననుమానమైదవయవములుగలది. ఏవిషయమునుగూర్చియైనను సిద్ధాంతము చేయవలసివచ్చినప్పు డీయైదవయవములను నిరూపింపవలయును. అందు మొదటిది ప్రతిజ్ఞ, అనఁగా సిద్ధాంతము చేయవలసిన విషయమును చెప్పుట. రెండవది హేతువు. అనఁగా నట్లు సిద్ధాంతముఁ జేయుటకు వలయు హేతువులను నిరూపించుట. మూడవది యుదాహర

ణము. దీనికే ఇంగ్లీషులో మేజర్ ప్రిమిస్ (Major premiss) అందురు. నాల్గవది ఉపనయము, అనఁగా నాకారణములను ప్రకటించుట. దీనికే ఇంగ్లీషున మైనర్ ప్రిమిస్ (Minor premiss) అని పేరు. ఐదవది నిగమనము, అనఁగా సిద్ధాంతము. ఉదాహరణము.

౧. పర్వతము వహ్నిమంతము—ప్రతిజ్ఞ (Hypothetical Statement)

౨. దానిపై ధూమమున్నదిగనుక — హేతువు Reason or the Statement)

3 ధూమమున్న చోట్లనెల్ల యగ్నియుండును, వంటయింటి వలె—ఉదాహరణము (Major premiss)

౪. ఈపర్వతముపై ధూమమున్నది—ఉపనయము (Minor premiss)

౫. కావుననిపర్వతమువహ్నిమంతము—నిగమనము (Conclusion)

ఈయనుమానప్రకరణమునకున్ను గ్రీకులదానికినిఁ జాలభేదమున్నది. హిందూజ్ఞానమేమాత్రమున్నను గ్రీకులనుండియే యెఱవుతెచ్చి కొనిరను నపవాదమును బాపుటకిది యొకనిదర్శనము. ఈయనుమానముఁగూర్చి అరిస్టాటిలు అవలంబించినపద్ధతియే క్లుప్తముగానున్నదనియు మనయనుమానము సిలోజిజమ్, ఎన్థిమీము, అనువాని సంకరముగనున్నదనియుఁ బాశ్చాత్యులు విమర్శింతురుగాని, వాదమును సం

పూర్ణముగా చెప్పుట కీపద్ధతియే యుత్కృష్టమైనదని వారును నొప్పుకొనకతప్పదు.

హిందూ దేశపు న్యాయశాస్త్రము స్వతంత్రముగా మన దేశమునందే పుట్టినదని చెప్పుటకు నుపయోగింపఁబడు వ్యాప్తి, వ్యాపక, వ్యాప్య, పదములే నిదర్శనములు. 'ధూమమున్నచోట్లనందెల్ల నగ్నియున్నది' యనుదాహరణగూర్చి నైయాయికులు చెప్పుపద్ధతి "యత్రధూమస్తత్రాగ్నిరితిసాహచర్యనియమో వ్యాప్తిః యత్ర యత్రేతి యత్రవవవీప్సా ధూమాధికరణే యావతివహ్నిమత్త్వలాభాయ యావత్త్వముహిమన్నా వహ్నిర్ధూమవ్యాపకత్వం లబ్ధమ్ తథాచ ధూమవ్యాపకవహ్నిధూమవతీత్యర్థః తదేవస్పష్టయతి సాహచర్యనియమ ఇతి నియతసాహచర్యం వ్యాప్తిరిత్యర్థః యతోవ్యాపకత్వం సాహచర్యం సామానాధికరణ్యం తథాచ ధూమనిష్ఠవహ్ని సామానాధికరణ్యం వ్యాప్తిరిత్యర్థః" ఇట్టిసూక్ష్మవిమర్శగాని, యిట్టిపద్ధతిగాని పాశ్చాత్యులెఱుఁగరు. కావున న్యాయశాస్త్రమును హిందువులెఱవుతెచ్చికొనిరని చెప్పుట న్యాయము కాదు.

ఇఁక రెండవభాగము ప్రమేయము. దీనియందు ప్రమ అనగా యథార్థజ్ఞానమునకు సంబంధించిన విషయములు చెప్పఁబడును.

అట్టివి. ౧. ఆత్మ. ౨. శరీరము. ౩. ఇంద్రియములు ౪. ఇంద్రియములకు విషయములగు నర్థములు. ౫. బుద్ధి. ౬.

మనస్సు. ౭. ప్రవృత్తి. ౮. దోషములు. ౯. ప్రేత్యభావము (అనఁగా నీదేహమును విడిచి యాత్మ మఱియొక దేహమునుఁ బ్రవేశించుట.) ౧౦. ఫలము. ౧౧ దుఃఖము. ౧౨. అపవర్గము (లేక ముక్తి) యని పండ్రెండు గేర్పఱుపఁబడినవి.

తక్కిన పదునాల్గు భాగములును శాస్త్రవిషయములు గాక వాదమే యేయవస్థలఁ బొందుచువచ్చునో దెలుపునవై యున్నట్లు తోఁచును. శాస్త్రదృష్టి లేని నైయాయికుఁడు సాధారణముగాఁ దనగొంతుకనే యాధారము చేసికొని, ప్రత్యుత్తరమొంతత్వరితముగ నిచ్చిన నంత గట్టివాఁడనుకొందురని తలంచి, యెట్టిసిద్ధాంతమునకైనను దోషోపవాదములు చేయుటకు వెనుదీయకుండుట సంభవించుచుండును. ఇట్టి వాగ్వాదములకై గాక సత్యాన్వేషణముకొఱకే న్యాయశాస్త్రము పుట్టినదని జ్ఞాపకముంచుకొనవలెను.

సాధారణముగా కేవల వాగ్వాద మీయవస్థలనొందుచుండును. మొదట చర్చనీయాంశముంగూర్చిన సంశయమును, చర్చవలన ప్రయోజనమును, పిదప దృష్టాంతమును, తరువాత సిద్ధాంతమును, చేయును. ప్రతిపక్షియు స్వపక్షసిద్ధాంతమును పంచావయవములుగా విభజించి, దానిపై తర్కము చేసి, సత్యమును నిర్ణయము చేయును. ఇంతటితో వాదమునందు తృప్తి పడరు. ఎంత చిన్నయాక్షేపణలైనను అన్నిటిని చేసి తీరవలయును. కావున నింకను వాదము జరుగును. ఇది జల్పములోనికి దిగును, తరువాత వితండావాద మగును, అంతె హేత్వాభాస

ములు బయలు దేరును; భోక్తలు వెంటనే యనుసరించును; ఆపైనిజాతి యనఁగా కార్యములేని పరిత్యక్తరములు బయలువెడలును. ఆపైని నిగ్రహస్థానమే; ఆక్షేపకుఁడంతకంటె మఱివాదము చేయలేఁడని యేర్పడును. గౌతముఁడిట్టి పదునాఱువిషయములఁగూర్చియుఁ జెప్పి తుదపైని మోహమే దుఃఖమునకు మూలమనియు, ప్రేమించుట, ద్వేషించుట, యుపేక్షవహించుటయనునవి మోహజాతములేయనియు, ప్రవృత్తి వలననే దోషములుకలుగుననియు, ఇట్టిప్రవృత్తియే పుణ్యపాపములకుఁగారణమనియు, ఆపుణ్యపాపములకు ఫలముగా ననేకజన్మములెత్తవలసియుండుననియు, ఈజన్మములు దుఃఖకారణములనియు, తత్త్వజిజ్ఞాసవలననే దుఃఖమూలమగు మోహము నశించుననియు నిరూపించియున్నాఁడు.

న్యాయమునకును వైశేషికమునకు జత. వైశేషికము న్యాయములోని శాఖకాదు. అది ప్రత్యేకమైనదర్శనము. కాని యీరెండుదర్శనములును గలసి యొక్క గొప్పశాస్త్రమనియు ననుకొనవచ్చును. వైశేషికమునందు బుద్ధికిగోచరమగు సర్వప్రపంచమును నేడేపదార్థములుగా విభజింపఁబడియున్నది. ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయ, అభావములను నీయేడుపదార్థములను నైయాయికులుఁగూడ చేకొనియున్నారు. తొలుత వైశేషికమును బుట్టించిన కణాదుఁడాఱుపదార్థములనే చెప్పెనుగాని తరువాతివారేడవపదార్థమునుఁ జేర్చిరి. పైవానిలో ద్రవ్యము (పృథివ్య

స్తేజో, వా, య్వాకాశ కాల, ది, గా, త్మ, మనస్సులని తొ మ్మిదివిధములు రూప, రస, గంధ, స్పర్శ, సంఖ్యా, పరిమా ణ, పృథక్త్వ, సంయోగ, విభాగ, పరత్వా, పరత్వ, గురు త్వ, ద్రవత్వ, స్నేహ, శబ్ద, బుద్ధి, సుఖ, దుఃఖేచ్ఛా, ద్వేష, ప్రయత్న, ధర్మా, ధర్మ, సంసారములని గుణమిరువదినాలు గువిధములు. ఉత్క్షేప, ణాపక్షేపణా, కుంచన, ప్రసారణ, గ మన భేదములచే కర్మమైదువిధములు. సామాన్యము పరము, అ పరమునని రెండువిధములు నిత్యద్రవ్యవృత్తులగు విశేషములనం తములు. సమవాయమొక్కటే. అభావము నాలుగువిధము లు, ప్రాగభావ, ప్రధ్వంసాభావ, అత్యంతాభావ, అన్యో న్యాభావములని, పైనిచెప్పిన ద్రవ్యములలో మొదటి నాలు గును మనస్సును పరమాణురూపములు. మొదటినాలుగును పరమాణురూపములైనప్పుడు నిత్యములును, కార్యరూపము లైనప్పుడ నిత్యములును నగును.

వైశేషికధర్శనమున కాదికర్త కణాదుఁడు. కణాదుఁ డనఁగా కణములను తినువాఁడని యర్థము. ప్రపంచమంతయు పరమాణువులగు కణముల సంయోగముచేఁ గలిగినదని యీ తనివాదము. కనుక నాతని కా పేరు వచ్చినదని కొందఱం దురు. ఈయనంతములును, నిత్యములునగు పరమాణువులు నదృష్టముచేత సంయోగ, వియోగ, పునస్సంయోగముల బొందుచుండును. పరమాణువేకము, విభ్వి, నిత్యమునై యుం డును. ఇది యన్నిటికంటె చిన్నదానికంటె చిన్నదియై, కంటి

కి కనఁబడక అవిభాజ్యమై, యింద్రియగోచరముగాక యుండును. ప్రతిపరమాణువునకును బ్రత్యేకవిశేష మొకటి యున్నది. అట్టిపరమాణువులు రెండింటికి సంయోగము కలుగును. మూఁడుపరమాణువులవలన గలిగినదొక త్రసరేణువు. ఇది కంటికి దృశ్యాదృశ్యముగ నుండును.

గోతముఁ డొక్కసారి ఈశ్వరునిగూర్చి ప్రశంస నెత్తుకొనెను. కాని, కణాదుఁ డట్టి యీశ్వరుని స్మరించనైన లేదు. కణాదగోతము లిరువురును బ్రపంచమదృష్టమువలననే యుత్పత్తి నొందెనని తలంచియుండిరి. ఈయదృష్టమే యీశ్వరుఁడని తరువాతివారు చెప్పుచువచ్చిరి. అంతకంతకును నైయాయికులు జీవాత్మపరమాత్మలకు భేదముఁ గల్పించిరి. ఈపరమాత్మకు శాశ్వతత్వము, నిత్యత్వము, సర్వజ్ఞత్వము, రూపరాహిత్యము, సర్వవ్యాపకత్వము, సర్వశక్తిత్వము, జగన్నిర్మాణసమర్థత్వము, ననుగుణముల నారోపాదించిరి. జీవాత్మకు శాశ్వతత్వము, అనేకత్వము, శరీరేంద్రియమనస్సులకంటె పృథక్కుగానుండియు, జ్ఞానమును సంపాదించుటయు, ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, పుణ్యము, పాపము ననువానిని గలిగియుండుటయును గుణములు కలవని వారనిరి. ఇదియు నంతమై, సర్వవ్యాపియై, యాకాశమునంతను నాక్రమించి యుండుననియు, దేహముతోడి సంబంధముండుటచేత నాడే

హాయున్న స్థలముననే తెలిసికొనుట, యనుభవించుట, కార్యములఁ జేయుట యనునవి సంభవించినను నదియెచ్చటనున్నను నొక్కచోటయనియు వీరి యభిప్రాయము.

న్యాయముప్రకారము మనస్సాత్మవలె నొకద్రవ్యము. అది యొకయంతరింద్రియము. కాని, దానికాత్మవలె సర్వవ్యాపకత్వము లేదు. పృథివ్యప్తేజోవాయువులవలె నది పరమాణురూపము గలదే. దానికొకొక్కకాలమున నొక్కచో యూహోత్పత్తియుండును. ఆత్మవలె నదియు ననంతమైనచో యూహలన్ని నేకకాలమున గలుగును. ఇది కేవల మసంభవము.

వైశేషికముప్రకారము ద్వైతసిద్ధాంత మేర్పడుచున్నది. శాశ్వతములగు పరమాణువులు, శాశ్వతములగు జీవాత్మలు, శాశ్వతమగు పరమాత్మ యీమూఁడు సత్యములేయగును. పరిశుద్ధమగు పరమాత్మనుండి యపరిశుద్ధమగుప్రపంచ మెట్లుపుట్టునని చెప్పు వాదములన్నియు వైశేషికమతమున దోషయుక్తములే.

నవద్వీపము న్యాయదర్శనాధ్యయనమునకుఁ బ్రసిద్ధికెక్కినది గాన నాదర్శనస్వరూపమును గొంత తెలుపుట యుచితమని సంగ్రహముగాఁ బైని వ్రాసియున్నాము.

‡ నవద్వీపము నిప్పుడు నడియా యందురు. ఇది బంగాళాదేశములోనిది. ఇచట నాకేశవును సేనరాజులలో నొకఁడు క్రీ॥ శ॥ ౧౦౬౩ సంవత్సరమున నీపట్టణనిర్మాణముఁ గావించెను. ౧౨౦౩ సం॥రమున నీపట్టణము మహమ్మదీయుల చేతులలోఁ బడెను. హిందూరాజుల పోషణయు, నగరముయొక్క రాజ

‡ శౌత్రిరాహులయందు న్యాయశాస్త్ర మభివృద్ధిలో నున్నమాట సత్యమేయైనను, ప్రస్తుత మాంధ్రులయం దది హెచ్చుగా నవలింపఁబడి యుండుటను మనము గమనింపవలయును. ఈశాస్త్రాభ్యసనమునకు మొదట దారి చూపినవాఁడు అన్నంభట్టు. ఈతనిఁ బట్టియే యీతనివంశస్థులును నన్నంభట్టువారని పిలువఁబడుచున్నారు. వీరు ఋగ్వేదీయులు. కృష్ణానదీతీరమున కేశవపురమను గ్రామమున వీరిసంతతివారింకను నున్నారని తెలియవచ్చుచున్నది. అన్నంభట్టుతండ్రి శ్రీరాఘవసోమయాజికులసముత్పన్నుఁడైన శ్రీతిరుమలాచార్యుని పుత్త్రుఁడు. ఈతఁడు గొప్పపండితుఁడై తర్కసంగ్రహము, తర్కసంగ్రహదీపికా, తర్కభాషాతత్త్వబోధినీటీకా, తత్త్వచింతామణిన్యాలోకసిద్ధాంజనమ్, భాష్యప్రదీపోద్యోతనమను కైయటవ్యాఖ్యానమ్, మితాక్షరాలను కాశికానుసారిణి యగు పాణినీయసూత్రవృత్తి, రాణకోజ్జీవినీ, బ్రహ్మసూత్రవృత్తి యను గ్రంథములను రచించెను. తర్కసంగ్రహమే యిప్పుడు సాధారణముగా న్యాయశాస్త్రము నారంభించువారు చదువుచుందురు. ఈసంగ్రహముపై గోవర్ధనపండితుఁడు న్యాయబోధినిని, మేరుశాస్త్రి వాక్యవృత్తిని, పట్టాభిరామపండితుఁడు పట్టాభిరామటిప్పణిని, మఱియొకరు నిరుక్తిని వ్యాఖ్యానములుగా రచించిరి. తర్కసంగ్రహదీపికపై నీలకంఠప్రకాశిక, రామరుద్రీయ, నృసింహప్రకాశిక, పట్టాభిరామప్రకాశిక యను వ్యాఖ్యానము లున్నవి. ఇవిగాక ఖండనములు, ఖండనఖండనములు మొదలుగా నెన్నియో న్యాయగ్రంథము లాంధ్రదేశమున బయలువెడలి యున్నవి.

కీయప్రాముఖ్యతయు, నాస్థలము పవిత్రతయు, నాకర్షింప ని చటికి వేలకొలది విద్యార్థులుచేరి గొప్పగురువులయొద్ద శాస్త్రాభ్యాసము చేయుచుండిరి. నవద్వీపమునకు రాజకీయ ప్రాముఖ్యత పోయినను నచట విద్యక్షీణించుటలేదు. విద్వాం ములగు నచటిగురువులలో అద్విహోదయోగియొకఁడు. న్యాయ శాస్త్రము నిచట మొదటనెలకొల్పినవాఁడితఁడే యని వా డుక. అప్పటినుండి యిప్పటివఱకు నాశాస్త్రమచట కొనలు సాగుచునే యున్నది. ఇచ్చటి మహాగురువులలో మఱియొకఁ డగు వాసుదేవసార్వభౌముఁడు మిధిలానగరములో పక్షధర మిశ్రునికి శిష్యుఁడై న్యాయధర్మమునంతయు నొప్పజెప్పగల సామర్థ్యమును సంపాదించెనఁట. దీధితిని, గౌతమసూత్ర భాష్యమును రచించిన రఘునాధశిరోమణియు, బంగాళాదేశ ములో స్మృతిపాఠమును జెప్పుటయందు ప్రసిద్ధిఁబడసి యిప్ప టికి తనశాఖ విస్తరించియుండునంత కీర్తిగడించిన రఘునందన స్మార్తభట్టాచార్యుఁడును, తంత్రము గూర్చి యత్యుత్కృష్ట మగు గ్రంథమును రచించిన కృష్ణానందాగమయోగియు, ప ధనారవశతాబ్దమున వైష్ణవభక్తిమార్గమును బోధించిన గౌ రాంగదేవుఁడను నపరనామమునఁబడగు చైతన్యస్వామియు వాసుదేవసార్వభౌముని శిష్యులే.

బంగాళా, ఒరిస్సాదేశములయందు హెచ్చుగావ్యాపిం చియున్న చైతన్యముఁగూర్చి, యిచటకొంత చెప్పవలసియున్న ది. చైతన్యస్వామి ౧౪౮౬ సం॥రమున జనించెను. ఇతఁడు

కృష్ణునియవతారమని యాతనిభక్తుల నమ్మకము. ఈతఁడు నవ
ద్వీపమునందు న్యాయాదిశాస్త్రములలో గొప్పవాఁడనిపించు
కొని యిరువదినాల్గవయేటనే సన్యసించెను. భక్తిలేనిజన్మము
నిరర్థకమనియు, కేవలాధ్యయనాదులు ముక్తిని సంపాదిం
పఁజాలవనియుఁ బ్రేమయే జగత్తునకు మూలాధారమనియు,
శ్రీకృష్ణుఁడాయనంతప్రేమకు నిధానమనియు, నాతనిపైలక్ష్య
ముంచి జన్మమును లక్ష్యము చేసికొనవలెననియు నీతఁడు బోధిం
చుచు జగన్నాథమునకు వచ్చి తన వైష్ణవమతమును వ్యాపింపఁ
జేసెను. ఈతఁడు కటకమునందు శ్రీకృష్ణభగవానుని ధ్యానము
లో మునిఁగి పండ్రెండుసంవత్సరములచ్చటనే యుండెను. భక్తికి
ధ్యానమేగాక సంకీర్తనమును, నృత్యమునుఁ గూడ నంగములని
యాతని మతము. పరమాత్మయందు మనస్సును లీనము చేయుట
కంతకంటె సాధనము లేదని యాతని విశ్వాసము. భక్తిపారవశ్య
ముచే నీతని శిష్యులా సంకీర్తన నృత్యములందు మైమఱచి మూర్ఛ
నొందుచుండిరి. చైతన్యుఁడు కూడ నొకొక్కప్పుడిట్టి మూర్ఛ
లను లోనై, యొకనాఁడు జగన్నాథమునొద్ద సముద్రములో
స్నానము చేయుచుండఁగా మూర్ఛవచ్చుటచేత నే సముద్రమునఁ
బడి మృతినొందెనని చెప్పుదురు. ఈతఁడు మృతినొందిన నాఁటి
నుండియు నీతఁడు శ్రీకృష్ణుని యపరావతారమేయని జనులు
విశ్వసింపసాగిరి. చైతన్యుని శిష్యులును బంగాళాదేశమందంత
టను వ్యాపించి గురువుగారి మతమును బోధింపసాగిరి. శ్రీకృ
ష్ణుఁడే పరమాత్మ; జ్ఞానముకంటెను, ఇంద్రియనిగ్రహము

కంటెను, ధర్మము, శీలము, పుణ్యకార్యాచరణములకంటెను, శ్రీకృష్ణభక్తియే శ్రేష్ఠమనియు వీరిబోధనలసారాంశము. ఇట్టిభక్తివలన సర్వజాతులవారును బవిత్రులగుదురు. చైతన్యమతమును నేజాతివారైన నవలంబింపవచ్చును. చైతన్యమతస్థులకు శ్రీకృష్ణనామస్మరణమును సదా చేయుటతప్ప మఱియొకకర్మకాండ లేదు. చైతన్యమతమునుగూర్చిన గ్రంథములిప్పుడును బంగాళాదేశమందెల్ల వ్యాపకములోనున్నవి. చైతన్యునివంటిశిష్యుని, మహాభక్తునిబుట్టింపఁగల్గిన నవద్వీపము చాలమహోన్నతమై గాంచియుండుటకేమిసంశయము? కాని, పాశ్చాత్యవిద్యామోహమీవిద్యాపీఠము క్షీణించుటకు గారణమైనది. ఇచ్చటి 'తోల్' యను సంస్కృతపాఠశాలల సంఖ్య యాయాకాలములలో నెట్లుండెనో నాడియాగజెటీరులో నిట్లువ్రాయబడియున్నది.

| సంవత్సరము. | పాఠశాలలసంఖ్య. | విద్యార్థులసంఖ్య. |
|---|---|---|
| ౧౮౧౬ | ౫౬ | ౩౮౦ |
| ౧౮౧౮ | ౩౧ | ౨౪౨ |
| ౧౨౭౯ | ... | ౫౦౦ నుండి ౬౦౦ వరకు |
| ౧౮౬౪ | ౧౭ | ౧౫౦ |
| ౧౮౮౧ | ౭౦ | ౧౦౦ |
| ౧౯౦౧ | ౪౦ | ౭౨౪ |
| ౧౯౦౮ | ౩౦ | ౭౫౦ |

౧౮౧౮ సం॥రములోనుండిన ౨౧ బడులలోను ౧౭ బడులలో న్యాయదర్శనమును, ౧౧ బడులలో ధర్మశాస్త్రమును, తక్కినమూడింటిలో నొక్కొక్కదానిలో వరుసగా కావ్యములు, జ్యోతిషము, వ్యాకరణమును బోధింపఁబడుచుండెను.

నడియాయందలి 'టోల్' అను సంస్కృతపాఠశాల యొకగడ్డియింటిలో నుండును. ఇచట పండితుఁడు శిష్యులకు పాఠములు చెప్పును. ఇచటనే యొకయంగణము చుట్టును మట్టిగోడలతోనున్న గుడిసెలలో విద్యార్థులతిమిక్కిలి పేదగా కాలక్షేపము చేయుచుందురు. ఒకొక్క విద్యార్థి కొకగుడిసె యుండును. ఇందులో వానియుత్తరీయము, చెంబును, చాపయుఁ దప్ప మఱియేసామగ్రియు నుండదు. విద్యార్థి ధర్మశాస్త్రము నభ్యసించుట కెనిమిదిసంవత్సరములును, న్యాయము నభ్యసించుటకు పదివత్సరములును నిచట వాసము చేయును. పండితుఁడు పాఠశాలయొద్ద కాపురముండక యధ్యయనకాలమున కచటికి వచ్చుచుండును. అధ్యయనము తెల్లవారుజామునుండి సూర్యాస్తమయమువఱకును జరుగుచుండును. గురువే తనసొమ్ముపెట్టి పాఠశాలను, గుడిసెలను కట్టించి ప్రతిసంవత్సరము నేయించుచుండును. విద్యార్థులే జీతమును నీయనక్కఱలేదు. కొలఁది కాలముక్రిందటివఱకును గురువే విద్యార్థులకు భోజనమును, బట్టలను నిచ్చి పోషించుచుండెను. వార్షికములవలనను వివాహోపనయనకాలములందుదొరకిన సంభావనలతో నీతఁ

డిట్టివ్యయము చేయ సమర్థులై యుండెను. ఒక్కొక్క పాఠశాలలో సగటున ౨౫ గురు విద్యార్థులుందురు ఈ విద్యార్థులు తమజీవనమున కేమియు లేనివారై యుందురు, గురువుచితముగా వసతి నిచ్చి, పాఠములు చెప్పుచుండఁగా, వీరు తిండికిని బట్టలకును వర్తకులను, భూస్వాములను యాచించియు, పర్వదినములందు భిక్షాటనము చేసియు కావలసిన ధనమును సంపాదించుకొందురు.

నడియాలో న్యాయశాస్త్రమే ముఖ్యముగా నభ్యసింపఁబడుచున్నను సంస్కృతపాఠములు వ్యాకరణపాఠములుఁగూడ జరుగకపోలేదు. ఇచట సాధారణముగా వాక్యార్థములు జరుగుచుండును. అందు వాదబలముచే ప్రతిపక్షినోడఁగొట్టగలవాఁడు బహూకరింపఁబడును.

౧౮౬౭ సం॥రమున నడియాపాఠశాలలఁ జూచిన కవెలు గారీపాఠశాలలఁగూర్చి యిట్లు వ్రాసియున్నారు. "తరతరముల నుండియు సత్యాన్వేషణపరులగు శిష్యులకుపన్యాసము లిచ్చుచు నీగుడిసెలను నుపన్యాసమందిరములందు ప్రాచీనవిద్య విచ్ఛిన్నముగాకుండ కాపాడుకొనవచ్చుచున్న యీగురువులను చూచి నాకు మిక్కిలి యభిమానము జనించినది. తన చుట్టును శిష్యవర్గము వలయాకారముగా, గూర్చుండియుండి గురువు వారికి సూక్ష్మములైన న్యాయమర్మముల విప్పిచెప్పుచుండును. ఆయుపన్యాసమును వినుటవలన నైరోపావాసునికి తలదిమ్ము

పట్టిపోవును గానినడియావిద్యార్థిఃప్రతివిషయమును సూత్రముతప్పక యనుసరింపఁగలఁడు. నేను వెళ్లినప్పుడచట మధ్యవయస్సునందున్నవారును, వెంట్రుకలు నెరసినవారును విద్యార్థులుగానుండిరి. ” అని.

---

శ్రీరస్తు.

# ప్రాచీనవిద్యాపీఠములు.

## †కాకరపఱ్ఱు.

---

ఇది కృష్ణాజిల్లాలో వసిష్ఠాతీరమున బ్రహ్మకుండక్షేత్రమునకు సమీపముగానున్నగ్రామము. ఇచట చాలకాలమునుండియు సంస్కృతవిద్య నెలకొనియున్నది. మూఁడు వందల యేండ్లకుపూర్వమునుండియు నిచటవిద్య జరుగుచుండెనని యిచటివారు చెప్పుదురు. ఇచ్చట శాస్త్రములందు చాలగొప్పవారాదినుండియు నుండిరని తెలుపుటకు నీక్రిందికథఁ జెప్పుచున్నారు. చాలకాలముక్రిందట నుద్దండభారతీస్వాములవారను నొకయతీశ్వరుఁడుండెనఁట. అతఁడు కాశియందు సకలశాస్త్రముల సామూలాగ్రముగ నభ్యసించితినను గర్వముచేఁ దనతో శాస్త్రవాదమును దొలుత చేసినఁగాని భిక్షఁగైకొనువాఁడు కాఁడఁట. తనతో నాతఁడెప్పుడును నొకబంగరుచేటను నొకబంగరుచీపురును నుంచికొని, విద్వాంసులనిట్లు చెరిగి యిట్లుతుడిచివేసెదనని చెప్పుచుండెనఁట. ఆతఁడు దిగ్విజయముఁ జేసికొని తుదకు కాకరపఱ్ఱుచేరి యచటివారితోడను శాస్త్రచర్చయయినఁగాని

భిక్షుం గైకొనన నేనంట. అచటి పండితులాతని చుట్టుం జేరి యాత
నిప్రశ్నలకుత్తరముల నిచ్చుట యేగాక, యాప్రత్యుత్తరముల
యందే యాతనికి బ్రశ్నలు వేయుచుండిరట. స్వాములవారు
ను వారి వైదుష్యమునకు విస్మయపడి యోడిపోయితిననియొప్పు
కొనంజాలక, కవిత్వమున నెవరికైన బ్రజ్ఞకలదా యని, "ఆశ్చ
ర్యమాశ్చర్యమతఃపరంకిమ్" అను సమస్యనిచ్చెనట వెంట
నేయొక పిల్లకవి లేచి,

"యోగీశ్వరో వాఽపి యతీశ్వరో వా
విద్వత్ప్రభుర్వా మదనాంతకో వా
కాంతాలకాంతానవచిత్తవృత్తిః
ఆశ్చర్య మాశ్చర్యమతఃపరం కిమ్."

అని సమస్యం బూర్తి చేసెనట. అంతనాయతి యోడితినని
యొప్పుకొని యచటినుండి వెడలిపోయెనట.

ఈకథవలన నచట సర్వశాస్త్రములును, గవిత్వమును
జిరకాలమునుండియు హెచ్చుగా నభ్యసింపబడుచుండిన వని
మాత్రము మనము తెలిసికొనగలము. కుండలీగ్రంథము
నన్వయింపగలవారును పూర్వకాలమున నీగ్రామమున నుండి
రట. ముఖ్యముగా నీగ్రామమున నలంకారశాస్త్రమునందు
గట్టివారుండిన ట్లిక్కడి విద్వాంసులు రచించిన యలంకార
గ్రంథములంబట్టి తెలియుచున్నది. చర్లవారిలో నొకరు సా
హిత్యరత్నాకరవ్యాఖ్యను వ్రాసెను. అనివిళ్లవారిలో నొకరు
అప్పారాయ యశశ్చంద్రోదయమను నలంకారగ్రంథము

ను వ్రాసి తణుకు తాలూకలోని ముక్కిరాలపాడు అనేవల్లూరి పల్లి నగ్రహారముగాఁ బడసిరి. మఱియొకరు వాసిరెడ్డివారి పై అలంకారముక్తావళిని వ్రాసిరి. అనిసింగరాజు వారిలో నొకరు జ్యోతిషమునందు ప్రజ్ఞకలిగి హైదరాబాదు నవాబునకు జ్యోతిషముచెప్పి యొకయగ్రహారము సంపాదించెనట. మొగలితుర్రు రాజుల యాస్థానమున చర్ల బ్రహ్మయ్యశాస్త్రిలుగారుండి మంచియశస్సుగాంచిరి.

ఇచట శాస్త్రములు, సాహిత్యమునేగాక వేదము, అవధానములందుఁగూడ ప్రఖ్యాతిఁబడసిన వారనేకులు గలరు. గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోని విద్యాలయములందలి పండితులందఱును సాధారణముగా కాకరపఱ్ఱులోనే విద్యనభ్యసించినవారై యున్నారు. ఇచట నింకను సంస్కృతపాఠశాల సాగుచునే యున్నది. ఈపాఠశాలలోఁ జదువుటకు చాలదూరపుజిల్లాలనుండియు విద్యార్థులు వచ్చుచుందురు.

† అభినవపండితరాజ బ్రహ్మశ్రీ అల్లమరాజు రామశాస్త్రిలవారి "సంస్కృతపాఠశాలావిజయ" మను నముద్రితగ్రంథమునుండి పైవిషయములు సంగ్రహింపఁబడినవి.

శ్రీరస్తు.

# ప్రాచీనవిద్యాపీఠములు.

## జ్యోతిశ్శాస్త్రములు.

పూర్వకాలమునుండియు మనదేశము గణితమునకుఁ బ్రసిద్ధికెక్కియున్నది. అందున జ్యోతిశ్శాస్త్రము వేదమునకొక యంగముగా జేర్పఁబడియేయున్నది. వేదములోని జ్యోతిర్విషయములఁ గనికొనియే తిలక్, జాకోబీ, దీక్షిత్, మొదలగువారు వేదకాలమును నిర్ణయింపఁబ్రయత్నించిరిగాని, వారివాదమునకు తగినంతబలము వేదములో కానరాదని కయే(Kaye) గారనుచున్నారు. వేదకాలములో మాసమునకు 3౦ రోజులచొప్పున ౧౨ మాసములును, అప్పుడప్పుడొక యధికమాసమును నుండెను. సంవత్సర ముత్తరాయణ దక్షిణాయనములుగాఁ గూడ విభజింపఁబడియుండెను. ఋగ్వేదములో రెండుమూఁడు నక్షత్రముల పేళ్లే తెలుపఁబడినవి గాని తక్కిన సంహితలలో ౨౮ లేక ౨౭ నక్షత్రములను నీయఁబడివి. ఈనక్షత్రములలో నపుడు కృత్తిక మొదటిదానినిగా నెంచుచుండిరి. ఇప్పుడు మనకశ్విని మొదటినక్షత్రము. కృత్తిక మొదటినక్షత్రముగానుండుటంబట్టి వేదకాలము సుమారు క్రీ॥పూ॥ ౨౫౦౦ అని లెక్కలు వేయు

చున్నారు. వేదములలో గ్రహముల పేళ్లు వేఱే తెలియఁజెప్ప లేదుగాని, కొందఱు కొన్ని పదముల కర్థములు గ్రహములపరముగాఁ జెప్పుచున్నారు. గ్రహణములఁగూర్చి వేదములో వ్రాయఁబడియున్నదని లడ్విగ్ (Laduig) గారు చెప్పియున్నారు.

జ్యోతిష వేదాంగము, సూర్యప్రజ్ఞప్తి, యనువానిలో తొలుత జ్యోతిశ్శాస్త్ర విషయములు శాస్త్రముగా వ్రాయఁబడియున్నవి. ఇందు మొదటిదానిలో నైదుసంవత్సరములకొకసారి వర్షచక్రము తిరిగివచ్చును. ఈయైదు సంవత్సరములకును ౧౮౩౦ సాధారణదినములు. సంవత్సరమునకు ౩౬౬ దినములుండుటచేత నిది చాలదీర్ఘముగా నున్నది. ౨౭ నక్షత్రములును నక్షత్రమునకు ౧౩౪ సమాంశములును నిందు చెప్పఁబడియున్నవి. ఈపంచవర్ష చక్రము మకరసంక్రాంతితో నారంభమయియుండెను. శ్రవిష్ఠ దీనికి మొదటినక్షత్రము. అట్లుండుటకీగ్రంథము క్రీ॥పూ॥ ౧౧౦౦ సం॥ర ప్రాంతములలో రచింపఁబడియుండవలెను. సూర్యప్రజ్ఞప్తి యనునది జైనుల జ్యోతిర్గ్రంథము. ఇదియనేక విషయములలో జ్యోతిష వేదాంగమును బోలియున్నది. జ్యోతిర్మండలములన్నియు మేరువు చుట్టును దిరుగునని బ్రాహ్మణులతోఁ బాటు నమ్మియుండుటచేత జైనులిద్దఱు సూర్యులను, ఇద్దఱుచంద్రులను, నక్షత్రగణములను రెంటిని యేర్పాటుచేసికొనిరి. దీనిప్రకారము పంచవర్షచక్రము కర్కాటకములో సూర్యుఁడు పుష్యయందుండఁగా నారంభమగుచున్నది.

దీని ప్రకారము విన్న నక్షత్రములును సమానాంశములుగా విభాగింపబడియుండలేదు.

వరాహమిహిరుఁడు మొదలగు వారు క్రీ॥శ॥ ౫౫౦ ప్రాంతమున గ్రీకులనుండి తాము సంపాదించిన నూతనసిద్ధాంతములను వ్యాపకములోఁ బెట్టిరని కొందఱు తలంచుచున్నారు. గ్రీకుల శాస్త్రమును మన శాస్త్రమును వీరు సమ్మేళనము చేసిరఁట. "రాసుల పేర్లు, ఏడు దినముల వారము, కొంత శాస్త్రపరిభాష, గణితసంజ్ఞలు, మున్నగు వానిని వీరు సేకరించిరి. సాధారణముగా గ్రీకుల సిద్ధాంతములనే వీరు చేకొనిరి. వేదాంగ జ్యోతిషమును వారు చాలమట్టుకు విసర్జించిరి. గ్రీకు పరిభాషను బట్టి హిందువుల జ్యోతిషము చాలమట్టును గ్రీకులనుండి యెఱువు తెచ్చుకొనినదే యని చెప్పవచ్చును." అని కయేగారు వ్రాయుచున్నారు.

వరాహమిహిరుఁడు వ్రాసిన పంచసిద్ధాంతిక పైతామహ, వాసిష్ఠ, రోమక, పౌలిశ, సౌరసిద్ధాంతముల సారమై యున్నది.

హిందువుల జ్యోతిశ్శాస్త్రగ్రంథములలో నెక్కువ ప్రచారములోనున్నది సూర్యసిద్ధాంతము. తరువాతి గ్రంథములన్నియు దీనియనుకరణము లే. దీని ప్రకారము భూమి నిరాధారము లేక, చలనము లేని గోళము. దీని చుట్టును ఎక్కువ జ్యోతిర్గణము తిరుగుచుండును. దీని యొక్క వ్యాసము (Deameter) ౧౬౦౦ యోజనములు దీనికి, చంద్రునికిఁ గల దూరము ౫౧,౫౮౦ యోజనములు.

తక్కిన గ్రహములకాలతలన్నియు నవి సమానగతిగలవను నుద్దేశముతో లెక్క వేయఁబడినది. వీనిలో ౪,౩౨౦,౦౦౦ సంవత్సరములుగల వర్షచక్రము పయోగింపఁబడినది.

ఈచిన్నగ్రంథమునందు జ్యోతిశ్శాస్త్రచరిత్రగూర్చిన చాలవిషయములను విడిచివేయవలసినది. ఆర్యభటుఁడు భూమితనయిరుసుపై చలనముకలిగియున్నదని నుడివెను. గ్రహణములుకలుగుటకైతఁడు కారణములను నిరూపించెను గాని యవి యంగీకృతములు కాలేదు. బ్రహ్మగుప్తభాస్కరులు కొన్ని యంశములలో సూర్యసిద్ధాంతము నంగీకరింపలేదు. కాని మొత్తముపై దానినే యనుసరించిరి. సూర్యసిద్ధాంతము రచింపఁబడిన తరువాత హిందువులజ్యోతిశ్శాస్త్రసిద్ధాంతములలో నేమార్పును గలుగలేదనియే చెప్పవచ్చును.

క్రిస్తుశకజ్యోతిశ్శాస్త్రజ్ఞులలో మూఁడుమతములవా రున్నారు. ౧. సౌరపక్షము. ౨. ఆర్యపక్షము. ౩. బ్రహ్మపక్షము ను నీమతములలోని భేదములలో నొకటి సంవత్సరమునం దుండు దినముల సంఖ్యను గూర్చినది.

| | ది. | గం. | ని. | సె |
|---|---|---|---|---|
| సౌరపక్షములో | ౩౬౫ | ౬ | ౧౨ | ౩౬,౫౬ ను |
| ఆర్యపక్షములో | ౩౬౫ | ౬. | ౧౨ | ౩౦ ను |
| బ్రహ్మపక్షములో | ౩౬౫ | ౬ | ౧౨ | ౩౦,౯౧౫ |

ను నున్నవి.

హిందువులలో శంకుతోఁగూడిన నలికాయంత్రమును ఘటికా (Clepsydra) యంత్రమును ముఖ్యములైనవని పాశ్చాత్యశాస్త్రజ్ఞులు తలంచుచున్నారు. గోళము (Sphere) కూడ నుపయోగములోనుండినట్లు గ్రంథములవలనఁ దెలియుచున్నది. పురాతనయంత్రములలో ఘటికాయంత్రమొక్కటే దానిఁ గూర్చిమాత్రమే మనకిప్పుడు బాగుగఁదెలియును. అతిప్రాచీనకాలములో నీదేశమున జ్యోతిశ్శాలలున్నట్లు తెలియదు.

కాని యిప్పుడుమనదేశములో సుప్రసిద్ధములగు నాలుగు జ్యోతిశ్శాలలున్నవి. మొదటిది ఢిల్లీయందున్నది. దీనికి "జంతర్ మంతర్" అనిపేరు. ఇది ప్రస్తుత ఢిల్లీపట్టణమున రైల్వేస్టేషనునుండి గవర్నమెంటు హౌసుకుపోవు మార్గమునంటియున్నది. ఈజ్యోతిశ్శాలయందు ౧. స్రమాట్‌యంత్రము, ౨. జయప్రకాశము, ౩. రామయంత్రము, ౪. మిశ్రయంత్రమునని నాలుగుయంత్రము లున్నవి. వీనిలో స్రమాట్‌యంత్రమునందు షష్ఠాంశయంత్రమును, మిశ్రయంత్రములోని యతిచక్రము, దక్షిణోవృత్తియంత్రము, కర్కటరాశివలయమునను యంత్రములును జేరియున్నవి. ఈజ్యోతిశ్శాలను జయసింగు క్రీ॥శ॥ ౧౭౧౦లోనో ౧౭౨౪ లోనో నిర్మించియున్నట్లు తెలియుచున్నది.

రెండవజ్యోతిశ్శాల జయపురములోనిది. దీనియందున్న యంత్రములు స్రమాట్‌యంత్రము, షష్ఠాంశయంత్రము, రాశీవలయయంత్రము, జయప్రకాశము, కపాలము, రామ

యంత్రము, దిగంశయంత్రము, నరివలయయంత్రము, దక్షిణోవృత్తియంత్రమునునవి. ఇవిగాక ఉన్నతాంశయంత్రము, చక్రయంత్రము, క్రాంతివృత్తిచక్రము, ననుయంత్రములును నీనక్షత్రపరిశీలనశాలయందు కలవు. దీనిని జయసింగు ౧౭౩౪ సం॥రమున గట్టించెను.

మూడవది ఉజ్జయినిలోనున్నది. ఉజ్జయినికవంతియను పేరు. ఇచటినక్షత్రశాల ప్రస్తుతపుటుజ్జయినిలో, శిప్రానదీతీరమున జయసింగపురమను భాగముననున్నది ఇచ్చటనున్న యంత్రములుసమ్రాట్యంత్రము, నరివలయయంత్రము, దిగంశయంత్రము, దక్షిణోవృత్తియంత్రమునునవి. ఇవియన్నియు శిథిలావస్థలోనున్నవి. తగినజాగ్రతతీసికొనని యెడల నివియచిరకాలమున నరూపుమాసిపోవును. పాశ్చాత్యులకిప్పుడు గ్రీనిచ్ ఎట్టిదో పూర్వకాలమున భరతవర్షమున నుజ్జయినియట్టిదయి యుండెను. ఈపట్టమునుండియే లంకావృత్తమునుండి దూరమును గొలుచుచుండిరనియు, జ్యోతిశ్శాస్త్రమునకిదియాదిపీఠమైయుండెననియు నిప్పటికిని చెప్పికొనుచున్నారు. ప్రపంచమునందీ పట్టణమున జ్యోతిర్విద్యయెక్కువగా ప్రబలియుండెను. ఇకముందుదానిపూర్వోన్నత్యమున కడివచ్చునుగాక. ఇచటి నక్షత్రశాలను గూడ జయసింగే కట్టించెను.

నాలుగవది కాశీలోనున్నది. దీనికి 'మాన్ మందిర్' అని పేరు. ౧౭ వ శతాబ్దారంభమున నంబరపురాధీశుఁడుగానున్న మాన్‌సింగుదీనినిగట్టించెను. ఇదిగంగకెడమయొడ్డున మణికర్ణి

కాఘట్టమునకు సమీపములో నున్నది. మాన్‌సింగుకట్టించిన మందిరముపై జయసింగు క్రొత్తయంత్రములను నిలిపెను. దీనియందున్నయంత్రములు సమ్రాట్‌యంత్రము, నరివలయము, దిగంశయంత్రము, చక్రయంత్రమునున్నవి.

ఇట్టిస్థలములయందు గొప్పగొప్పజ్యోతిశ్శాస్త్రజ్ఞులనేకులు చేరియుండిరి. వీరిచుట్టును శిష్యబృందముండెను. వీరందరునుగలిసి జ్యోతిశ్శాస్త్రమును నాటినుండి నేటివఱకును కొనసాగఁజేయుచున్నారు. కాని యీశాస్త్రము మఱివృద్ధికాకుండ నిలిచిపోవుట శోచనీయము. జ్యోతిశ్శాస్త్రముపై నిపుడభిమానమే తగ్గిపోవుచున్నది. కేవలము జాతకములువ్రాయుటకును, ఫలములను దెలిసికొనుటకు మాత్రమిపుడిది యుపయోగించుచున్నది. పంచాంగములువ్రాయువారియందు విమర్శతక్కువ. మొదటపంచాంగములయందు నమ్మకమున్నవారును, దానిననుసరించువారును నెక్కువగనుండినగద యట్టివిమర్శయవసరమగును? కాని, పూర్వకాలమున పంచాంగములయుపయోగము ప్రసిద్ధముగను, ప్రతికార్యమునకును గావలసియుండెను. అట్టిసమయమున నాశాస్త్రము మహోన్నతదశయందుండి యభివృద్ధినొందియుండుట కేమిసంశయముండును?

---

శ్రీరస్తు.

# ప్రాచీనవిద్యాపీఠములు.

---

## ఇతరవిద్యాపీఠములు.

ఇంతవఱకు నేవో కొన్ని విద్యాపీఠములఁగూర్చిమాత్రమే వ్రాయఁబడినది. కాని, భరతవర్షమనాదినుండియు విద్యలకాటపట్టైయుండ గసంఖ్యేయములగు స్థలములయందు విద్యాలయముల నెలకొని యుండెననుట యతిశయోక్తి కానేరదు. వేదకాలమునఁబట్టి పూర్వముండిన విద్యాలయములు క్షీణించుటయుఁ, గొత్తచోటుల మఱికొన్ని తలచూపుటయుఁ దటస్థించుచుండెను. అన్నిటిఁగూర్చియు వ్రాయుటకిచట నవకాశము లేదు.†

ఆయాస్థలములు విద్యాపీఠములుగా నేర్పడుటకు కొన్ని కారణములు కానవచ్చుచున్నవి. బౌద్ధవిహారములున్నచోటెల్ల సాధారణముగా విద్యల కాటపట్టులై యుండెను. బౌద్ధ

† ఆంధ్రదేశమందు ప్రఖ్యాతివడసిన విద్యానిలయముల నాదినుండియు నుండినవనుటకు సంశయములేదు. అట్టివానిచరిత్రఁ దెలిసినవారు దయయుంచి నాకు దెలిపినచో నీపుస్తకమున పునర్ముద్రణసమయమున నాయావృత్తాంతములఁ జేర్చుటకు వీలుగనుండును. గ్రంథకర్త.

విద్యను, మతమును దమదేశమున వ్యాపింపఁజేయనెంచి విద్య లనేర్చుకొనుటకును, మతగ్రంథములను సంపాదించుటకును మనదేశమునకు వచ్చినవారిలో ఫాహియాను, ఉద్యాన, పురుషపుర, (Peshawar) మధుర (గుజరాతులోనిది), సంకాస్య, కన్యాకుబ్జ, సాకేత, శ్రావస్తి, కపిలవస్తు, రామగ్రామ, వైశాలి, పాటలీపుత్ర, రాజగృహ, శ్రితపర్ణ, గయా, చంపా, నాలందా, తామ్రలిప్తులను స్థలములను దర్శించి యుండెను. ఉద్యాన, తక్షశిలా, సింహపుర, ఉరశ, కాశ్మీర, పునచ, రాజపురి, శ్రావస్తి, కపిలవస్తు, రామగ్రామ, కుశీనగర, వారణాసి, ఘాజీపుర, వైశాలి, నేపాల, హిరణ్యపర్వత, చంపా, కజింగడ, పుండ్రవర్ధన, కామరూప, సమతట, తామ్రలిప్తి, వేంగీ ధనకటకములనేకాక, చోళద్రవిడదేశములందలి విద్యాపీఠములను, సురాష్ట్ర, సింహళ, కొంకణాపుర, భరుకచ్ఛ, అటలీ, కచ్ఛ, వలభి, ఆనందపుర, ఉజ్జయినీ, మహేశ్వరపుర, మూలస్థానపురములును హయానుత్సాంగు దర్శించినవి. ఈట్సింగు అనునాతఁడు తామ్రలిప్తి, హరికేల, రాజగృహ, గయా, నాలందా, వైశాలి, కుశీనగర, కపిలవస్తు, శ్రావస్తి, వారణాసులను సందర్శించెను.

గొప్పమతాచార్యులు స్థాపించిన మఠములును విద్యలకు నెలవై యుండును. శ్రీశంకరాచార్యులవారు తాముబోధించిన యద్వైతసిద్ధాంతములను వ్యాపింపఁజేయుటకు శృంగేరిమొదలగుస్థలములయందు మఠములను స్థాపించిరి. విశిష్టా

ద్వైత సిద్ధాంతముల వ్యాపనమునకు శ్రీరామానుజయతీంద్రుఁడును బన్నిద్దఱాళ్వారులచేఁ దనకుఁ బూర్వముననే పవిత్రవంతములఁజేసిన కంచి, శ్రీరంగము మొదలగు స్థలములందు మఠములనేర్పఱచిరి. ఉడిపి, మధుర మొదలగు ప్రదేశములందు ద్వైతమతప్రవర్తనమునకై శ్రీమధ్వగురుఁడు స్థాపించిన మఠములును ప్రఖ్యాతికెక్కియున్నవి. ఇట్లే మహావీరుఁడు వల్లభేంద్రుఁడు, చైతన్యుఁడు మొదలగువారు ననేకమఠములను స్థాపించిరి. వీనియందెల్ల వేదాంతచర్చజరుగుచు, శాస్త్రములభివృద్ధి నొందుచుండెను.

ప్రసిద్ధిపొందిన దేవాలయములందు ప్రదేశములును విద్యలకాటపట్లయి విలసిల్లుచుండెను. ఇట్టివానిలో కాశీగూర్చి వేఱచెప్పనక్కఱలేదు. జగన్నాథము మతవిద్యలకు నెలవు. శ్రీకూర్మము మూఁడుమతములవారికిని తావైయుండెను. సింహాచలము, కాళహస్తి మొదలగుస్థలములు విద్యలకు పూర్వకాలమునఁ బ్రసిద్ధిఁబడసి యుండెను. శ్రీశైలము కాలాముఖులను శైవాచారులకాటపట్టై యుండెను. వీరికి విద్యావ్యాపనమునందుఁగల యుత్సాహము ప్రశంసాపాత్రము. ఈరీతిగా దేవాలయములున్నచోట్ల నెల్ల విద్యార్థులు చేరుచు నార్యవిద్యలఁ గాపాడుచుండిరి.

నదీతీరములకును, విద్యలకును విచిత్రమగు సంబంధమేర్పడినది. గంగా, గోదావరీ, కావేరీ మొదలగు నదీ

ప్రాంతములనున్నవారు విద్యలయం దధికముగాఁ గాన్పించుచున్నారు. సాధారణముగాఁ బుణ్యనదులయొడ్డున బ్రాహ్మణులు నివాసము లేర్పఱచికొనియుండి, యాప్రాంతములందు విద్యలను సాగఁజేయుచుండిరి.

బ్రాహ్మణాగ్రహారములు విద్యాస్థానములుగా నుండుటయందు వింతయేమియు లేదు. రాజులనుండియో, మఱియెట్లో బ్రాహ్మణు లగ్రహారముల సంపాదించి, తమవిద్యలను శిష్యులకు బోధించుచు, నవి విచ్ఛిన్నములు కాకుండ కొనసాగించుచు వచ్చిరి. బిట్టువాడ, కృష్ణారాయపురము, కాకరపఱ్ఱు, పేరూరు మొదలగు నాంధ్రదేశమందలి యగ్రహారములిందు కుదాహరణములు.

అగ్రహారములందే గాక గొప్పపండితుఁ డొక్కఁడైనను వాసముండినస్థలమును గొంతకాలమువఱకు విద్యలకు నెలవులై యుండెను. అట్టిస్థలములలో ధవళేశ్వర మొకటి. ఇచట చర్ల బ్రహ్మయ్యశాస్త్రిగా రనేకులగు శిష్యులకు విద్యాదానము చేసినవిషయము ప్రఖ్యాతము. వీరియశస్సును విఖ్యాతకవిశిరోమణులగు తిరుపతివేంకటేశ్వరులు లోకమున వ్యాపింపఁజేసినారు. ఆంధ్రదేశమున కవిత్వము దొమ్మరివిద్యగాఁ బరిణమించినసమయమున, దానికి క్రొత్తశృంగారములను, గళలను బుట్టించి తిరిగి యది చవులూరునట్లుచేసి, యాంధ్రవాఙ్మయచరిత్రయందు క్రొత్తయుగమును గల్పించిన యీకవిశేఖరులవంటివారికి గురువగు బ్రహ్మయ్యశాస్త్రులవారి [illegible]

సించుటచే ధవళేశ్వరము ధన్యమయ్యెను. ఇట్లే యితరస్థలములయందును బండితులును, విద్వాంసులును నివసించుచు శాస్త్రాభివృద్ధిఁ జేయుచుం దమశిష్యులను బ్రఖ్యాతులగునట్లు చేయుచుండిరి.

ఇంతవఱకును వివరింపఁబడిన స్థలములయందు రాజాదరణమున్నను, లేకున్నను విద్య సాగుచునే యుండెను. ఈస్థలములే చాలకాలమువఱకు నిలిచియుండిన విద్యాపీఠములు. రాజాదరణముఁ గలిగినచో నవి మఱింత ప్రఖ్యాతములై యుండుటకు వీలుండును. విద్యాభిమానులగు నాయారాజుల యాస్థానముల కనేక విద్వాంసులు, పండితులు, కళానిపుణులును జేరుచు వానిని మహోన్నతవిద్యాస్థానములుగ నొనర్చుచుండిరి. వీరిసంపర్కముచే రాజులును విద్వాంసులగుచుండిరి. ఇట్టి రాజస్థానముల నన్నిటి నిచట పేర్కొనుట కవకాశము లేదు. కనిష్కుఁడు, అశోకుఁడు, చంద్రగుప్తుఁడు, హర్షుఁడు, మొదలగువారు విద్యల నెట్లు పోషించిరో జగద్విఖ్యాతము. రాష్ట్రకూటరాజగు నృపతుంగుఁడు కన్నడవిద్వాంసులను, చోళరాజరాజు తమిళవిద్వాంసులను, చాళుక్యరాజరాజు తెనుఁగువిద్వాంసులను బోషించుటఁగూర్చి యందఱికిని దెలిసిన విషయమే. ధారానగరాధినాథుఁడగు భోజునకు విద్యాపోషణమునందు పెట్టినది పేరు. బుక్కరాయాదుల యాస్థానమున సాయణాచార్యులు మొదలగువారి యునికియు, మనమసిద్ధికా

లమున నెల్లూరు తిక్కనాదులయునికియు, ఓరంగల్లున శైవమతప్రవర్తకులయుఁ గవీశ్వరులయు నునికియు, విజయనగర కృష్ణదేవరాయల సభయం దష్టదిగ్గజముల యునికియు, తంజావూరు రఘునాథభూపతియాస్థానమున ననేకవిద్వత్కవులఁ గళాప్రవీణుల యునికియు, నాయాచక్రవర్తుల యశస్సును వేనోళ్ళ చాటుచున్నది. పూర్వకాలమునుండియుఁ బీఠికాపురాధిపతులు విద్యాపోషకులుగానుండిన సాంప్రదాయము నిప్పటిరాజావారును నిలువఁబెట్టుచు ననేకవిధములుగ నార్యవిద్యాభివృద్ధికి తోడ్పడుచున్నారు. శ్రీఆనందగజపతి మహారాజులుంగారి పోషణయందు సమస్తవిద్యలును విజయనగరమున విజృంభించినవి. ఆంధ్రవిశ్వవిద్యాలయస్థాపనమునకు విజయనగరము మఱియేస్థలమునకును దీసిపోదు. బొబ్బిలిసంస్థానముమాట వేఱె చెప్పనక్కరలేదు. వెంకటగిరి, గద్వాల, నూజవీడు మొదలగు సంస్థానములును విద్యాపోషణమునఁ బ్రఖ్యాతినొందియున్నవి.

విద్యానిలయము లీరీతిగా భరతవర్షమున సర్వసాధారణముగా నెల్లచోట్లను బ్రబలియుండెను. ఇక సామాన్య పాఠశాలలన్ననో గ్రామమున కొకటిచొప్పున నుండియేయుండెను. అవి యిప్పటిబడులవలె సంవత్సరమున కొకసారి "ఇన్స్పెక్టరు"గారు "తనిఖీ"కి వచ్చినప్పుడుమాత్రమే తెలియఁబడక, గ్రామస్థుల నిరంతరశోధనలకుఁ బాలయియుండి బాగుగ సాగు

చుండెను. ఇప్పటి విద్యాస్థితిని తలంచుకొనిన నెంతయు విచారము కలుగకపోదు. ఆరుగ్రామములకొకబడి, ఐదు చదరపు మైళ్ళలో నున్నవారికొకబడి. అదియైనను సరిగ జరుగునది కాదు. వీనికై వ్యయమధికము. పాఠములుచెప్పు నయ్యవారులకంటె తనిఖీచేయువారి పైవ్యయమే హెచ్చు. పన్నులు చెల్లించువారిపై భారము పెరిగిపోవుచున్నది. వారు తమపిల్లలు చదువుకొనుచున్నారని చంకలు గుద్దుకొనుటయేగాని, యేమి చదువుచున్నారు? ఎట్లు చదువుచున్నారని కనుగొననైన కనుగొనరు. చదువవచ్చినవారిసంఖ్య (అనగా సంతకము చేయఁగలవారిని కలిపికొని) నానాఁటికి హెచ్చిపోవుచున్నది. నివేదికలయం దట్టహాసముగా మాత్రముండును. దీనిఁజూచి మోసపోవువారెవరు?



శ్రీరస్తు.

# ప్రాచీనవిద్యాపీఠములు.

---

## ఉపసంహారము.

హిందూ దేశమున నాధ్యాత్మికవిద్యయే ప్రబలియుండెననియు, జనులెప్పుడును నాముష్మికచింతతోడనే కాలము గడుపుకొనుచుండిరనియు, బ్రాహ్మణులే విద్యలనభ్యసించుచుండిరిగాని బ్రాహ్మణేతరులకు విద్యయనునదే లేదనియు; నీ బ్రాహ్మణులు తాము జ్ఞానసంపన్నులయి యితరులనంధకారములోముంచియణఁగఁద్రొక్కిరనియుఁ గొందఱు తలంచుచున్నారు. ఇది కేవలము నసత్యము. ఆధ్యాత్మికవిద్య బ్రాహ్మణేతరులందు లేదందురా? పురాణపఠనము సర్వసాధారణముగా నవలంబింపఁబడియుండుటయు, నీపురాణములయందాధ్యాత్మికవిజ్ఞానము సర్వజనసుబోధమగునట్లు ఎల్లరునుత్తమజీవనములను మహాత్ముల చరితముల నాదర్శములఁ జేసికొని సత్ప్రవర్తనము గలిగియుండుటకై యుత్తేజముఁ గలిగించు నితిహాసములతోఁ గూడ బొందుపఱుపఁబడియుండుటయుఁ జూడ నాయాధ్యాత్మికవిద్య జనులయందు వ్యాపించియుండెననియే చెప్పవలయును. ధనసంపాదనమునకును, సౌఖ్యజీవనమునకును వలయు విద్య బ్రా

హ్మణేతరులయందు లేదందురా. ఇది మొదటియపవాదముకంటె నసత్యము. ధనమంతయు బ్రాహ్మణేతరుల యొద్దేయుండెను. అధికారమంతయు వారిదే. బ్రాహ్మణులు 'సీతారామాభ్యాన్నమః' యను మంత్రమును పారాయణ జేయువారై యుండిరి. ఉపనయనమునాఁడే వారికి 'భవతిభిక్షాందేహి' 'అమ్మా బిచ్చముమ్మా' యనుమాటలు నేర్పుచువచ్చిరి. నాఁటికి నేఁటికి బ్రాహ్మణులస్థితి యట్లేయున్నది. † ఈనడుమ పాశ్చాత్యదర్శములపై భ్రమపుట్టి, బ్రాహ్మణేతరులతోపాటు బ్రాహ్మణులునుపట్టి తమధర్మమునుండి తొలఁగియున్నారు. బ్రాహ్మణులు తమతో పోటీకిదిగుచున్నారని బ్రాహ్మణేతరులు భ్రమపడుచున్నారు. కాని పాశ్చాత్యమోహమునఁబడిన బ్రాహ్మణులసంఖ్య చాలతక్కువయే. మొదటినుండియు నార్యధర్మములఁగాపాడుకొనుచువచ్చిన బ్రాహ్మణులలో నీకొలఁదిమందియైనను దమకర్తవ్యమును మఱువక శీఘ్రముగ నామోహమునుండి తప్పించుకొందురుగాక.

కట్టుబాట్లులేని సంఘములు నశించును. సంఘమునందలి వివిధభాగములవారు తమతమధర్మములను మాత్రము నిర్వహించుకొనుచు, నితరులవృత్తులలోనికిఁ దామును బ్రవేశ

---

† ఇదిగాక బిచ్చమెత్తుకొనుట యొక్క బ్రాహ్మణులకేగాని యితరులు ధనధాన్యములతో తులతూఁగుచుండవలసినదేయని "బ్రాహ్మణేనవినాన్యేషాం భిక్షావృత్తిర్విగర్హితా" యనిశుక్రనీతిసారమున విధింపఁబడి

పెట్టకుండనిచ్చెనేని నానామార్గములందు వివిధవృత్తులవారు ను పూర్ణాభివృద్ధినొంది సంఘమంతయు క్షేమముగా నుండుటకు తోడ్పడుచుందురు. సంఘమనునది మనుష్యునిశరీరము వంటిది. శరీరావయవములు తమకువిధాయకములైన పనులను మాత్రమే చేయుచున్నంత కాలమును నాశరీరవృత్తి నడచుచుండును. కాని, ఒకొక్క అవయవ మొకొక్కరీతిపనిని చేయుటకే యలవాటుపడియుండును. తనకుంగల ధర్మమునువిడిచి యితరావయవధర్మముల నిర్వర్తింప మొదలిడునప్పటినుండియు ననారోగ్యస్థితి యారంభమగును. కడుపాలోచింప మొదలిడుటయు, శ్వాసకోశములు భుజింపనారంభించుటయు, మేదస్సు రక్తప్రసరణముం జేయనారంభించుటయు ముక్కు వినవారంభించుటయు, నసంభవములు. అవితమవృత్తులందప్ప నితర వృత్తులనవలంబింపలేవు. సరేకదా, యట్లారంభించినచో రసాభాసముగా నుండును. శరీరమునకటికిన పాయము సంభవించునట్లు అట్లే సంఘములకు వివిధావయవప్రాయములైన యాయావర్ణములవారు తమధర్మము నతిక్రమించిన సంఘమునంతటికి నపాయముకలుగును. బ్రాహ్మణుడు వర్తకము చేయలేడు. వైశ్యుండు యుద్ధముచేయలేడు, క్షత్రియుండు భూమిసాగు చేయలేడు, శూద్రుండు రాజ్యముచేయలేడు, ఆలోచన చేసి సరియగుపదేశము చేయలేడు ఒకొక్కగుణమొకొక్కవర్ణమువారికి సహజముగా, జన్మసంస్కారముచేత పట్టుపడియుండును. కృషి చేసినయెడల నిటివారు ముక్కుమెరయుత

చేర్చికొనినఁ గొంతవినోదముగా నాసమయమునకుఁ గాన్పింప వచ్చునుగాని యెల్లప్పుడును నట్లేనడచుచుండుట హాస్యాస్పదమగును. అట్లేయొకొక్కప్పుడాయాజాతులవారితరులవృత్తుల స్వీకరించి నూతనసంస్కరణములఁ దీసికొని రాఁబ్రయత్నించినను నవిశాశ్వతముగానుండఁజాలవు. అందుచేతనే సంఘమునందు వర్ణవిభాగము విధిమైయున్నది. ఆయావర్ణములవారుఁ తమతమవృత్తులనే యవలంబించుచుండుట తమయభివృద్ధికిని మొత్తముమీఁద సంఘాభివృద్ధికిని ననితలంచి పనిచేయుచున్నంతకాలమును నాసంఘమారోగ్యము ననుభవించుచుండును. గాని, యొకరినొకరు ద్వేషించుకొనమొదలిడినచోఁ, కడుపు సర్వమును భక్షించివేయుచున్నదని భ్రమపడి, తక్కిన యవయవములు తామేలకష్టపడవలయునని యూరకొనినచోఁ దమకేహానిఁ గల్పించుకొనిట్లాయావర్ణములు తక్కినవారితోఁ బాటు నశించి సంఘనిర్మూలనమును జేయువారగుదురు.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. భగవద్గీత ౩౫

ఇతరుని ధర్మమును బాగుగఁ జేయుటకంటె తనధర్మమును బాగుగఁ జేయఁజాలకుండినను దానియందే కృషిసల్పుట శ్రేయస్కరము. స్వధర్మానుష్ఠానమునందు చావైనను మేలు; పరధర్మముభయావహము" అను భగవద్వాక్యము, నీసందర్భమున స్మరింపవలయును. తొలుదొల్తనీవర్ణవిభాగము జన్మముఁ

బుట్టికలుగలేదు. 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః' యనునట్లు వారివారిగుణములు కర్మలయందలి భేదము చేతనే యది కలిగినది. ఈవర్ణములలో వీరుగొప్ప, వీరుతక్కువను మాట లేదు. ఎవరిధర్మమును వారు నిర్వర్తించుచు న్యాయాకర్మ లంబట్టి జ్యేష్ఠులే యగుచుందురు.

"విప్రాణాంజ్ఞానతోజ్యైష్ఠ్యం క్షత్రియాణాంతువీర్యతః
వైశ్యానాంధాన్యధనతః శూద్రాణామేవజన్మతః." అని
మనువుపదేశించియున్నాడు.

† "బ్రాహ్మణీంక్షత్రియాంకన్యాం వైశ్యాంశూద్రీంతథైవచ
యస్యావతేగుణాస్సంతి తాంమేకన్యాంప్రవేదయ నకు
లేననగోత్రేణ కుమారోమమపశ్చిమః గుణేసత్యేచధర్మేచ
తత్రాశ్రయమతేనః॥"

ఈగుణములుగలకన్య బ్రాహ్మణియైనను, క్షత్రియయైనను, వైశ్యయైనను, శూద్రియైననుసరే. అట్టిదానినిగూర్చి నాకు తెలుపుము. నాపుత్రుడగు (గౌతమునకు) కులగోత్రములతో పనిలేదు. అతనికిగుణము, సత్యము, ధర్మమునేప్రియములు. అనువచనమునుబట్టియు గుణకర్మలే యీవర్ణవిభాగమునకు ముఖ్యములై పూర్వముండెనని తెలియుచున్నది. విద్యయనునదొక్కజాతివారికేగాక అందఱకును సామాన్యముగా లభింపవలసినదే. ఆచార్యుడును నొకవర్ణమువాడయ్యేయుండవలెనను నియమములేదు. "శ్రద్ధధానశ్శుభాంవిద్యా

మానదీతావరాదపి. అంత్యాదపిపరంధర్మం స్త్రీరత్నందుష్కు-
లాదపి॥ " అధమవర్ణమువానినుండియు శ్రద్ధతో శుభమగు
విద్యనుఁబడయవలయును. అంత్యవర్ణమువానినుండియుఁ బరమ
ధర్మమును వినవలయును. దుష్కులమునఁబుట్టినను స్త్రీరత్న
మును చేకొనవలయును." అనుమనువచనము సదాస్మరణీ
యము. ఇట్టివాక్యలు సాధారణముగా నన్నివర్ణములవారికి
సాన్నము, వర్ణసాంకర్యముకలిగించి సంఘమునందలివిజ్ఞానము
నుపలుచనచేయుటయుచితముఁగాదు. "యోఽనధీత్యద్విజో వే
దానన్యత్రకురుతేశ్రమమ్ సజీవన్నేవశూద్రత్వ మాశుగచ్ఛతి
సాన్వయః॥ " ద్విజుఁడు వేదాధ్యయనముఁ జేయక యితర
వృత్తినవలంబించినవెంటనే తనవంశముతోఁగూడ శూద్రత్వ
ముఁ బొందుననుమాట యసత్యముకానేరదు.

పూర్వకాలమున విద్యవృత్తులననుసరించి యేర్పఱుపఁ
బడి సంఘమునకంతటికి నుపయుక్తమగునట్లుండెను. గానిపరుల
యాశ్రయము లేకుగాదు. ఆయావృత్తులవారు తమకుచిత
ములగు పనులనుబాగుగనేర్చికొని యనాదిగనెలకొనియుండిన
విద్యలనుగళలను బోధించుచువచ్చిరి. ఋగ్యజుస్సామాథర్వణ
వేదములును, ఆయుర్ధనుర్గాంధర్వతంత్రములనునుపవేదము
లును; శిక్షా, వ్యాకరణము, ఛందస్సు, కల్పము, నిరుక్తము,
జ్యోతిషమునను, వేదాంగములును, మీమాంసా, వేదాంత,
న్యాయ, వైశేషిక, సాంఖ్యయోగములను దర్శనములును
ఇతిహాసములు, పురాణములు, స్మృతులు, నాస్తికమతము,

అర్థశాస్త్రము, కామశాస్త్రము, శిల్పము, అలంకారశాస్త్ర
ము, సంస్కృతకావ్యములు, దేశభాషాకావ్యములు, యౌవన
మతము, నానాదేశములయాచారములునని ద్వాత్రింశద్విద్య
లు ప్రఖ్యాతములైనవి. మాటలతో నేర్చికొనవలసినవి విద్యల
నియు, మాటలురాకపోయినను నేర్చుకొనదగినవి కళలనియుఁ
జెప్పఁబడును. కళలఱువదినాలుగని ప్రసిద్ధినొందియున్నవిగాని,
విద్యలవలెనవియు ననంతములనియు, నాయాకళలనభ్యసించు
వారు నేర్చికొనువారియందే కృషిసల్పుచుండవలయునని
శుక్రనీతిసారమునఁ జెప్పఁబడినది. ఆచతుష్షష్టికళలపేళ్లుమా
త్రమనుబంధమునఁ బొందుపఱుపఁబడియున్నవి.

ఈయఱువదినాల్గుకళలేగాక యితరకళలునుఁ బూర్వ
కాలమున మనదేశమునఁ బాదుకొనియుండెను. ఈకళలు
బ్రాహ్మణేతరులే యభ్యసించుచుండిరి. ఆయాకళలొక్కొక్క
వంశమున నొక్కటిగా సాగుచువచ్చుచుండెను. తండ్రియే
పుత్రునకు వంశానుగతమగు తనవిద్యను నేర్పుచువచ్చెను.
ఆకళలమర్మముల నొకరొకరు చెప్పుట కిష్టపడరు. ప్రస్తుతకాల
మునను కళారహస్యములను సాధారణముగా వెలిబుచ్చరు.
మనవారిలో పరదేశములకుఁ బోయియావృత్తివిద్యల నేర్చికొ
నుటకు వెళ్లినవారు చెప్పుమాటలనుఁబట్టిచూడగా నాదేశము
లందు మనవారికి ముఖ్యావశ్యకములగు కిటుకులను చెప్పరని
వినవచ్చుచున్నది. ఆకిటుకులు తెలియనిదే నేర్చినవిద్యవొందు

కును పనికిరాదు. కావుననే యీరహస్యములను తండ్రులే పుత్రులకుఁ దెలుపుచు వానినితమవంశములందు కాపాడికొనుచు వచ్చిరి.

స్త్రీవిద్యకూడఁ బూర్వకాలమునఁ *ప్రబలముగనే యుండెను. విదుషీమణులగు నార్యస్త్రీలసంఖ్య యమితముగ నుండెను. ఋగ్వేదమునందలి మంత్రముల రచించినవారిలో విశ్వవర, ఇంద్రిమాతృగణము, వాగ్దేవి, అపాలా, లోపాముద్ర, అదితి, యమి, శశ్వతి, ఊర్వశి, ఘోషా, సూర్య, మొదలగువారును, వేదాంతవిజ్ఞానమునకుఁ బ్రసిద్ధికెక్కిన వారిలో మైత్రేయి, గార్గి, దేవహూతి, ఆత్రేయి మొదలగువారును బ్రాహ్మణమును సంరక్షణముఁ జేసిన భారతి, గణితజ్యోతిషములందు ప్రసిద్ధికెక్కినలీలావతి, ఖానాదేవి, మొదలగువారును. జనాబాయి, ప్రేమాబాయి, మొదలగుభక్తురాండ్రును, ఇందులేఖ, సుభద్ర, గంగాదేవి, మొదలగుకవయిత్రులును, దేశభక్తితత్పరురాండ్రగు మీరాబాయి, సంయుక్త, దుర్గావతి మొదలగువారును భారతదేశస్త్రీవిద్యాధిక్యమునకు నిదర్శనప్రాయులైయున్నారు. వీరీరీతిగా వేదవేదాంగాది విద్యలయందేగాక స్త్రీలకుచితములగు కళలందును ప్రవీణురాండ్రై యుండిరి. స్త్రీజనోచితములగు కళలును అఱువదినాలుగున్నట్లు వాత్స్యాయనకామసూత్రము, శ్రీమద్భాగవతము మొదలగు గ్రంథములవలనఁ దెలియుచున్నది. ఈకళలపట్టిక ఈ గ్రంథముచివర నీయఁబడినది.

---

† శుక్రనీతి ౬.౩ ౧౦౦ వ ఇండియాదేశపు స్త్రీరత్నములంగూర్చి 'అబలాసచ్చరిత్రరత్నమాల'ను విదుషీమణులను గ్రంథములను జదువవలయును.

ఈరీతిగా నేవర్ణమునాకికి తగినవిద్య వారికిలభించుచుండ, నన్నవస్త్రములకు లోపము లేకుండ, నెల్లరును నైకమత్యము తోఁ బ్రవర్తించుచుండిరి. సాధారణజనులకు రాజనీతితో నేప్రసక్తియు లేకయుండెను. పరులసహాయముఁ గోర లేకుండఁ దమకు గావలసిన వస్తువులను దామే చేసికొనఁగలిగి యున్నప్పు డితరుల ప్రసక్తి యేమిగలదు? రాజ్యముఁ బాలించు వాఁడెవఁడైన నేమి? 'రామోవా రావణోవా' యనువచనము ప్రజలకు రాజులయెడఁల యభిప్రాయమును దెలుపుచున్నది. రాజ్యవిప్లవములు కలిగినప్పుడు రాజధానియందేదో చిన్నకలవరమును దానినిగూర్చి గ్రామములలో చెప్పికొనుటయుఁ దప్ప మఱేమియుఁ గలుగకుండెను. రాజెవ్వఁడైనను శాస్త్రవిహితమగు పన్నును జనులిచ్చివేయుచుఁ దక్కిన పనులను దామే చూచుకొనుచుండిరి. రాజు తానుగ్రహించిన పన్నులను ప్రజల యుపయోగార్థమే వ్యయపఱచుచు, విద్యలను గళలను నభివృద్ధిచేయుచుండెను. ఇట్లు దేశమునుగూర్చి బాధ్యతగలవారు పాలకులై యుండినంతవఱకు నంతయు సరిగనే జరిగెను. పరదేశస్థులు వచ్చిననాఁటినుండియుఁ బరిస్థితులు మాఱినవి. మహమ్మదీయు లిండియాపైఁబడి కొల్లగొట్టి యీదేశమున నుండక తమ దేశమునకు మఱలిపోవుచున్నంతకాలము నరాజకము ప్రబలియుండుటయేగాక విద్యలును, గళలును క్షీణించుచువచ్చెను. కానివీరు పిండిమాలోనే క్రమక్రమముగ స్థిరవసతుల నేర్పఱచుకొనుచువచ్చి నానాటికిఁ దమ దేశమును మఱచియుండియానే

తమదేశమని యింటిప్రజలతోఁ బాటు కలసిమెలసి తిరుగ నేర్చికొనినవాఁటినుండియుఁ దిరిగిపూర్వవిద్యలను గళలును తలయెత్తసాగెను. ఐరోపాఖండవాసులింటిలోనే వచ్చిరి. వీరి కాలమంతయు స్వదేశపాలకులయందంతః కలహములఁబుట్టించి, తామైమాధ్యస్త్యమును వహించి, యేకష్టమును లేకయే, దేశమునాక్రమింపఁ బ్రయత్నించుటయందుగతించెను. ౧౭౦౦ సం॥వమునుండి సుమారు నూటయేబదిసంవత్సరము లిండియాస్థితి యిట్లేయుండెను. తుదకింగ్లీషువారిచట తమయధికారమును పాదుకొల్పిరి. తమరాజ్యవిధానమును స్థిరమార్గమునఁ గొనసాగించుకొనుట కొకమార్గము నేర్పఱచుకొననెంచిరి. అట్లేర్పఱుపవలసిన విషయములలో విద్యయొకటియై యుండెను. అప్పటికిండియాదేశపు విజ్ఞానముంగూర్చి తెలిసికొనఁజాలు పాలకులెవ్వరును లేకుండిరి. రాజప్రతినిధిగానుండిన బెంటింకుప్రభు విండియాదేశపువిద్యఁగూర్చి తెలిసికొనఁ బ్రయత్నింపలేదు; ఈదేశస్థులు మూఢులనియు, ననాగరికులనియు, పాశ్చాత్యుల నాగరికతయే యిండియాయభివృద్ధిలోనికి తేఁగలదనియు నాతఁడునమ్మియుండెను. ఆకాలమున నాయింగ్లాండుదేశపువిద్యయందే యెన్నియోలోపములుండెను. వారికళలయందు పటుత్వమును సత్యసంధతయు క్షీణించియుండెను. ఇట్టివిద్యనుగళలనుఁగూర్చి తెలిసిన బెంటింకుప్రభువున కీదేశపువిద్యలును, గళలును నెట్లురుచించును? తాను [illegible]వాఁడనని నమ్మియుండిన పాశ్చాత్యులయౌన్నత్యమును

గూర్చి తెలిసికొనఁ బ్రయత్నించునా? ఈప్రభువునకు 'తాజ్ మహల్' సౌందర్యమేమియు సంతోషదాయకముగా లేదు. అందుచేత దాన్ని మొదట వేలము వేయించెను. ఈపిచ్చితనమును జూచి యెవ్వరును పాడలేదు. ఆయనకు కోపమువచ్చి యా సుందరమందిరమును పడగొట్టించి యందలి స్ఫటికశిలల నూడ-బెరికి యమ్మివేయ నెంచెను. ఈకళాధురంధరునకు చేదోడు-వాదోడుగా మెకాలే యను విద్యాధురంధరుఁడు తగిలియుండెను ఈమహాత్మునకిండియాదేశముఁ గూర్చి యెట్టిపరిచయము లేకున్నను, దానివాఙ్మయముగాలి తనకు సోకియుండకున్నను, భారతవర్షముయొక్కయు నరబ్బులయు వాఙ్మయసంతతిని గలిపినను ఐరోపావారియొక్క పెట్టెడుపుస్తకములతోఁ దులతూఁగఁజాలవను మహావాక్యమును సెలవిచ్చెను. వీరిరువురితోడను నింగ్లీషుప్రభుత్వకాలమున విద్యయారంభమయ్యెను. సంస్కృతమును దేశభాషలును సడుగంటెను. పాశ్చాత్యవిజ్ఞానవ్యాపనమను మిషతో ప్రభుత్వోద్యోగములకొఱకాసించు వింత విద్యావంతులతెగయొకటి యేర్పాటయ్యెను. ఈతెగవారును నింగ్లీషుపద్ధతులపై నేర్పాటైనవిశ్వవిద్యాలయములయందు ప్రాచీప్రతీచీ సమ్మేళనమువలన నిండియాతిరిగిప్రతిభకెక్కునని తలంపసాగిరి. పాశ్చాత్యవిజ్ఞానము వేషభాషలను మార్పుగలిగెనుగాని యార్యవిజ్ఞానమున కెట్టియభివృద్ధిని గలిగింపలేదు. ఈసందిగ్ధసమయమున ప్రాచీప్రతీచీవిజ్ఞానములు సమ్మేళనము బొందుటకుమారుగ రెండునువంతరించిపోవు

చిన్నెలు బయలువెడలినవి. వేదభాషలుమాత్రము మిగిలిన వి. భారతదేశౌన్నత్యముంగూర్చిగాని, విద్యాధిక్యతంగూర్చి గాని, నాగరకతాప్రాశస్త్యముంగూర్చిగాని యీపాశ్చాత్త్యు లే తమకుఁదెలుపవంతవఱకును వీరికి తమశక్తిసామర్థ్యము లు పొడకట్టకున్నవి. మీయుపనిషత్తులయందే పరమాత్మను గూర్చిన సంపూర్ణవిద్యయున్నది. తప్పటడుగువిడుచున్న మా శాస్త్రనామకమగు వైద్యముకంటె మీయాయుర్వేదమే ప్రశ స్తమైనది. సంఘముఁగూర్చిమీపూర్వులేర్పఱచిన కట్టుబాట్లే మంచివి అనియీరీతిగా తెల్లదొరలే చీటీలువ్రాసిమనకుపంపి నఁగాని మనలనుమనమే నిరసించుకొనుచుంటిమి. అట్టిచీటీ లలోనొకటి "ఐరోపాయందలి విశ్వవిద్యాలయముల ననుకరిం చుచున్న ప్రస్తుతభారతవర్షమందలి సర్వకళాశాలలు దేశీయ బుద్ధికౌశల్యమునకును, కళలకును వినాశనహేతువులగు చున్నవి. తొలుతనివి ప్రభుత్వోద్యోగములకొఱకాంగ్లేషు తెలి సినగుమాస్తాలను సృష్టించుటకునెలకొల్పఁబడినవి; వానియుద్దే శములంతకంటె హెచ్చుగాపోవక యవిగుమాస్తాపనులును ధనసంపాదనమును మాత్రము విద్యకుముఖ్యార్థములను నభి ప్రాయమునుబుట్టించి యుత్తమకళానైపుణ్యము నడుగంటఁ జేయుచున్నవి. బి. యే ఎం. యే. ఎల్. ఎల్. డీ. ఇత్యాది బిరుదములును, ప్రభుత్వోద్యోగములవలన గలుగుధనలాభ మునుపాధ్యాయులు, న్యాయవాదులు, ఇంజినీరింగువైద్యవిద్య ల నభ్యసించువారికిమాత్రమే లభ్యములగుచున్నవి. విశ్వవిద్యా

ఖయము లందు 'మెట్రిక్యులేషన్' ఫేయినవారును, పుస్తకములనుండి సంగ్రహించిన మిడిమిడిజ్ఞానముతో వచ్చియురాని యింగ్లీషుమాటలతో, సగము నేర్చినయుపాధ్యాయులయొద్ద శిక్షబొంది తొల్లింటినుండియుఁ గళానైపుణ్యమున సప్రతిమానుడై నిలిచియున్నశిల్పిని జూచి గర్వముతోఁ బ్రవర్తించుచున్నాఁడు. ఈశిల్పవిద్య నానాటికి నుపేక్షచే క్షీణించిపోవు చున్నను నేటికిసత్యమునందును, నిర్మలత్వమునందు, ఆధ్యాత్మికతత్వబోధయందును బాశ్చాత్యవిద్యకంటె నెన్నియోరెట్లు మించియున్నను దానిగతియింతకువచ్చునుగదాయని వగవవలసియున్నది. దేశీయశిల్పము ను వంశానుగతముగా నేర్చికొనియున్న శిల్పులును బోషణలేకుండుట చేసుమహాస్తాంపనుల కొఱకు దేవులాడుచునో, వర్తకసంబంధమును కళలనభ్యసించిన పాశ్చాత్యులననుకరించుచునో, ఇండియాదేశపుశిల్పమును యూరోపులోనమ్మించు కళావిహీనములగు బొమ్మలను గీయుచునో, యెట్లో కాలముగడుపుచున్నారు......నవీన విద్యవలనను, నవీనవాణిజ్యాశయములవలనను, హిందూదేశము తననాగరకతనుగోల్పోవుచున్నది...... ఇప్పటి విద్యకును గళావిజ్ఞానమునకును నెట్టిసంబంధమును లేదు. ఇండియాదేశపు కళలతత్వమును నిరూపించుటకిప్పటివఱ కెవ్వరును బ్రయత్నించియుండలేదు. ప్రపంచమందలి యితరదేశముల కళలతోనవి సమానమగుస్థానమును దేశీయకళలకును నిచ్చునంతయు... ద్వైవిద్దె...లకెవ్వరును బూనుకొనలేదు. పూర్వకాలమున

ఇండియాదేశము కళలయందితరదేశములకు గురువై విలసిల్లె
నగాని నేటివలె నెన్నఁడును శిష్యత్వము నంగీకరించియుండ
లేదు. అని హావెల్‌గారు వ్రాసినది. "మధ్యయుగములో ఫ్రాం
సుదేశమునకు క్లూనీ, క్లైర్వోట్లో మధ్యహిందూదేశమునకు
నాలందాయట్లుండెను. సత్యమగు విజ్ఞానమునకు నిధానములై
విశ్వాసులదేశములందు ధర్మప్రవర్తనకు మూలస్థానములై
యిట్టిహిందూబౌద్ధవిశ్వవిద్యాలయములు ప్రస్తుతహిందువుల
కళానైపుణ్యమున కాదిహేతువులై యుండెనని చెప్పవచ్చును
పూర్వకాలపుచేతిపనులును, చిత్రకళలును ప్రస్తుతమైరోపా
యందు వాణిజ్యాశయములచే నెట్లడగంటిపోయినవో యట్లే
హిందూదేశమునందును నాయాకళలనభ్యసించు జాతుల
వారును నానాటికి క్షీణించిపోవుచున్నారు. ఇట్టికళలనభ్యసించు
జాతులవారిఁగూర్చిగాని, వారికళానైపుణ్యముం గూర్చిగాని
విద్యావంతులు తెలిసికొనఁబ్రయత్నింపకుండుట యెంతయు
నవమానకరము." అని ఫెర్గ్యూసనుగారు వ్రాసిరి.

ఈరీతిగావీరును, నిట్టివారనేకులితరులును మనలనుఁ
గూర్చి మనకుఁదెలుపువఱకును ననాగరకపురుషులమేయని
నమ్మియుంటిమి. వారుచెప్పినంతనే నాగరకులమైతిమి. ఈ
నమ్మకమాహాత్మ్యఫలమిప్పుడిప్పుడు తగ్గిపోవుచున్నది. తెలివి
తెచ్చుకొని, 'ఇన్నాళ్లును నేనేయవస్థయందుఁబడియుంటిని?
ఇదియేలోకము? ఎంతమాఱిపోయినది.' అనిదిగ్భ్రమతో
నలుగడలఁజూచికొని పూర్వావస్థను శీఘ్రముగఁబొందఁ బ్రయ

శ్నించుచున్నాము. తొలుత బలహీనముగానున్నట్లు తోఁచినను నచిరకాలమున పూర్వబలము చేరికొనఁగలదు. ఇప్పటియవస్థయందు మనచుట్టును బలిసియున్న యడవులను ఛేదింపవలసియున్నది. ఎన్నియో విషయములను మఱచిపోవలయును. ఎన్నియో విషయములకు జ్ఞాపకము తెచ్చికొనవలయును. ముందు మనదేశమున నెలకొనఁబోవు జాతీయవిద్య పూర్వపు రీతిగా నుండఁజాలదు. అప్పటికంటె లక్షణముగా నుండకపోదు. మనవిజ్ఞానము మాటుమణిగియున్న కాలములో నితర దేశములందితర నాగరకతలు బయలుదేరినవి. వీనిలోఁగూడ కొంచెము గుణము లేకపోలేదు. ఆగుణములను మనము స్వీకరింపవలయును. ఆర్యవిద్యాస్వరూపము మాత్రము మాఱిపోకుండ మఱింతశోభతోఁ బ్రకాశించుమార్గము నారయవలయును.

మొట్టమొదట శాలలును, బడులును మొదలగునవి పూర్వమువలె పల్లెటూరిలోనికిఁ బయనము కావలెను. పిల్లల చదువుకొఱకు పట్టణములలో చేరి యెందరో గృహస్థులు తమ సొమ్మును నిష్కారణముగా గోల్పోవుచున్నారు. పల్లెటూళ్లలో సౌఖ్యముగ కాలక్షేపము చేయుటకు వలయు ధనముకంటె పట్టణములో సౌఖ్యము లేకున్నను మూడింతలు వ్యయమగును. ఈ లోఁగా భూస్వాములగువారు తమ గ్రామములోని పొలములను స్వయముగఁ జూచుకొనుటకు వీలులేక పోవుటచేత నవిపాడగుచున్నవి. ఇఁక విద్యార్థులకు పట్టణవాసమువలన గలుగునష్ట

ములనేకములుండును. వారిదృష్టిచదువుమీఁదనిలువదు. నాగరికత పేరితో బయలుదేరుచు దినదినము నగలుగు మార్పులకు వీరుపాలగుదురు. పట్టణవాసము చేయుచుండుటచేఁ, గ్రామ నాగరకులమైతిమనితలంచి వీరుతమగ్రామముల కేగునప్పుడితర గ్రామస్థులయెడ గర్వముతోఁ బ్రవర్తింతురు. కావున ప్రాథమిక మాధ్యమిక పాఠశాలలన్నియు గ్రామములందుండవలసినదే. గ్రామములకొక పాఠశాలలేచో, గ్రామసంఘము సధికారము లోనుండవలెను. కావలసినయెడల నుత్తమకళాశాలలు పట్టణములకు సమీపములోనుండవచ్చునుగాని పట్టణములలో నెన్నడునునుండఁగూడదు. పూర్వబౌద్ధసంఘారామములన్నియు సాధారణముగాఁ బట్టణపరిసరప్రాంతములయందేయుండెను.

ప్రస్తుత విద్యావిధానమునందు వసతిగృహములకు (Hostel) ప్రాముఖ్యత యీయఁబడుచున్నది. వసతిగృహములలో నేమో మాహాత్మ్యమున్నదని ప్రభుత్వము వారభిప్రాయపడుచున్నారు. వీనివలన నిందువసించు విద్యార్థులయందు కొందఱికి స్థిరమైత్రిని యేర్పడుచుండుట యొకలాభమే గాని, లెక్కించిన నష్టమును దలంచినచో నీలాభమంత లెక్కలోనికి రాదు. ఈమైత్రి యొకచోట నేవసింపకున్నను లభింపఁగలదు. కాని, వసతిగృహములోనే విద్యార్థులు కొన్నిదురభ్యాసములకు పాలగుచుందురు. సిగరెట్లు, బీడీలు, చుట్టలు మొదలగువానిని త్రాగుటయు, నొకరిని మించవలెనని మఱియొకరు

హెచ్చుగా డబ్బు వెచ్చపెట్టుచు, లేనిపోని వేషములలో నిక్కి ఁగుట మొదలగు ననర్థములేకాక, శరీరమున కపాయకరములగు వలవాట్లును నిచట పట్టుపడును. ముఖ్యముగా యౌవన సమంకురించుచుండిన విద్యార్థుల నవ్వగా పదునారేండ్లనుండి యిరువదిమూండేండ్ల మధ్యనున్నవారిని కలసి యొకచో వరుండనీయఁగూడదు. ఇది కొందరికి నవ్వు పుట్టింపవచ్చును గాని, విద్యార్థులకు కలుగు నాపదను దలంచి యతిజాగ్రత్తగ నుండవలయును. తల్లిదండ్రుల చెంతనుండినచో వారీయనర్థములకు పాలుకారు. గృహము, ప్రేమ, అనుబంధము ననునూహాలుం పుట్టుటకు వసతిగృహము లెతమాత్రము ననువుపడవు. విద్యార్థులుండినఁ దల్లిదండ్రులతోడను, నక్కచెల్లెండ్రు, అన్నదమ్ములతోడను కలసిమెలసి తిరుగవలెను. లేదా గురువుగారి యింటనైనను వసింపవలయును. ఎట్లయినను వారు గృహస్థ ధర్మములను బరీక్షించుటకు వీలుగానుండవలయును.

పెద్దహార్మ్యములకొఱకును, కుర్చీలు, బెంచీలు, టేబిల్లు, గాలరీలు మొదలగువానికొఱకును వ్యయమునిఁక గట్టిపెట్టవలెను. విద్యకొఱ కేర్పడియుండిన ధనములో మూఁడువంతు లిప్పుడు దీనికే వినియోగపడుచున్నది. శుభ్రముగ నాలుగు వైపులనుండియు గాలియు, వెలుతురును వచ్చుగృహములే పాఠశాలలకును గళాశాలలకును జాలును. పాఠశాలలలో చాపలును, గళాశాలలలో తివాసీలునునుండినఁ జాలును. ఇప్పుఁ

టి బెంచీబల్లలనుండి వడుములు వంగిపోవుచున్నవి. వెన్నెముకలు వంకరబోవుచున్నవి. విద్యార్థులు స్థిరముగా నడుము వంచకుండ పదినిమసములైనను గూర్చుండలేకపోవుచున్నారు. పూర్వులపాఠశాలలయందిట్టి బెంచీబల్లలు మొదలగునవి లేకుండుటయే కారణమని పెద్దలు తలంచుచున్నారు.

పైవానిని మార్చివేయుటవలన నెంతయో ధనము మిగులును. అదిధనిని యోగించి ప్రతిమాధ్యమిక పాఠశాలకును గళాశాలకును ననుబంధముగా పెద్దపొలములను గొనియుంచవలెను. ప్రతివిద్యార్థియుఁ దనచేతులతోఁ గష్టపడుట యావశ్యకమనియు, దానివలనఁ బరువుపోదనియు, నెవనియట్టును వాఁడు తనజీవనముకొఱకు పాటుపడవలెననియు చదువుకొనవచ్చినవారికి నాటవలయును. ఈవిద్యార్థులు పొలముపై కష్టపడుటవలన వచ్చు ఫలసాయమువలననే సాధారణముగా నాయాపాఠశాలలు కొనసాగవచ్చును. వారికి నూలువడకుట, బట్టలునేయుటయుఁగూడ నేర్పవలెను. అట్లు చేయుటవలన మనుష్యునకు ముఖ్యావశ్యకములగు తిండియుఁ బట్టయు వారికి లభించినచో, స్వతంత్రజీవనముఁ జేయుటకు వీలగునని మనస్సునఁ గెక్కును పరులసేవకొఱకు విద్య కాదనునూహ వారియందు స్థిరపడును. అప్పుడుగాని సత్యసంధత, ధైర్యము, స్వాతంత్ర్యభావము మున్నగుగుణములు వారికి లభింపవు. వారికి నేమ ప్రభావము, స్వాతంత్ర్యజీవనమునందిచ్ఛ, మొదలగున

వలవదవు. కళాశాలలీపాఠములపై విద్యార్థులుచేయు కృషివ లనవచ్చు రాఁబడితో సాగకపోయినను ప్రభుత్వమువా రిచ్చు టికెంబుఁ జాలతక్కువధనముతోడనే వానిని సాగింపవచ్చును. ఒకప్పు డన్ని తరగతుల విద్యాలయములందును బూర్వము వలె నుచితముగనే విద్యాదానము చేయుటకు వీలుండును.

విద్యాగురువులు సంతృప్తిపొంది సుఖజీవనము చేయుచుండినగాని వారెంతవిద్యావంతులైనను దమవిధిని బాగుగ నిర్వహింపరనుమాట సత్యము. అందుచేతవారిసుఖజీవనమున కనువగునట్లు వారిజీతము లేర్పఱుపవలయును. ఈజీతములు వార్షికములుగా నుండవలయునుగాని, మాసికములై యుండఁగూడదు. ప్రతిమాసమును జీతము నిచ్చుచుండుటవలన నేనెలజీతమానెలలోనే వ్యయమగుచుండును. ఇచ్చినజీతము కంటికి కనఁబడదు. మొత్తముగా నిచ్చినయెడల వారు కొంత వేఱయుంచుకొని సంవత్సరమంతయు క్లుప్తముగ వాడుకొను నలవాటుచేసికొనియుందురు. వార్షికములఁబుచ్చుకొనునాచారము పూర్వకాలమునుండియు మనదేశమున నుండుటయే గాక యిప్పుడును పాశ్చాత్యదేశములందున్నది.

విద్యాబోధన దేశభాషలమూలముననే జరుగవలయును. పరదేశభాషల ప్రాధాన్యము తగ్గిపోవలెను. ఇందువలన బరదేశభాషల నభ్యసింపకూడదని యభిప్రాయము కాదు; అది యైచ్ఛికము కావలెను. ఇతర దేశముల నాగరికతఁ దెలిసికొనుటకును తమతమ యభివృద్ధులకొఱకు నాయాదేశముల వ

లంబించుచుండు విధానములఁ దెలిసికొనుటకును బరదేశభాషాపరిచయ మవసరమే. కాని, యవియన్నియు మాతృభాష తర్వాతరావలసినవే. మనదేశమునదప్ప మఱెచ్చటను నీప్రపంచమునందు పరదేశభాషలమూలమున విద్యనేర్చుకొనుట యెఱుంగము. పరభాషామూలమున శీఘ్రముగా జాతీయతాస్వరూప మంతరించిపోవుచుండును. రానురాను మాతృభాష మఱపునకు వచ్చును. గ్రామ్యభాషయొకటి యేర్పడుచుండును. పరభాషను నేర్చుకొనుటకు చాలకాలముపట్టును. ఎక్కువ శ్రమయగును; జ్ఞానసంపాదనమునకు ముఖ్యకాలమగు చిన్నతనమంతయు కేవలపరభాషాపదసంపాదనముతో గడచిపోవును. చిన్నతనమున గలిగినముప్పును తొలఁగించుటకు తరువాత వీలుండదు. జీవితమునందు జయప్రదముగఁ గాలముగడుపుట దుష్కరమగును. సంపాదింపవలసినది జ్ఞానముకాని భాష కాదు; అట్టిజ్ఞానము సొంతభాషమూలముననే యెక్కువసులభముగ లభ్యమగుననుట నిర్వివాదాంశము. ఇంతకును నాపరభాషయందు సంపూర్ణజ్ఞానము కలుగుటకా వీలులేదు. ఆభాషనుమాట్లాడు దేశస్థులవలె నితరు లంతస్పష్టముగఁ దమయభిప్రాయములను వెలిబుచ్చఁజాలరు. సగముసగము పట్టుబడిన యాపరభాషవలన బుక్కువేయు నభ్యాసము స్థిరపడి స్వతంత్రవిమర్శనమువలన జ్ఞానము సంపాదించుట యుండకుండును. ఈరీతిగా దేహమునకును మనస్సునకును గలుగునాయాసమే మిగులునుగాని, మఱియొకలాభముండదు. ఇంతకును సొంత

రభాష నుపయోగించువారిసంఖ్య తక్కువగనే యుండును; దాని ప్రచారమువలన క్రొత్తవింత తెగ యొకటి యేర్పడును. వీరికిని సాధారణజనులకును నెడమగుచుండును. ఇండియాలో ననేకభాష లున్నవి. అందఱకును సామాన్యమగు భాష యొకటి యుండవలెనుగదా యనిన నాదినుండియు నట్టిసామాన్యభాషగా నెలకొనియుండిన హిందీభాషనే యుపయోగించుకొనవచ్చును. విద్యనేర్పుటయందు మాత్రము మాతృభాషనే యవశ్యము నుపయోగింపవలెను. పరదేశభాషాజ్ఞానమున్నంతమాత్రమున నెవ్వఁడును విద్వాంసుఁడు కాఁజాలఁడు. ఇప్పటికిని మంచి గ్రంథములను రచించుచున్నవారు పండితులును మౌల్వీలునే గాని స్వతంత్రముగ మనోహరములగు గ్రంథములను వ్రాయు పరదేశభాషాజ్ఞానముగల “గ్రాడ్యుయేట్లను” మనము కానము.

ప్రతివిద్యాశాలయందును దైవభక్తియు నీతిపరతయు కుదురుకొనఁజేయు బోధనలఁ జేయుచుండవలెను. ఇన్ని మతములకు నెలవైన యీదేశమున మతవిద్యను సాగించుటకు వీలులేదనియు, నందువలన మతద్వేషములు ప్రబలుననియు ప్రభుత్వమువారు జంకి జోక్యము కలుగఁజేసికొనకున్నారు. క్రైస్తవమతము మాత్రము నిరాఘాటముగా బోధింపఁబడుచున్నది. బ్రాహ్మణమతమును, మహమ్మదీయమతమును క్రైస్తవమతముకంటె నెందులో తక్కువయైపోయినదో తెలియ

రాదు. ఇది మా చర్చకు స్థలము కాదు. కాని, యార్యమహమ్మదీయమతముల యౌత్కృష్ట్యము ధనమోహమున మునింగియున్న పాశ్చాత్యులకును, వారి ప్రేరణకు లోబడియున్న వారికిని బోధపడదు. క్రీస్తుసాత్త్వికతత్త్వమునిను మంతయు బోధపఱచుకొనక కాల్లాకుచుండు నీపాశ్చాత్యప్రభువులు మనమతమునుగూర్చి తెలిసికొనకయే దానిని నిరోధింపనెంచుట వింతగా దోచకపోదు. సర్వజనులకును సామాన్యముగా నే వైషమ్యములును లేకుండ నార్యమతబోధ సలుపుట కవకాశము లేకపోలేదు.‡ ఇట్లే నీతిపరతనుగూడ నుపాధ్యాయుల సత్ప్రవర్తననుబట్టియే కాక మహాత్ముల చరిత్రములమూలమునను నేర్పవచ్చును. మతమును, నీతియు బునాదులుగా లేనివిద్య నిరర్థకమగును.

౨ దైవభక్తి తరువాత ప్రస్తుతవిద్యావిధానమున లోపించియున్నది దేశభక్తి. ఇప్పటిచదువులు పరదేశభక్తి కనువుగా నున్నవిగాని స్వదేశముపై నించుకయు నభిమానము బుట్టింపకున్నవి. మనవిద్యయంతయు నితరదేశములను బోషించుటకును నితరదేశములను బ్రేమించుటకునే యనువుపడియున్నది. అందుచేత నెంటనే యీవిషయమును శ్రద్ధతీసికొనవలసియున్నది. [illegible] [illegible]దేశచరిత్రమును వ్రాయువారు [illegible]మధ్యకృత్యమును మార్చ

‡ మతవిద్య[illegible] చేర్పబడవలసిన విషయములగూర్చి [illegible]సంబంధ [illegible]

శాని తమసొంతనేత్రములతోఁ జూడఁ జూపవలయును. మహావీరులచరిత్రములు, మహాత్ముల ప్రవర్తనములు, దేశభక్తిపొంగి తుళ్లి తమతమ కార్యముల నిర్వహించిన పూర్వుల జీవితచారిత్రములు, ఇట్టివానిమూలముననేగాక స్వదేశవస్త్రధారణాదికము, స్వదేశవస్తువులనే యుపయోగించుటయందుత్సాహము, పరదేశవస్తువులను సాధ్యమగునంతవఱకు వాడకుండుటయందు పట్టుదల మొదలగుగుణములను విద్యార్థులయందు నెలకొల్పుటవలనఁగూడ నీదేశభక్తిని బుట్టింపవచ్చును.

తరువాత పాఠశాలలయందు నేర్పవలయువిషయములు గూడ చాలవఱకు మాఱిపోవలయును. బోధనాపద్ధతులు మాఱవలయును. విద్యాదానకాలములయందు మార్పులు కలుగవలయును. ఈరీతిగా నాలోచించుకొనుచుఁబోయినచో ప్రస్తుతవిద్యావిధానమున నెన్నియోసంస్కరణములు జరుగవలసియున్నవి. ఒకొక్కసంగతి తెలిసికొనలదిని, మనవారు పోరగాపోరగా నిక్కడనొకమాసికయు నక్కడనొకమాసికయు వడి, యొక "గతుకులబొంత" తయారగుచున్నది. కావున మనకుఁ గావలసిన విద్యాకార్యమునకుఁ గ్రొత్తగా పునాదులు వేసికొనవలసియున్నది. ఇప్పటికిద్యకేజాతీయవిద్యయనిపేరు. ప్రభుత్వమువారి ధనసహాయమును బడయునది ప్రభుత్వపు విద్యయనియు, స్వయంసహాయముచే సాగించువిద్యకు "జాతీయవిద్య" యనియు నామకరణము చేసి[illegible]

గార్యము లేదు. ఆయాంతరగతుల జాతీయపాఠశాలల నుండు ననుసరింపవలయు విద్యావిధానముంగూర్చి మఱియొకచో ముచ్చటింపఁబడును.

ప్రాచీనవిద్య క్షీణించిపోవుటకుఁ గారణమేమి? దానిని తిరిగి స్థాపించుటకు దానియందు పటుత్వము తప్పిపోయినదా? సంఘము నభివృద్ధిమార్గములో నుంచుట కేల చాలకుండెను? నాతములందు గొప్పమార్పులఁ గలిగింపఁగలిగి, రైలుబండ్లు, టెలిగ్రాఫులు, తపాలాఫీసులును లేనికాలములో ఛప్పన్నదేశములను నేకభరతఖండమున కంగములను జ్ఞానమును, నైకమత్యమును గలిగించి యనేకవిద్యలకును గళలకును నాలవాలమై, యేయిబ్బందియు లేకుండ సౌఖ్యజీవనముఁ జేయుటకు దోడ్పడియుండిన యార్యవిద్య యిప్పటి పరిస్థితులను మనదేశమున నెలకొల్ప జాలదా? వసిష్ఠ విశ్వామిత్రులనుండి రామప్రసాద, రామకృష్ణులవఱకునుగల ఋషివర్గమును, పాణిని చాణక్యులనుండి చంద్రకాంతతర్కాలంకారులవఱకును గల విద్వాంసులను, మైత్రేయి గార్గులనుండి యహల్యాబాయి రాణీభవానులవంటి నారీమణులను, చంద్రగుప్త శివాజీలవంటి చక్రవర్తులను బుట్టింపఁగలిగి, యార్యనాగరకత నవిచ్ఛిన్నముగా నీనాఁడును గనఁబడఁజేయఁగలిగిన పూర్వవిద్యావిధానమింకముందును నుపయోగపడి మనదేశమును పూర్వపు

కాని, జాతీయవిద్యావిధానము దేశకాలముల ననుసరించి యేర్పఱుపఁబడవలయును. మనము రైలుబండ్లు, ఆవిరియంత్రములు, ముద్రణయంత్రములు, విద్యుచ్ఛక్తి వీనిప్రభావము హెచ్చుగానున్న యుగములో నున్నాము. స్వరాజ్యము జాతీయభావము ననుమాటలను వినుచుఁ బట్టి మార్గమునఁ గృషి సల్పుచున్నాము. ఈ నవీనయంత్రములకు లోఁబడిపోయి మనము పాశ్చాత్యులుగా మాఱిపోకుండ నార్యులస్వరూపము భూమిపై నిలుపవలయు బాధ్యత మనయందున్నది. మనకును ముద్రణయంత్రములును, రైలుబండ్లును కావలసియున్నవి గాని, వానివలనఁ గలుగు దుఃఖపరంపరలను దెచ్చిపెట్టుకొనుటకు కాదు; ప్రపంచమున కంతటికి నార్యస్వరూపము నిచ్చుటకే, యార్యవిజ్ఞానప్రవాహముతో లోకమును సారవంతము చేయుటకే మనకును బరిశ్రమ లభివృద్ధినొందవలెను. వాణిజ్యము కొనసాగవలెను. కాని, వానివలన వచ్చుధనముతో నుప్పొంగుకొనుట కాదు; పరులదైన్యమును బాపుటకే; స్వార్థత్యాగధర్మ, నిర్మోహత్వములను క్రొత్తరూపములలోఁ బ్రకాశింపఁ జేయుటకే ఇతరులు తమదేశమును బ్రేమించునట్లు మనము మనదేశమును బ్రేమింపవలయును గాని యాయభిమానమును బురస్కరించుకొని యొండొరులతోఁ బోరాడికొని జగత్క్షోభము గలిగించుటకు కాదు. శాస్త్రాభివృద్ధియు మనదేశమునఁ గావలయును గాని, యది జగచ్ఛాంతికొఱకే యని తలంపవలయును.

పూర్వవిద్యావిధానమంతయు నిట్టి జగచ్ఛాంతికొఱకే యనువుపడి యుండెను. ఆవిద్యయందలి యాదర్శములనింకను లోకమునకుఁ జూపుటకే హిందువుఁడనువాఁడు జీవించియున్నాఁడు. అతఁడు కాలానుసరణముగ నితరవిద్యలయందలి గుణములన్ను దనయందు జీర్ణము చేసికొనుచు, దనయాధ్యాత్మికతత్త్వమును మఱచిపోక ప్రాచీనార్యనాగరకతను శాశ్వతముగా లోకమున నిలుప సంపూర్ణప్రయత్నములసలుప నిప్పుడైన నారంభించునుగాక!

స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తునిత్యం
లోకాస్సమస్తాస్సుఖినోభవంతు॥

అను ధ్వని లోకాంతములవఱకు వినఁబడునుగాక!

# అనుబంధము ౧

## మతవిద్య.

మొదటినుండి తక్కిన విద్యలన్నియు నభివృద్ధి నొందుచుండినను పరమాత్మనుగూర్చిన విద్యయే విద్యయని గ్రహింపఁబడుచువచ్చినది. అట్టి యాముష్మికవిద్య నేఁ డంతరించిపోయి యైహికవిద్యయే ప్రబలియుండుటచేత నవీనప్రపంచమున నాయాందోళనము పొడచూపినదనియు, నదియే లోకవినాశకహేతువనియు ననేకులు తలంచుచున్నారు. కాని, పూర్వమునుండి నేటివఱకు లోకపరిస్థితులు మాఱుచునేయున్నవి. ఆయాకాలములకును జనులకును ననువగునట్లు విద్యావిధానములును మాఱుచు వచ్చుచున్నవి. ప్రస్తుతము దేశీయపద్ధతుల ప్రకారము విద్య నేర్పుటకుఁ బ్రయత్నించినమొదలఁ దిరిగి మతసంబంధమగు విద్యను పునరుద్ధారణ చేయవలయును. అట్లు చేయుటలో పూర్వుల మతసిద్ధాంతముల నుల్లంఘింపక విద్యావిధానమునందు నేటికాలమున కనుకూలములగు మార్పులను చేసికొనవలయును. అట్టి మతవిద్యావిధాన మెట్లను సరింపవలయు నని యోచించి సం 1909 రములో బంగాళాదేశీయ విద్యాసంఘము వా రొక శిక్షాక్రమమును విధించియుండిరి. దాని నీ క్రింద పొందుపఱచుచున్నాము.

“ ఆయామతముల వారికి తమతమ మతములఁగూర్చిన

విద్యను బోధించుట యీసంఘమువారియుద్దేశములలో నొకటి. అట్టివిద్యకొఱకు ప్రత్యేకముగా ధనమును సమకూర్చి యుంచవలయును. ఆయామతాచారములను, కర్మలను విధిగా విద్యార్థులచే నవలంబింపఁ జేయుట పైవిద్యయుద్దేశము కాదు. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, బ్రాహ్మణమతస్థులు మొదలగువారు తమతమమతములంగూర్చినవిద్యను స్వీకరింప నభిలషించిననే యాయావిద్యలను వారికి నేర్పవలయును. తమమతముగాక యితరమతముమఁగూర్చి తెలిసికొనవలయునని కోరినచో నట్లును బోధసేయవచ్చును."

మతము రెండువిధములు. (౧) తత్త్వాంశము—అనఁగా ఆయామతములఁగూర్చిన విషయములను తెలిసికొని పఠించుట. (౨) సాధనాంశము—తెలిసికొనినదాని నాచరణలోనికిఁ దీసికొనివచ్చుట.

ఈరెండును అవిభాజ్యములు. ఒకదానినిఁ దెలిసికొని రెండవదాని నుపేక్షచేయుటవలన లాభములేదు. నశ్వరమగుదానిని క్రమముగ వదలించుకొని యనశ్వరమగుదానిని పొందుటయే యీమతవిద్యయుద్దేశము.

తత్త్వభాగములో నీక్రిందివిషయములు చేరియున్నవి:—

౧ మతమునకు మూలాధారములు:—

౧ (అ) అవియేవి? వేదములు—మనువు
శ్రుతులు, స్మృతులుకూడను—యాజ్ఞవల్క్యాదుల
పురాణములు, న్యాయమీమాంసాది షడ్దర్శనములు.

యాజ్ఞవల్క్యాదు

తంత్రము.

(ఆ) పైవానిపరీక్ష, వానిపరస్పరావిరోధత్వము.

౨ (అ) పైవాని భాష్యములు.

(ఆ) వానిసంగ్రహము.

౩ హిందూమతమునకుఁ దక్కినమతములయెడల విరోధభావము లేదు.

౨ బ్రహ్మతత్త్వము:—(౧) నిర్గుణబ్రహ్మము. (౨) సగుణేశ్వరుఁడు. (౩) అవతారములు.

౩ జీవతత్త్వము:—(౧ అతిమానుషము:—(అ) దేవతలు (ఆ) సిద్ధ,గంధర్వాదులు.

(౨) మానుషము:—(అ) దేహము (ఆ) ఆత్మ (ఇ) అభివ్యక్తి సంస్మృతి, ముక్తి (ఈ) పునర్జన్మము (ఉ) కర్మము.

(౩) తిర్యగ్జడములు.

౪ జడతత్త్వము:—౧ మాయ, ప్రకృతి, అదృష్ట[illegible] త్రిగుణములు, పంచభూతములు, పరమాణువులు, నక్షత్రలోకములు.

[illegible] సృష్టి,స్థితి,లయము,తత్ప్రవాహము (The law of Rhythm)

[illegible] సాధనాభాగము.

[illegible] కర్మకాండము.

౨ ఆచారకాండము:—ఆచారము, సంస్కారము.

౩ పరమార్థసాధన.

౧ కర్మకాండము:—యజ్ఞ, శ్రాద్ధాదిక్రియాకాండ శీర్షభ్రమణము.

(౧) ఇచ్ఛాప్రేరితులై కర్మనాచరించుటగాక, క్రమశిక్షనొంది దానిని నిత్యము ననుసరించుటయే దీని ముఖ్యప్రయోజనమని తెలుపుట.

(౨) అట్టిశిక్ష యెందుకు కావలెను? దానిమూలతత్త్వమేమి?

౨ ఆచారసంస్కారములు.

బాహ్యాభ్యంతరశౌచమే దీనికి ఫలమనియు, మనోవాక్కాయకర్మలయందు నిర్మలులై యుండుటకే యిట్టివి విధింపఁబడినవనియుఁ దెలుపుట.

ఆచారము—బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములు; మనోవాక్కాయసంయమనము, ఆహారాదులయందలి నియమములు.

సంస్కారము—దశవిధసంస్కారములు.

౩. పరమార్థసాధన: పరమాత్మనుఁ దెలిసికొనుట, తన యాత్మతత్త్వమునుఁ దెలిసికొనుట—కర్మ, జ్ఞాన, భక్తిమార్గములు.

మతవిషయములను సరీతిగా నేర్పాటుచేసినను అన్ని

వయస్సులవారికిని నొకేరీతివిద్య నభ్యసింపఁజేయక వారివారికి తగిన యేర్పాట్లు చేయుట యవసరము. కావున మతవిద్య నేర్పు పాఠశాలలలో ప్రథమ, మధ్యమ, ఉత్తమ శాఖలని మూఁడు శాఖ లేర్పాటుచేయవలయును. ఆయా శాఖలయందు నేర్పఁదగినయంశముల నీక్రిందఁ బొందుపఱచుచున్నాము.

ప్రథమ (౬ సంవత్సరములనుండి ౯ సం॥రముల వఱకు)

---

తత్త్వభాగములో ౧ (౧) (అ) ధర్మమూలములు-కేవలనామకథనము.

౨. (౨),(౩) బ్రహ్మతత్త్వము, నగు నీశ్వరుఁడు. అవతారములు.

౩. (౨) (అ,ఆ,ఈ) దేహము, ఆత్మ, పునర్జన్మము, కర్మము; (౩) తిర్యగ్జడములు.

౪. (౨) సృష్టి, స్థితి, లయములు.

సాధనాభాగము: ౧. (౧),(౨) కర్మకాండ-దీనియుద్దేశము, ఆవశ్యకత.

౨. (౧),(౨) శౌచము-దాని యావశ్యకత; ఆచారము, బ్రహ్మచర్యము, సంయమనము.

కర్మకాండ నాచరణలోఁ బెట్టించుట యీసంఘమువారియుద్దేశముగాదు. కావున గొప్ప యాచార్యులయు, భక్తులయు నుదాహరణములమూలమున దాని ప్రాముఖ్యతను నచ్చఁజెప్పవలయును. ధ్రువుఁడు, ప్రహ్లాదుఁడు, రాముఁడు, బుద్ధుఁడు చైతన్యుఁడు మొదలగువారి జీవితచారిత్రములనుండి చిన్నపిల్లలమనస్సులలో నాటుకొను విషయములను దీసికొని బోధ

చేయవలయును.

సర్వశక్తుఁడు, సర్వాత్మకుఁడు, కరుణామయుఁడు నగు దేవుఁడు ప్రపంచమునంతటిని పాలించుచున్నాఁడనియు, ఇహలోకజీవనము పరలోకయాత్రకు సాధనమనియు, విద్యార్థులకు నమ్మకము పుట్టునట్లు బోధింపవలయును.

<u>మధ్యము (౧౦ సం॥రములనుండి౧౫ సం॥రముల వఱకు)</u>

ఈతరగతియందు ప్రథమశాఖకు నిర్దేశింపఁబడిన విషయములఁగూర్చి మఱింతవిపులముగా బోధ చేయుటయేగాక యీక్రిందివిషయములనుఁగూడ బోధింపవలయును.

తత్త్వభాగము; ౧,(౨) (అ, ఆ),(౩); మతమునకుమూలములగు వానిఁగూర్చిన వ్యాఖ్యానము; వానిని సంగ్రహముగా దెలుపుట; హిందూమతమునకు పరమతసహిష్ణుత గలదని చెప్పుట.

౨. (౧) నిర్గుణబ్రహ్మము.

౩. (౧) (ఆ) (౨)(ఇ) సిద్ధ,గంధర్వాదులు, మనుష్యులు (ఆత్మ).

౪. ప్రకృతి, అదృష్టము, పంచభూతములు, సప్తలోకములు.

సాధనాభాగము: ౨,(౩) సంస్కారములు.దశవిధసంస్కారములు

౩. పరమార్థసాధనము.

ఈపాఠములను నేర్పునపుడు భీష్ముఁడు, జనకుఁడు, రామచంద్రుఁడు మొదలగు బ్రహ్మచారులు, గృహస్థులు, సాధువులు, మతబోధకుల చరిత్రములను సంక్షేపముగా తెలుపవలయును.

ప్రథమశాఖయందు నేర్పిన విషయములను నమ్మునట్లు చేయుటయేగాక, మనము నిర్వర్తించు ధర్మములన్నియు నీశ్వరప్రీతికే యనియు, మనమీలోకమున నాచరించు కర్మలన్నియు ధర్మము ననుసరించియే చేయవలెననియు, నచ్చట జెప్పవలయును. ఆయాయాశ్రమములందు వివిధావస్థలలో మహాత్ము లెట్లు సంచరించిరో తెలుపు కథలను చెప్పుచుండవలయును.

ఉత్తమశాఖ (౧౬ సంవత్సరములనుండి ౨౦ సంవత్సరములవఱకు)

ఈశాఖలో తొలుత నుదాహరింపబడిన శిక్షాక్రమము నందలి విషయములన్నియు విపులముగా బోధింపబడవలయును. ఆయాశాస్త్రములలో కొన్ని భాగముల నెంచికొని బోధింపవలయును. హిందూమతప్రవర్తకులలో గొప్పవారి చారిత్రములను, భక్తులచారిత్రములనుం దెలుపుచు, బుద్ధుడు, శంకరుడు, మధ్వాచార్యులు, రామానుజుడు, చైతన్యుడు, నానకు, తుకారాము, కబీరు మొదలగువారి మతముల సారమును బోధచేయవలెను. ప్రథమ, మధ్యమశాఖలలో దెలిపిన విషయములందు నమ్మకమును దృఢపఱచుటయేగాక, యానమ్మకముల ప్రకారము నాచరింపవలయుననియు, దినదినమును తమప్రవర్తనమును శోధించుకొనుచు, పూర్వముచేసిన తప్పులను తిరిగిచేయకుండ కాపాడుకొనవలయుననియు, దీనినంతయు విధిగా జరుపవలయుననియుం జెప్పవలయును.

# అనుబంధము ౨.

## శిక్షావల్లి.

(తైత్తిరీయోపనిషత్తు: ౧౧వ అనువాకము.)

సత్యం వద। ధర్మం చర। స్వాధ్యాయాన్మా ప్రమదః। ఆచార్యాయ ప్రియంధన మాహృత్య ప్రజాతన్తుం మావ్యవచ్ఛేత్సీః। సత్యాన్న ప్రమదితవ్యమ్। ధర్మాన్న ప్రమదితవ్యమ్। కుశలాన్న ప్రమదితవ్యమ్। భూత్యై న ప్రమదితవ్యమ్। స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్॥ దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యమ్। మాతృదేవో భవ। పితృదేవో భవ। ఆచార్యదేవో భవ। అతిథిదేవో భవ। యాన్యనవద్యాని కర్మాణి। తాని సేవితవ్యాని। నో ఇతరాణి। యాన్యస్మాకగ్ం సుచరితాని। తాని త్వయోపాస్యాని॥ నో ఇతరాణి। యే కేచా

శ్శ్రేయాగ్ం సో బ్రాహ్మణాః। తేషాం త్వయాఽఽసనేన
ప్రశ్వసితవ్యమ్। శ్రద్ధయా దేయమ్। అశ్రద్ధయాఽదేయమ్। శ్రి
యా దేయమ్। హ్రియా దేయమ్। భియా దేయమ్। సంవిదా
దేయమ్। అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సా వా
స్యాత్॥ యే తత్ర బ్రాహ్మణాస్సంమర్శినః। యుక్తా ఆయుక్తాః।
అలూక్షా ధర్మకామాస్స్యుః। యథా తే తత్ర వర్తేరన్। తథా
తత్ర వర్తేథాః। అథాభ్యాఖ్యాతేషు। యే తత్ర బ్రాహ్మణా
స్సంమర్శినః। యుక్తా ఆయుక్తాః। అలూక్షా ధర్మకామాస్స్యుః॥

యథా తే తేషు వర్తేరన్। తథా తేషు వర్తేథాః। ఏష
ఆదేశః। ఏష ఉపదేశః। ఏషా వేదోపనిషత్। ఏతదనుశాస
నమ్। ఏవ ముపాసితవ్యమ్। ఏవ ముచైతదుపాస్యమ్॥

# అనుబంధము ౩

## (౧) అ

### చతుష్షష్టి కళలు—పురుషోచితములు.

---

(శుక్రనీతిసా[illegible]. iv, iii, ౧౫—౧౮.)

౧. నర్తనము (Dancing) ౨. అనేక వాద్యములయందు పరిచయము (Playing on the drum, the violin etc.) ౩. వస్త్రాలంకార సంధానము (Toilet) ౪. అనేకరూపావిర్భావకృతి (Disguising oneself in various forms) ౫. శయ్యల నమర్చుట, పుష్పగ్రథనము (Arranging beds and making garlands) ౬. ద్యూతాద్యనేక క్రీడలు (Playing at dice etc.) ౭. కామశాస్త్రమునందలి యనేకాసనములు (Various ways of men and women in the enjoyment of each other)—ఈయేడును గాంధర్వకళలు. ౮. మకరందాసవములను, మద్యాదులను జేయుట (Preparing honey etc., liquors and other intoxicating things) ౯. శల్యసంధానము మొదలగునది (Surgery) ౧౦. హింగ్వాదిరసములను వండుట, అన్నాదులను వండుట (Preparing beverages and cookery) ౧౧. వృక్షములను పెంచుట (growing trees) ౧౨. పాషాణము, ధాతువులనుండి భస్మములు చేయుట (Preparing chemical substances) ౧౩. చెఱకులనుండి నానావస్తువులఁ జేయుట (Making sugar & other substances from the sugarcane) ౧౪. ధాతౌషధములను కలుపుట (Mixing organic and inorganic substances) ౧౫. ధాతుసాంకర్యమువలన పార్థక్యముఁ గలుగఁజేయుట (Preparing organic compounds out of elements) ౧౬. ధాత్వాదుల సంయోగముఁ జేయుట (Preparing mixtures) ౧౭. క్షారనిష్కా[illegible]

(Analysis of salts)—ఈపదకళలు నాయుర్వేదమునందును జేరి వచ్చును. ౧౮. పదవిన్యాసములతో శస్త్రసంధానము, విక్షేపము (Handling & flourishing weapons in various postures) ౧౯, ౨౦, ౨౧, ౨౨ మల్లయుద్ధము, ముష్టియుద్ధము, బాహుయుద్ధము, నియుద్ధము (Wrestling) ౨౩. కలాక్షిలక్షితము గురిస్థానములందు యంత్రాద్యస్త్రములను బ్రయోగించుట (Discharging machines and other weapons in the most effective manner( ౨౪. వాద్యసంకేతముల ననుసరించి సేనావ్యూహములు రచించుట (Various formations of the army with instructions from the band and other musical instruments) ౨౫. గజాశ్వరథములపై నుండి యుద్ధము చేయుట (Fighting on horses and elephants and in chariots) ఇవి ధనుర్విద్యకు సంబంధించినవి. ౨౬. వివిధాసన ముద్రలతో దేవతలను సంతోషపెట్టుట (Various yogic postures) ౨౭. సారథ్యము, గజాశ్వశిక్షణము (Charioteering and the training of horses & elephants) ౨౮. మన్ను, కలప, రాయి, ఇతర ధాతువులు. వీనితో కుండలు మొదలగు పాత్రలను చేయుట (Pottery etc.) ౨౯. చిత్రలేఖనము (Drawing) ౩౦. చెఱువులను, నూతులను ప్రవ్వుట, ప్రాసాదములు కట్టుట, ఉన్నస్థలములను సమభూములుగా చేయుట (Digging tanks etc., levelling) ౩౧. హీనమధ్యాన్గర్గములను [illegible] వినోదము గలుగ చేయుట (Painting) ౩౨. జలము, వాయువు, అగ్ని వీనిని సంయోగము చేయుట, ఆటంకపెట్టుట (Use of water, air and fire for offencive purposes and checking their offencive action) ౩౩. నౌకలు, రథములు మొదలగు యానములను నిర్మించుట (Building ships, chariots etc.) ౩౪. సూత్రములతో త్రాళ్ళు పేనుట (Making ropes out of fibres) ౩౫. దారముతో బట్టలు నేయుట

(Weaving) ౩౬. రత్నపరీక్ష (Testing diamonds) ౩౭. బంగారము, వెండి మొదలగువాని పరీక్ష (Testing gold, silver etc.) ౩౮. కృత్రిమరత్నస్వర్ణములఁ జేయుట (Making artificial gems and gold) ౩౯. బంగారము మొదలగు లోహములతో నగలను జేయుట (Making gold etc., ornaments) ౪౦. లేపనములఁ జేయుట (Preparation of various unguents) ౪౧. చర్మములను మృదువు చేయుట (Tanning) ౪౨. పశువుల చర్మముల నొలుచుట (Skinning) ౪౩ పాలు పితుకుట మొదలు దానినుండి నేయి తీయువఱకుఁ గలజ్ఞానము (Dairying) ౪౪. రవికెలు మొదలగువానిని కుట్టుట (Sewing) ౪౫. నీటియందు బాహువులతో నీదుట (Swimming) ౪౬. ఇంటియందలి వంటపాత్రలను శుద్ధిచేయుట (Clearing of household utensils) ౪౭. వస్త్రసమ్మార్జనము (Washing of cloths) ౪౮. క్షురకర్మ (Barbering) ౪౯. నువ్వులు మొదలగువానినుండి నూనె తీయుట (Extracting oil from various seeds) ౫౦. నాగలినిపట్టి దున్నుట మొదలగు కర్మలు (Agriculture) ౫౧. వృక్షాద్యారోహణము (Ascending trees etc.) ౫౨. ఇతరుల మనోవృత్తి ననుసరించి సేవ జేయుట (Faithful service) ౫౩. వెదురు, గడ్డి మొదలగువానితోఁ బుట్టలు మొదలగు వస్తువులఁ జేయుట (Basket making etc.) ౫౪. గాజుపాత్రలఁ జేయుట (Making glassware) ౫౫, ౫౬. జలసేచనము, జలాహరణము (Letting and witholding water) ౫౭. లోహములనుండి శస్త్రాస్త్రములఁ జేయుట (Making swords and other weapons from metals) ౫౮. గజాశ్వవృషభోష్ట్రములను బెంచుట (Care of elephants, horses, bulls and camels) ౫౯. శిశువులను రక్షించుట, వాని నెత్తుకొనుట, యాడునట్లు చేయుట (Care of infants) ౬౦. అపరాధులను క్రమముగ శిక్షించుట (Punishin

criminals) ౬౧. నానాదేశముల వ్రాతను వ్రాయుట(Learning to write in the characters of different countries) ౬౨. తాంబూలము మొదలగువానిని సమకూర్చుట (Pansupari) ౬౩. ఇతరులకియ్యవలసినదానిని వాలశ్యము చేయుట. ౬౪. తనకు రావలసినదానిని క్రమముగ తెచ్చికొనుట.

---

# అనుబంధము 3

## (౧) అ

---

### చతుష్షష్టికళలు—పురుషోత్తములు.

(శబ్దరత్నాకర నిఘంటువున నుండి యాహరింపఁబడినవి.)

ఇతిహాసము.

ఆగమము.

కావ్యము.

అలంకారము.

నాటకము.

గాయకత్వము.

కవిత్వము.

కామశాస్త్రము. 8

దురోదరము.

దేశభాషాలిపిజ్ఞానము.

లిపికర్మము

వాచకము.

అవధానము.

స్వరశాస్త్రము.

శాకునము.

రత్నశాస్త్రము.

రథాశ్వగజకౌశలము.

మల్లశాస్త్రము.

సూదకర్మము.

దోహదము.

గంధవాదము.

ధాతువాదము.

ఖనివాదము. 24

రసవాదము.

జలవాదము.

అగ్నిస్తంభము.

ఖడ్గస్తంభము.

జలస్తంభము.

వాక్స్తంభము.

వయస్స్తంభము.

ఆకర్షణము.
మోహనము.
విద్వేషణము.
ఉచ్చాటనము.
మారణము.
కాలవంచనము.
పరకాయప్రవేశము.
పాదుకాసిద్ధి. 40
వాక్సిద్ధి.
ఘుటికాసిద్ధి.
ఐంద్రజాలికము.
అంజనము.
దృష్టివంచనము.
స్వరవంచనము.
మణిమంత్రౌషధాదిసిద్ధి.
చోరకర్మము. 48

చిత్రక్రియ.
లోహక్రియ.
అశ్మక్రియ.
మృత్క్రియ.
దారుక్రియ.
వేణుక్రియ.
చర్మక్రియ.
అంబరక్రియ. 56
అదృశ్యకరణము.
దూతీకరణము.
మృగయము.
వాణిజ్యము.
పాశుపాల్యము.
కృషి.
ఆసవకర్మము.
ప్రాణిద్యూతకౌశలము.

---

# అనుబంధము 3
## ౨ (అ)

---

### చతుష్షష్టికళలు (స్త్రీలకుచితములు)

(రఘువంశము 8-సర్గ-66 శ్లో. పై. మల్లినాథునివ్యాఖ్యానమునుండి)

(భోజరాజు వివరించినవి.)

| | | | |
|---|---|---|---|
| గీతము. | | ఉపకరణక్రియ. | |
| వాదిత్రము. | | ఆజీవజ్ఞానము. | |
| నృత్తము. | | తిర్యగ్యోనిచికిత్సితము. | |
| నాట్యము. | | మాయాకృతము. | |
| చిత్రము. | | పాషండసమయజ్ఞానము. | |
| పుస్తకకర్మ. | | క్రీడాకౌశలము. | |
| పత్రచ్ఛేద్యము. | | సంవాహనము. | |
| లిపిజ్ఞానము. | 8 | శరీరసంస్కారకౌశలము. | 24 |
| వచనకౌశలము. | | ఆయప్రాప్తి. | |
| వైలక్షణ్యము. | | రక్షావిధానము. | |
| మాల్యవిధి. | | రూపసంఖ్య. | |
| గంధయుక్తి. | | క్రియామార్గము. | |
| ఆస్వాద్యవిధానము. | | జీవగ్రహణము. | |
| అనురంజనజ్ఞానము. | | నయజ్ఞానము. | |
| రత్నపరీక్ష. | | చిత్రవిధి. | |
| సీవ్యము. | 16 | గూఢరాశి. | |

| | |
|---|---|
| తులావిధి. | నీవీస్రంసనము. |
| క్షిప్రగ్రాహము. | గుహ్యస్పర్శనలోమ్యము. |
| అనుప్రాప్తి. | పరమార్థకౌశలము. |
| లేఖ. | భూషణము. |
| స్మృత్యనుక్రమము. | సమానార్థత. |
| లీలావ్యాపారమోహనము. | ప్రోత్సాహనము |
| (ఫలవ్యామోహము. పాఠాం.) | |
| గ్రహణాదానము. | మృదుక్రోధప్రవర్తనము. |
| ఉపస్థానవిధి. 40 | ప్రక్రుద్ధప్రసాదనము. 56 |
| యుద్ధము. | సుప్తాపరిత్యాగము. |
| రతము. | పరమస్వాపవిధి. |
| గతము. | గుహ్యగ్రహము. |
| స్త్రీపురుషభావగ్రహణము. | సాశ్రుపాతనము. |
| స్వరాగప్రకాశనము. | రమణు వీక్షించుట. |
| ప్రత్యంగదానము. | స్వీయాంశపథక్రియా. |
| నఖవిచారము. | ప్రస్థితానుగమనము. |
| దంతవిచారము. 48 | పునర్నిరీక్షణము. 64 |

# అనుబంధము 3

(అ) ఆ

## చతుష్షష్టికళలు.

### స్త్రీలకుచితములైనవి.

(వాత్స్యాయన కామసూత్రమునుండి)

### భాషావిషయికములు.

చదువుట, ఉపన్యసించుట. — రహస్యభాషల నేర్చికొనుట.

నిఘంటువులు వ్రాయుట, కవిత్వము. — బహుభాషాజ్ఞానము.

శ్లేషకవిత్వము. — పొడుపుకథలు చెప్పుట. 8

సమస్యాపూర్తి. — వాక్చమత్కృతి.

వ్యస్తాక్షరి మొ|| — ఇతరులననుకరించుట.

### గృహసంబంధములగు కళలు.

బట్టలు కుట్టుట. — పిండివంటలు చేయుట.

ద్వారములలో చిత్రవిచిత్రములు గల్పించుట. — చిత్రవిచిత్రములగు [illegible] చేయుట.

శయ్యలమర్చుట. — పానీయములు చేయుట. 16

### దేహాలంకరణము.

చందనాదిద్రవ్యములతో మకరికలు వ్రాయుట. — శరీర[illegible]నలంకారముల నమర్చుట.

సాముద్రికము. 16 — వశ్యము. 32

సుగంధద్రవ్యములను వడియో
గించుట.
పుష్పవల్లులు ముడుచుట.
పూలహారములు చేయుట.
దంతములకు శరీరమునకును,
బట్టలకును రంగువేయుట
కాలికి దిద్దుట, బొట్టు పెట్టుట.
జడవేయుట. 24
వస్త్రములరంగులను మార్చుట
చేతిపనులు.
రేఖాలేఖనము.
చిత్రలేఖనము.
తెరలు వ్రాయుట.
మట్టితో బొమ్మలు చేయుట
[illegible] శిల్పము.
ముగ్గుపెట్టుట.
పూసెజ్జల నమర్చుట 32
పుష్పరథముల నిర్మించుట.
క్రీడావినోదములు.
జౌళ్‌ఖానాల నిర్మించుట.
[illegible]ద్రజాలము.

బాగరములు త్రిప్పుట.
కోడిపందెములు, గొర్రెపందె
ములు మొ॥
చిలుకలకు మాటలు నేర్పుట.
ఒకే వస్తువు ననేకవిధములగాఁ
జేయుట.
హస్తలాఘవము. 40
ద్యూతము.
వశ్యవిద్య.
బహురూపముల ధరించుట.
కూచుమారవిద్య.
శాస్త్రసంబంధములగు కళలు.
అలంకారములలో రాళ్ళనమ
ర్చుట.
గృహాలంకరణము.
వెండిని, అలంకారములను
శోధించుట.
వివిధలోహములఁగూర్చిన
జ్ఞానము. 48
విలువయగు రాళ్ళకును పూస
లకును రంగువేయుట.

బాహ్యచిహ్నములఁబట్టి నిధులయునికిని కనుఁగొనుట.

తోటవని, వృక్షములఁగూర్చినజ్ఞానము.

అక్షరములను చిత్రముగా వ్రాయుట.

మణులనమర్చుట.

పచ్చబొట్లు పొడుచుట.

సంగీతమునకు సంబంధించినవి.

కంఠముతో గానముచేయుట.

వీణాదికములపై వాయించుట.

జలతరంగము.

నాట్యము.

మర్యాదలు నడపుట.

వ్యాయామకళలు.

చిన్నపిల్లలయాటలు.

వ్యాయామక్రీడలు.

నృత్యము.

యుద్ధనైపుణ్యము.

ప్రథమభాగము సమాప్తము.



శ్రీవిద్యానిలయ ముద్రాక్షరశాల:—రాజమహేంద్రవరము, 1921.

## ఈగ్రంథమును వ్రాయుటయందు నాకుపకరించిన

### —* గ్రంథములు *—

---


1. మనుస్మృతి.
2. గౌతమధర్మసూత్రములు.
3. ఆపస్తంబశ్రౌతసూత్రములు.
4. తత్త్వసంగ్రహము : న్యాయబోధిని.
5. ఆంధ్రమహాభారతము : నన్నయభట్టు.
6. ఆంధ్రులచరిత్రము : చిలుకూరి వీరభద్రరావుగారు.
7. శ్రీనాథుని కాశీఖండము.
8. ,, భీమఖండము.
9. అజితపురాణ : రన్న.
10. కర్ణాటకకవిచరితె.
11. రాజమహేంద్రవర చరిత్ర : చిలుకూరి వీరభద్రరావుగారు.
12. Buddhism: Rhys [illegible]vids.
13. Footf[illegible]lls of Indian History: Sister Nivedita
14. Ancient Indian Education: Keay
15. A Hist[illegible]ducation in Ancient India: N. N. Muzumdar
16. Life of [illegible]hsang: Beal
17. Buddhist[illegible] Records of the Western World: Hieun Thsang-Beal
18. Travels of Fa-Hian: Legge

19. Records of the Buddhistic Religion: Itsing Takakusu
20. Rajatarangini: Kalhana: Steins' Translation
21. Systems of Sanskrit Grammar: Belvalkar
22. Antiquities of India: Barnett
23. Sanskrit Literature: Macdonell
24. Hinduism: Monier Williams
25. The Seed of Race; Sir John Woodrofle
26. Bharata Shakti ,,
27. Tamils eighteen hundred years ago: Kanakasabha Pilla
28. Tamil Studies: M. Sreenivasachary
29. Buddha and the gospel of Buddhism: Anand Coomaraswamy
30. Vernaculars as the media of instruction: Modi
31. A History of Indian Architecture: Fergusson
32. The Indian antiquary (From October 1919 onwards) Geographical dictionary of ancient and medieaval India: Nandalal Dey
33. The Dawn Magazine
34. Indian Logic: Satis Chandra Vidyabhushan



# ప్రాచీనాంధ్ర నౌకాజీవనచారిత్రము

గ్రంథకర్త: శ్రీయుత భావరాజు వేంకటకృష్ణారావు గారు, బి. యే. బి. యల్.

పూర్వము ఆంధ్రు లేయే దేశములతో, ఏయే ద్వీపములతో వర్తకముచేసిరో, ఎగుమతి దిగుమతులెట్లుండెడివో ఏయే రాజులకాలమున సముద్రవర్తకమునకు ప్రోత్సాహము కలిగెనో, ఆంధ్రులు పూర్వ మేయే చోట్లకు సముద్రప్రయాణముచేసి, ఎచ్చటెచ్చట హిందూవలస రాజ్యములను, హిందూనాగరికతను స్థాపించిరో యీసంగతులన్నియు నిందు విపులముగ వివరింపఁబడినవి. అపూర్వగ్రంథము. ప్రతిఆంధ్రునియింట నుండఁదగినది. ప్రతిగ్రంథాలయమున, పాఠశాలలోను ఉండవలసిన గ్రంథరాజము.

వెల రూపాయి (పోస్టేజికాక)

# అమరావతీస్తూపము, ఇతర వ్యాసములు

గ్రంథకర్త: మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

ఇందు ప్రాచీనాంధ్రదేశము కీర్తిని ఖండాంతరములంద కూడ చాటిన ‘అమరావతీస్తూపము’, చారిత్రమును, ‘ప్రాచీ విద్యావిధానము’, ‘మన ప్రాచీనవిద్యాసంస్థలు’, ‘అనాదృతవా జ్మయము’, ‘బౌద్ధవాఙ్మయము-పరిశోధన’ అను విషయము లనుగూర్చిన వ్యాసములును గలవు. మన పూర్వపు ఔన్న మును, ప్రశస్తిని తెలిసికొనుటకు తప్పక చదువవలసిన గ్రం మిది.

వెల పంద్రెండణాలు (పోస్టేజికాక)

National Library
Calcutta-27

1-10 పుటలు లాంధ్ర ముద్రణాలయమునందు ముద్రింపఁబడినవి,
ఎగ్మూరు, మదరాసు : ౧౯౩౭.